# పోతన ఆంధ్రమహాభాగవతమున

# భక్తిశృంగారములు



ప్రథమ ముద్రణము
( మే 1990 )

ప్రతులు : 1000



వెల : రూ. **50/-**

ప్రతులకు : **శ్రీమతి కె. వనజ**
C/o. డా. కె. వి. కె. సుబ్బరాజు
లెక్చరర్
పి. జి. తెలుగు శాఖ
డి. యన్. ఆర్. కాలేజి
భీమవరం - ప॥ గో॥ జిల్లా

---

: ముద్రణ :
*శ్రీ కౌసల్యా ప్రింటర్స్ & బైండర్స్ : భీమవరం - 1*



THIS BOOK IS PUBLISHED WITH THE
FINANCIAL ASSISTANCE OF
**TIRUMALA TIRUPATI DEVASTANAMS**
UNDER THEIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS

మ. నరజన్మంబును సార్థకం పఱుమ విజ్ఞానంబుచే భక్తి బం
ధుర శృంగార కళా సమాకలిత సద్యోగంబు సంధించుచున్
బురుషార్థం బొనఁగూర్చు భాగవతమున్ దొల్పారఁగల్పించు బ
మ్మెర పోతన్నకు వందనంబిడ వచో మీనాక్షి ధ్యానింపదే.




# కృతిసమర్పణము

సీ. గట్టుముక్కల వంశ కువలయ కువలయే
శ్వరుఁడు సీతారామభద్రరాజు
వీరిడావతిరాజ్ఞి హంసామణీదేవి
నిర్మల స్వాంత తద్ధర్మపత్ని
ఏపు మీఱిన ప్రేమ నీ పుణ్య సంపదు
లస్మదీయ క్షేమ మహరహంబు
నరసి నన్ ఋణబద్ధు నాచరించుట వారి
యానృణ్యమునకు చిహ్నంబు గాఁగ

గీ. సుకృతి పోతనార్యుని పరిశోధనంపు
గ్రంథమిది యంకితం బిత్తు గాఢభక్తి
పోతనామాత్యు నేలిన భూసుతా ర
ఘూత్తములు వీరి రక్షింప చుండ్రి గాక !

# పరీక్షక నివేదిక

"పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు" అను శీర్షిక గల సిద్ధాంతవ్యాసమును పరీక్షించితిని. ఒక ఉత్తమ సిద్ధాంత వ్యాసమును పరికించితినన్న సంతృప్తితో అందలి గుణములను నిరూపింపుచున్నాను.

1. పోతన భాగవతముపై ఇంతకుముందు అనేకపరిశోధన వ్యాసములు, విమర్శ గ్రంథములు వెలువడియున్నవి. మరల దానినే యధికరించి పరిశోధనకు పూనుకొనుట - ఒక విధముగా - సాహసకార్యమే. అయినను ఆ సాహసము అస్థానపతితము, అఫలముకాక పోవుటయే కాదు, సుందరరసవద్గ్రంథసముద్భూతికి హేతువై యొప్పారినది.

2. భక్తిని గూర్చిన పరిశోధనకు శృంగార సంపర్కము కూర్చుటతో పరిశోధకుడు బంగారమునకు పరిమళము సంతరించినాడను భావము నాకు కలిగినది

3. పరిశోధకుని దృష్టి యటు శాస్త్రవిషయములలో ఎంత గాఢమో యిటు విషయనిరూపణమున అంత వాడిగా నున్నది.

4. గ్రంథమును ఉద్ధారములతో నుంచియెత్తక విషయవివరణమును విశద మొనర్చుటకై ప్రయత్నించిన తీరు ప్రశంసాపాత్రమగుచున్నది.

5. విషయ ప్రతిపాదనమున వ్యాకరణసూత్రమునందు వలె త్యాజ్యము లేనట్టి చిక్కందనమును సాధించిన ధోరణి అచ్చెరువు గొలుపుచున్నది.

6. నా హోపాసకుడగు పోతనామాత్యుని కవితానుశీలనమును నాద మాధుర్యసంకలిత సుందరశబ్దవిన్యాసభూయిష్ఠ వాగ్విశేషమున నిబంధించుట హృదయమును నెంతయు నాకట్టుకొన్న మహాగుణము.

7. ముఖ్యముగా 8, 9, 10, 11 సంఖ్యలుగల అధ్యాయములు పరిశోధకుని స్వీయం వ్యక్తిత్వమును చక్కగా నిరూపించుచున్నవి.

8. గ్రంథమున నూతన సంప్రదాయ ధోరణి పరిహరింపబడినది.

9. ఈనాటి సాహిత్య పరిశోధకుల కొక మేలు బంతియై యలరారు ఉత్తమస్థాయిలో ఈ గ్రంథము రూపొందినది.

*ఇట్టి ఉన్నత ప్రమాణములు గల ఈ సిద్ధాంత వ్యాసము సర్వ విధముల Ph. D. పట్ట ప్రదానమున కర్హమై యున్నదని నా తీర్పు.*

దక్షతని, దీక్షని పరమార్థసౌందర్యముగల వ్యాసమును సమర్పించిన అభ్యర్థిని, దానికి నేతృత్వమును వహించిన ఆచార్యుని మనసార అభినందింతును.

*(Sd/-) Prof. S. Raghunatha Sarma*
Dept. of Telugu - S. K. University
Sri Venkateswarapuram (P. O)

ANANTAPUR
27-10-1988



# అభినందన మందారములు

డాక్టర్ కనుమూరి బలరామకృష్ణ సుబ్బరాజుగారు నా ఆప్త శిష్యులై, నా పర్యవేక్షణలో దీక్షాదక్షతలతో కూడిన సరససాహితీ సమధిక పరిశోధన చేసి సహజకవితా పురంధరుడైన పోతనార్యుని ఆంధ్రమహాభాగవతమందలి భక్తిశృంగార రసములపై ఈ సునిశిత సిద్ధాంతవ్యాసమును ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు సమర్పించి 1989 సం||లో పిహెచ్ డి. డిగ్రీ పారితోషికమును పొందినారు.

ఈ గ్రంథము సుబ్బరాజుగారి ప్రౌఢమైన సాహితీ పరిశీలనాత్మక దృక్పథము నకు, పరిశోధన పటిమకు, విమర్శనా వైశారద్యమునకును శాశ్వత ప్రతీక. భక్తి కవీంద్రుడైన పోతనార్యుని వివిధ భక్తిభావ బంధుర శృంగార రస విన్యాస వైఖరిని ఈ రచయిత సాంగోపాంగముగ ప్రదర్శించి యున్నారు. భక్తి శృంగారములకు గల అవినాభావసంబంధ మిందు దృష్టాంత పూర్వకముగ నిరూపింపబడినది. పోతన కవితా నైజ తత్త్వమును పిండీకృత రూపమున ఆంధ్ర సహృదయ పాఠక లోకమునకు ఇది అందించుచున్నది. తత్సుధా మధుర రసధారా విశేషములను ఏత ద్గ్రంథ సత్పాత్ర ద్వారా సహృదయ పాఠకులు ఆస్వాదించి తరింతురు గాక !

మధుసూదన సరస్వతి, రూపగోస్వామి, జయదేవుడు, లీలా శుకుడు మొ|| ఋషితుల్యులైన భక్త కవీంద్రులు పవిత్ర సంస్కృత సాహితీ క్షేత్రమున లక్షణలక్ష్య సమన్వయ మార్గములలో ఆత్మకవితా మధుర సంస్పర్శతో భక్తికి శాశ్వత రసప్రతిపత్తిని కల్పించినారు. తన భాగవతాంధ్రీకరణములో ప్రముఖ భగవద్భక్తుల నిర్మల వృత్తాంతముల నాధారముగ జేసికొని కేవలము లక్ష్యైకదృష్టితో భక్తిభావము నకు రసరూపపట్టమును గట్టి ఆంధ్ర కవితా సరస్వతి నలరించినాడు. "తను హృద్భాషల సఖ్యమున్..." అను పద్యములో ప్రతిపాదింపబడిన నవవిధ భక్తిమార్గ ములను, "కామోత్కంఠత గోపికల్" అను పద్యములో పేర్కొనబడిన గోపికాదులు ఆయా భక్తిమార్గముల నాశ్రయించి తరించిన రీతులను ఈ గ్రంథకర్త చక్కగా వివరించియున్నారు. భగవంతునికి ఆబద్ధశత్రువుగా జీవించి జన్మాంతర సంస్కార

ప్రభావముచేత తరించు మహోదాత్తమార్గము కేవలము మనభారతీయ భవ్యసంస్కృతిలో తప్ప తదితర సంస్కృతులందు నెచ్చటను కానరాదు. ఇట్టి విలక్షణ భక్తిమార్గమును ఆంధ్రభాగవత రచనా రూపమున లోకమున కందించిన పోతనార్యుడు ధన్యుడు. ఇట్టి పోతనార్యుని భక్తి శృంగార రసరమణీయక రచనా సన్నివేశములను ఆత్మ పరిశోధనాత్మక వ్యాసరూపమున లోకమున కందించిన డాక్టర్ సుబ్బరాజుగారు ప్రశంసాపాత్రులు

శ్లో॥ జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్

అను నార్యోక్తికి పరమలక్ష్య భూతుడైన పోతనార్యుని రసస్థితిని, కవితా సుందర నాద సాహచర్యమును, ప్రగాఢ పరిష్వంగ రూపమున పెనవేసికొనియున్న భక్తి శృంగారములను ప్రపంచించి ఆత్మరచనా రూపమున ఆ భక్త కవిపుంగవుని కవితా పరకాష్ఠ శాశ్వత ప్రతిపత్తికి కైవారము లర్పించిన డాక్టర్ సుబ్బరాజునకు నా హార్దికాభినందన మందారములు.

*(Sd/-) Dr. K. Venkata Rama Raju*
Reader (Rtd) P. G. Dept. of Telugu
D. N. R. College

**BHIMAVARAM**
**1-5-1990**



# కృతజ్ఞతా నివేదనము

1988 మేలో పిహెచ్. డి. పట్టము కొఱకు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు సమర్పించిన పరిశోధన గ్రంథమిది.

ఈ గ్రంథ ముద్రణకు అనుమతించిన "ఆంధ్రవిశ్వకళాపరిషత్తు" అధిష్ఠానవర్గమునకు, డి. యస్. ఆర్. కళాశాలాధ్యక్షులు శ్రీయుత గోకరాజు రంగరాజు మహోదయులకు, కార్యదర్శి శ్రీ డి. బాపిరాజుగారికి, పాలకవర్గ సభ్యులకు, మాజీ ప్రిన్సిపాల్ శ్రీ యస్. బంగార్రాజుగారికి, ప్రస్తుత ప్రిన్సిపాల్ శ్రీ డి. వి. ఎ. నరసింహరాజుగారికి, పి. జి. మాజీ తెలుగు హెడ్ డా॥ వేంకటరాజుగారికి మరియు ఆర్థిక సాహాయ్యమందించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా అభివాదములు.

[illegible] సమకూర్చిన [illegible] పరిశోధనార్థం సహకారము అందజేసిన ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర, నాగార్జున, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయములకు, ఆం. ప్ర. ఇంటర్ మీడియేట్ ఎడ్యుకేషన్ బోర్డులకూ అనుబంధాలుగా ఉన్న ప్రయివేటు [illegible] యాజమాన్యాల సంఘానికి జనరల్ సెక్రెటరీ మరియు ప్రముఖ న్యాయవాది శ్రీ జి. [illegible] గారికి, వారి సతీమణి శ్రీమతి [illegible] గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

పరిశోధన వ్యాసంగమునకు పర్యవేక్షక పదవినంగీకరించి అమూల్య సూచనలిచ్చి అభినందన తెల్పిన గురువరులు ఆచార్య డా. కలిదిండి వేంకటరామరాజుగారికి, తమ అమూల్యాభిప్రాయ నివేదికలను ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు సమర్పించిన ఎడ్జుడికేటర్‌లకు, తన నివేదికను ముద్రింపకొనుటకు ఆమోదము ఇచ్చిన గురుసమానులు బ్రహ్మశ్రీ ఆచార్య ఎస్. రఘునాథశర్మ మహోదయులకు, మౌఖిక పరీక్షాధికారులకు నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

నా పరిశోధనకు కావలసిన గ్రంథాలనందించిన డి. యస్. ఆర్. కళాశాల గ్రంథాలయాధికారులకు, పి. జి. విభాగ గ్రంథాలయాధికారులకు, వీరేశలింగ సమాజ గ్రంథాలయము (కుముదవల్లి) అధినేతలకు, నా పరిశోధనకు ఉపయోగించిన గ్రంథముల రచయితలకు నా కృతజ్ఞతాంజలి.

ఈ గ్రంథమును శ్రద్ధాసక్తులతో మనోహరముగా ముద్రించిన మిత్రులు శ్రీ కౌసల్యా ప్రింటర్స్ వారికి ముఖపత్రప్రణేత శ్రీ భాస్కర్‌కు నా హార్దిక ప్రశంసలు.

కె. వి. కె. సుబ్బరాజు

# అనుక్రమణిక

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 1. ఆంధ్రభాగవతావతరణము

ఆంధ్రసాహితీనందనోద్యానవనమున మనోజ్ఞసురభిళ ప్రసూన సంభరితములగు కావ్యలతాగుల్మము లనేకములు గలవు. ఆరంభదశ లోనే అనగా పదునొకొండవ శతాబ్దియందే ఆంధ్రభాషలో ప్రప్రథమముగా నన్నయభట్టారకుని చేతినుండి ఏతత్కావ్యలతాంతసముద్గమము జరిగినదని చెప్పవచ్చును. ఆయనకు ముందు వందలాది సంవత్సరముల నుండి త్రిలింగ దేశమంతట నాంధ్రభాష వాడుకలో నున్నను దానికి కావ్యరూప మబ్బలేదు. కవితాస్వరూపములో కూడ దేశీయచ్ఛందఃప్రయోగము మాత్రమే యప్పటికి కలదు. సమగ్రమగు నాంధ్రకవిత్వమును మన కందించిన ఆదికవి నన్నయభట్టారకుఁడే. ఆతఁడు నాటిన మొక్కను తిక్కన మహామనీషి మొక్కవోని పగ్గెతో చక్కగా సాఁకి అనూలాగ్రప్రవాళవ్యామిశ్రముగా తీర్చిదిద్దినాఁడు. దానికి తప్పుంగల చక్కందనములు పుక్కిటబంటిగా నలవరించిన మహాకవుల కోవలో నన్నెచోడుడు, పాల్కురికి సోమన, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచన సోమనాథుఁడు మొదలగు వారెల్లరు ఆంధ్రభాషాప్రియంభావుకులకు ప్రాతఃస్మరణీయులే.

సంస్కృతభాషకు రామాయణమెట్లో ఆంధ్రభాషకు కవిత్రయ విరచిత మహాభారత మట్లే ఆదికావ్యమై, ధర్మార్థకామమోక్షచతుర్విధ పురుషార్థఫలప్రాపకమై, ఇహాముత్రసకలేష్టఫలావాప్తివిస్తారమై, సకల

[ద]దశాస్త్రపురాణేతిహాసకథాసుధారసస్థానమై ఆంధ్రులందఱకు నుదయ[కా]లమందే చర్చింపబడసినదయ్యెను. మహాభారతరచనాకాలమున వ్యాసభట్టారకుడు వ్రాసుచ్చిన విధముగనే ఆంధ్రమహాభారతము సమగ్రముగను, నవీనముగను నిర్వహింపబడుట ఆంధ్రుల సదృష్టము. మహాభారతమందు చతుర్విధపురుషార్థములకు సంబం[ధి]ంచిన విషయమంతయు వ్యాసభట్టారకుడే సమగ్రముగ పడిల రచెను. ఆ పురుషార్థము లన్నియు సంగ్రహస్వరూపముచే నద్దము[న]ందలి కొండవలె ఆంధ్రమహాభారతమున కవిత్రయముచే అనూ[ది]తము లయ్యెను. అందుచేతనే దానికంత ప్రశస్తి కలిగెను

నన్నయ కాలమునుండి ఎఱ్ఱన కాలము వఱకు అనగా పదునొ[కొ]ండవ శతాబ్దినుండి పదునాల్గవ శతాబ్ది వఱకు జరిగెన కాలమును [కా]లముగ నాంధ్రీకరణయుగ మని కొందరభిజ్ఞులు వాకొందురు. ఈ [య]ుగములో హుళక్కి భాస్కర ప్రణీతమగు భాస్కరరామాయణము [ఆ]ంధ్రకావ్యప్రసూనములలో ద్వితీయమయ్యును అద్వితీయకవితారస[ప్ర]సూనరాజముగా విరాజిల్లినది. భాస్కరమహాకవి కవిత్రయాధిష్ఠిత[సి]ంహాసనోపాంతమహాంధ్రకవితాసింహాసనారూఢుడై రామకథాసుధా[వి]ధా శానిరాక్షేపణీయకవితావైభవుడై కీర్తివహించెను. అప్పటికి [ఆ]ంధ్రులకు ఒక చేతికి భారతము, మరొక చేతికి రామాయణము [చ]క్కముగా దక్కినట్లైనది. ఇక ముఖ్యముగాదక్కవలసిన యితి[హా]సములలో భాగవతమొక్కటే తక్కువయ్యెను. ఆలోటు తీర్చగల [మ]హనీయుడెవ్వడు ? తెలుగు తల్లి మొల్లమగు మూర్తికి హనీయ [స్ఫ]ూర్తి కూర్చగల ప్రజాకవి యెవ్వడు ? భక్తిశృంగారరసప్రవాహ[ము]ల కేతము లెత్తి తురీయ పురుషార్థకేదారముల పండించగల భక్త[భా]గవతంసుడెవ్వడు ?

మ. "ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెదఁబునర్జన్మంబు లేకుండఁగన్."
(ఆం. మ. భాగ. 1-19)

నన్నయాది మహాకవులు భారతాది మహాకావ్యములను తెనిఁగించిరి. భాగవతమును మాత్రము తెనిఁగింపరైరి. అట్లు దానిని తెనిఁగింప కుండుట పోతన తన పురాకృతసుకృతవిశేషముగ పరిగణించుట యాతని సౌశీల్యమును, పూర్వకవివృషభులపట్ల తనకుఁగల భక్తి ప్రపత్తులను వేనోళ్ల చాటుచున్నది. విద్యావివేకసంపన్నుఁడెందును వినయధనుఁడై యుండును. "విద్యాదదాతి వినయమ్...." (హితోపదేశము-ప్రస్తావికా-6) అని చెప్పినట్లుగా పోతనవంటి విద్యాధికులు వినయధనులై, జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనులై, అనన్యభక్తిభావభావనాప్రఫుల్లమనః పద్ములై యుందురు. అట్టి వశ్యవాక్కుల ముఖపద్మములనుండి వాక్సుధారసధారలే ధారాధర ధారావాహికముగా వినిర్గతము లగుచుండును.

ఆ. "భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత కన్నంత
దెలియవచ్చినంత దేటపఱుతు." (ఆం. మ. భాగ. 1-17)

అని పోతనార్యుఁడు వినమ్రస్వభావుఁడై భాగవతసమగ్రప్రభావమును తెల్లము గావించినాఁడు. భగవత్తత్త్వమిట్టిదని నిర్వచించి చెప్పుట శివబ్రహ్మాదులగు పరమపురుషులకే దుర్లభమన్నచో జననమరణపరంపరాప్రవాహరూపసంసారఝరీపతితులగు మానవమాత్రు

ఎంతటివారు ? పండితులు చెప్పినది, తానూహించుకొన్నది. తనకర్థమయినది, తనకు కనవచ్చినది, తాను చెప్పగలిగినది మాత్రమే చెప్పుటకు ప్రయత్నింతునని వినయాన్వితుఁడై సరసగంభీరముగ చెప్పగలుగుట ఒక్క పోతన్నకే దక్కినది. ఇప్పట్టున విజ్ఞులు ఒక విశేషమును గమనింపవలసియున్నది. వేదాంతము ఆచరింపవలసిన విషయమే గాని వర్ణించి నిరూపింపఁదగిన విషయము కాదు. ఆధ్యాత్మిక రంగములో ఆచరించి అనుభవింపవలసి యుండునేగాని చూచి వర్ణించవలసిన విషయ ముండదు. కవిత్వ మట్లుకాదు కవి భావించి, అనుభవించి, వింగడించి అక్షరము, శబ్దము, వాక్యము, అలంకారము, ఛందము, రసము, ధ్వని మొదలగు కొలమానములతో కమనీయముగా వర్ణించి వస్తుసమగ్రదర్శనమునకు బ్రహ్మానందసబ్రహ్మచారి యగు రసానందమునకు సోపానములు కట్టుచుండును. రసానందమునకు పైమెట్టుపై బ్రహ్మానంద మను అనుపహితశుద్ధచైతన్యస్ఫూర్తి ప్రకాశించుచుండును చేతికందెడి వస్తువులతో నూహకందని వస్తువును కొలుచుట యెట్లు? అడుగు బద్దతో అనంతమగు ఆకాశమును కొలుచుట యెట్లు? శబ్దము, అలంకారము, ధ్వని, వ్యంగ్యము మొదలగు కొలమానములతో అనంతచిన్మాత్రమూర్తియగు భగవంతుని నిరూపించుట దుర్లభమని తేలుచున్నది. ఈ భావమునే పోతన కర్వాచీనుఁడగు ధూర్జటి
"ఏ లీలన్ గొనియాడనేర్తు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్య...." (కాళహస్తీశ్వర శత. 51) అను చక్కని పలుకులలో నొక్కి చెప్పెను.

అసలు వేదవ్యాస మునీంద్రునకు భాగవత మేల వ్రాయవలసి వచ్చెను? జగద్ధితరతుఁడగు నమ్మహనీయుఁడు వేదములను ఋగ్యజుస్సామాథర్వణములుగా విభాగించి, పురాణేతిహాసములను విరచించి

వేదములు చదువఁదగని వారల మేల్గోరి భారతమును వినిర్మించెను. అయినను ఆతనికి తనివి సనదాయెను. ఆత్మలో మునీశుఁడు సంతసింపఁడాయెను. సరస్వతీనదీతీరమున నొంటరిగా కూర్చుండి దుఃఖించుచుండెను. మహనీయుఁడగు నతని దుఃఖము నపనయింప నయవిశారదుఁడగు నారదుఁడచ్చటి కేతెంచెను. "జ్ఞానవిజ్ఞాన తృప్తాత్ముఁడవగు నీవీ విధముగా శోకింప కారణమే" మని యడిగెను. అనంతమగు తనవంత దీరు నుపాయ మెఱిగింపుమని పారాశర్యుఁడు నారదు నర్థించెను నారదుఁడపుడిట్లు చెప్పెను. "ఆర్యా! నీవు సమస్త ధర్మములను ప్రపంచించితివి. వానియందు హరికథలు సమగ్రముగా చెప్పనేరవైతివి. హరిని గొనియాడమియే నీ దుఃఖమునకు కారణము. అందుచే మాధవకథాసుధానిధానమగు నొక్క భక్తి ప్రధానమగు కావ్యంబును వినిర్మింపు" మని ప్రబోధించెను. నారద ప్రచోదితుఁడై వేదవ్యాసుఁడు భాగవతమహాకావ్యనిర్మాణబద్ధస్పృహుఁ డాయెను. వ్యాసునంతటి యాత్మజ్ఞునకు కూడ భవాత్మకమగు సంతాపము తప్పదాయెను. అట్టి సంతాపము నపనయించుటకు హరికథాగానమే కాని వేఱొండు దివ్యౌషధ మీ జగానఁగానమని వేదవ్యాసమునీంద్రుఁడే లోకములకు నిరూపించి ప్రపంచించెను. ప్రపంచమందలి యే భాషయందైనను ఒక్కొక్క మహాకావ్యప్రారంభము తత్త్వజ్ఞన పురాకృత సుకృతముచే నొక్కొక్క పుణ్యముహూర్తమున జరుగుచుండును. యాదృచ్ఛికముగా సంభవించు నొక్కొక్క సంఘటనయే కారణముగా నుద్భవించు నక్కావ్యము రసభావరమణీయభావనాసమంచితముగ, రసికజనహృదయానందసంధాయకముగ నుద్గమించు చుండును. వ్యాసభట్టారకప్రణీతమగు మహాభాగవత మిట్టిదే.

వేదము కల్పతరుసదృశము. తత్ఫలమే భాగవతము. భక్తసత్తముఁడగు నారదునుండి రసోత్తరమగు నాఫలమును వేదవ్యాసుఁ

కందుకొని శుకముఖన్యస్తము గావించినాడు. అమృతబిందుస్యంది యగు నాఫలము శుకముఖమునుండి పుడమిపై బడెను. రసానంద సమ్మిళితమగు తద్రసము నాను మహనీయులకు బ్రహ్మానందము సుదూరము కానేరదు. అట్టి భాగవతము అట్టిదిట్టిదని చెప్పబూనుట చాపల్యము. దుస్సాహసము.

పోతన పూర్వులెల్లరు శైవమతావలంబులు. పరమ మహేశ్వరాచార సంపన్నులు. పోతన కూడ కొంత కాలము శైవుడుగా నుండి పిమ్మట చిదానందయోగిచే తారకమంత్రోపదేశమునొంది వైష్ణవుడై నాడు. అయినను అద్వైత మతావలంబియే. తిక్కన కాలమునాడు హోరాహోరిగ మాదుమ్రోగిన శైవవైష్ణవవిద్వేషభేదభావములు పోతన కాలము నాటికి కూడ పూర్తిగ సన్నగిల్లలేదు. అంతఃకలహములతో, ఈర్ష్యాద్వేషములతో, పరస్పరద్రోహచింతనములతో వికావికలైన సామాజికులెల్లరను ఇహమునుండి పరమునకు మళ్ళించగల ఒకానొక శక్తి అవశ్యకమయ్యెను. ఆ శక్తికి మూలకందము పోతన్న. ఏతత్కృతమగు నాంధ్రభాగవతకల్పమంజరి తన సౌరభములతో దిగంతపరివ్యాప్తమై దుర్గంధబంధురమగు నాటిసమాజము నా సాంతముగ క్షాళనము గావించవలసియున్నది. పోతన కన్నులు మూసికొని నాడు. పవిత్రనదీసైకతమున పద్మాసనస్థుడై పరమేశ్వరధ్యానము గావించు నమ్మనీషికి శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించినాడు. ఇది యేమి వింత ? ఈశ్వరుని ధ్యానించుటేమి ? శ్రీరాముడు ప్రత్యక్షమగుటేమి ? ఇదియే చమత్కారము. వస్తువులందలి భేదము కంటిని బట్టి వచ్చునదిగాని వస్తుతత్త్వమును బట్టికాదు. సామాన్యుల విషయములో శైవవైష్ణవులు పరస్పరదర్శనస్పర్శనాదు లుజ్జగించి దూషణ తిరస్కారాదుల కుపక్రమింతురు. కాని హరిహరుల కాభేదము లేదు.

"ఏకోనారాయణః కేశవోవాశివోవా" అను నద్వైతోక్తుల ననుసరించి శివుఁడే విష్ణువు విష్ణువే శివుఁడని పోతన తన అద్వైతారాధన తత్త్వమును చక్కగా నిరూపించినాఁడు.

కలికాలములో మనుజు లలసులు. మందబుద్ధులు. దుర్ణీతులు. అట్టివా రీభాగవతమును విన్నతోడనే ముక్తికాంతాకరగ్రహణ మాచరింప నర్హులగుదురు. శుకమహర్షి పరీక్షిన్మహారాజునకీ భాగవతమును వినిపించి మోక్షలక్ష్మీ సామ్రాజ్యమును జూఱలిచ్చెను. అది చూచిన బ్రహ్మకే రిమ్మ తెగులు పుట్టెనటు! వేదాంతశ్రవణము కంటె, గీతా పారాయణము కంటె, భాగవత కథా శ్రవణము చేతనే భక్తి జ్ఞానవైరాగ్యము లిబ్బడిముబ్బడిగ కరాయత్తము లగుచుండునఁటు! భాగవత మిట్టిది కావుననే తన్మహాదాశయ సంపత్తితో కావ్య శ్రీకారము చుట్టుచు పోతన్న అది తన భాగ్యవిశేషమని ఆనందించినాఁడు. 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్,' అను శాస్త్ర సంప్రదాయము ననుసరించి ప్రాచీన కవితల్లజులెల్లరు ఆశీస్సుచేతగాని, నమస్కారముచేత గాని, వస్తునిర్దేశాత్మకముగా గాని కావ్యారంభము గావించిరి. వారి ననుసరించియే పోతన నమస్క్రియాత్మకమగు కావ్యారంభము గావించి కృతికి శ్రీకారము చుట్టెను. భూదేవతాకమగు 'మ' గణము వాయుదేవతాకమగు 'స' గణమును మేళవించి, శుభాంచితముగా నిరర్గళధారాసముదాత్తమగు శార్దూలవృత్తముతో భాగవత ప్రారంభము గావించెను.

శా. "శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్, లోక ర
క్షాకారంభకు, భక్తపాలనకళాసంరంభకున్, దానవో
ద్రేక స్తంభకుఁ, గేళిలోలవిలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాతభవాండకుంభకు, మహానందాంగనాడింభకున్."

(ఆ. మ. భాగ. 1-1)

అను భక్తిభావబంధురమనోహర పద్యము ఆంధ్రభాగవత వాణీ శిరోభూషణముగ నలరారు చున్నది. పోతన మహాభక్తుడు. శ్రీరామ పదపంకరుహనిరంతరసేవాసక్తుడు. నవవిధభక్తిమార్గములలోచింత నంబనునది తొమ్మిదవది. అందుచేతనే పైపద్యములో 'చింతించె దన్' అను క్రియా పదమును నిబంధించి భక్తిభావభావనాబంధురమగు స్వీయనిష్ఠాగరిష్ఠతను పటిష్ఠము గావించినాడు. సామాన్య కవులు పొట్ట కూటికై కావ్యము లల్లుచుందురు. ముముక్షువగు పోతన బుభుక్షువు లగు కవిసామాన్యులవలె గాక అలౌకికానందసంధానచణమగు మోక్ష లక్ష్మీసామ్రాజ్యవైభవాభిలాషతో కృతి చెప్పినాడు. భక్తకవి శేఖరుల లక్ష్యశుద్ధి ఇట్లే యుండును. తురీయ పురుషార్థకాంక్షయగు మనీషి కీలోకముతో సంబంధ మేముండును? అట్టివాడు కవిత్వమేల వ్రాయవలెను? అట్టివానికి జగద్ధితమే పరమప్రాపణీయ మగు వస్తువుగా కన్పించును. వ్యాసుడందులకే భాగవతము చేపట్టెను. పోతన యందులకే తదాంధ్రీకరణమునకు పూనుకొనెను. తాము తరించి పరులను తరింపజేయవలెనని కదా అభియుక్తోక్తి! తాము తరింపవలెనన్నను, పరులను తరింప జేయవలెనన్నను హరికథా గానముకంటె నతిరిక్తమగు మార్గము లేకుండుటచే పోతన కూడ ఆ మార్గమే యనుసరించినాడు. తొలి పద్యములోనే పోతన కావ్యార్థ సూచనమును గావించినాడు. అనందాంగనాడింభకుని కొరకై తాను నందాంగనాడింభకుని (శ్రీకృష్ణుని) చింతించునట. లీలామానుష విగ్రహుడగు నాకృష్ణుడె సమస్త కల్యాణ గుణార్ణవుడగు శ్రీమన్మహావిష్ణువు. లోకరక్షణార్థమై దశావతారము లెత్తినాడు. భక్తజనుల నెల్లర ననురక్తుడై ప్రోచినాడు. దుష్టదానవమారణకారకుడైనాడు. విలాసమాత్రముగ జగముల సృజించినాడు. యశోదపట్టియై ముద్దులుమూటగట్టినాడు. ఈ చేతలన్నింటితో భాగవతకథా సర్వస్వము స్పష్టమయినద

! ఏవంవిధకావ్యకథావస్తునిర్దేశము ఇతర కావ్యసామాన్యము మనము సకృత్తుగా చూడఁగలము. ఈ పద్యమందలి బిందు ;క భకార పునరావృత్తిచే నందమగు నంత్యానుప్రాసమును ప్రయో ౹ తాను సాగించు రచనలో నర్థముతో పాటుగా శబ్దమున కీనున్న ధాన్యమునుగూడ సూచించినాఁడు. పోతనార్యుఁడు తన భాగవత ంలో భక్తిశృంగారకమనీయవిన్యాసములకు సముచితధ్వని ప్రధాన భంగిమలను మేళవించి సంగీతసాహిత్యముల నేకోన్ముఖముగ ంనాఁడు

గుణచింతనమున కర్థము పనికివచ్చును. గుణకీర్తనమునకు ము పనికివచ్చును. శబ్దము శరీరమువంటిది. అర్థము ప్రాణము టిది. శరీరము లేనిదే ప్రాణము లేదు. ప్రాణము లేనిదే శరీర ండదు. ఇట్టి శబ్దార్థముల యన్యోన్య సంబంధమును కవికుల తిల డగు కాళిదాసు తన రఘువంశకావ్య ప్రారంభమున—

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ॥" (రఘు. 1-1)

శ్లోక రూపమున మనోహరముగ చెప్పియున్నాఁడు. అక్షర రమ్యుఁ ప నాదికవి నన్నయ వలెనే భక్తకవిసత్తముఁడగు పోతన్నయు గవతమును శబ్దమాధురీధురీణముగ రచించి ఆంధ్రకవితా కేదార ంలఁబండించి ధన్యుఁడయ్యెను.

ఇట్లు పోతనామాత్యుఁడు అద్వైతభావబంధురమైన భక్తిరస ప్రధాన కవితామాధురీమనోజ్ఞమగు భాగవత గ్రంథమును సంప్ర ాయాంతర విరోధాభావముగ రచించి అంధ్రప్రాకమహాజనులకు ానుక పెట్టి తాను తరించి ఎల్లఱను తరింప చేసినాఁడు.

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 2. పోతన జీవితచరిత్ర

I. పోతన వంశము :

ఆంధ్రభాషాసందనోద్యానవనమును అనేకులగు కవితల్లజులు మొల్లముగ పెంచి పోషించినారు. అందు నన్నయనుండి నేటి వఱకు ఎందఱో మహాకవులు శిష్టాచారపరాయణులై, ధర్మనిర్మలమార్గావలంబులై జాతికి నీతి గరపుచు వారి వారి జన్మలు సార్థకము గావించుకొనినారు. అదేమి పాపమోగాని అట్టి ధన్యజీవుల కాలాదికమును గూర్చియు, వంశాదికమును గూర్చియు సమగ్ర సమాచారము మనకీనాటికిని లభ్యము కాలేదు. నిన్న మొన్నటి కవులను గుఱించి కూడ మనకీనాడు చీకటి పయనమే. ఆంధ్రకవుల చరిత్ర, ఆంధ్రదేశ చరిత్ర ఈనాటికిని అసమగ్రముగ, స్పష్టాస్పష్టముగ నుండుట మన దురదృష్టమని చెప్పక తప్పదు. దీనికి ప్రధానముగా రెండు కారణములు. ప్రాచీనకాలము నుండియు మనకవిపండితులలో చరిత్రకారులు లేకుండుట. కవులు కావ్యములలో తమ్ము గూర్చియు, తమ కాలమును గూర్చియు విశేషములను అవతారికలలో నైనను వివరముగా తెలియఁజేయకుండుట. ఈనాఁడు ఎంతటివారు సిగతట్లు పట్టినను ఆ లోటు తీర్చుట కవకాశము లేదయ్యెను. అయినను ఆధునికాంధ్ర విమర్శకు లాలోటు తీర్చుటకు యథాశక్తిగా ప్రయత్నము గావించుచున్నారు. ఏతదున్ముఖముగా వీరుగావించు ప్రయత్నము బహుధా ప్రశంసనీయము.

నన్నయాది కవులెవ్వరును తమ కాలమును గూర్చి కావ్యములలో నుటంకించలేదు. బమ్మెఱ పోతరాజు కూడ తన కాలమును, నివాసమును స్వీయగ్రంథములందెందును పేర్కొనలేదు. కాని వీరభద్ర విజయమునందును, భాగవతము నందును పోతన వంశ చరిత్ర స్థూలముగ ప్రకటింపబడియున్నది. అందును భాగవతము నందలి వంశవృక్షము సంగ్రహముగ నున్నది. ఆ పద్యములను బట్టి పోతన వంశీయులు కౌండిన్యసగోత్రులనియు, ఆపస్తంబసూత్రులనియు తెలియుచున్నది. భాగవతాశ్వాసాంత గద్యలలో పోతన తనకమాత్య శబ్దము ప్రయోగించుకొనుటచే వారు నియోగి బ్రాహ్మణులని తెలియుచున్నది. పోతన్న లక్కమాంబాకేసన్నలను పుణ్యదంపతుల పూజాఫలము. కేసన 'శివతత్త్వ మనోరథ కౌతుకోన్నతుఁ''డని వీరభద్ర విజయము వలనను "శైవ శాస్త్రమతము గనిన వాఁడు" అని ఆంధ్ర మహాభాగవతము వలనను తెలియుచున్నది. (1-2½) పోతన తల్లి లక్కమాంబ తనయుని భక్త సత్తమునిగ తీర్చిదిద్దిన పవిత్ర చరిత్రురాలు. సదాశివసేవాహేవాకముతో, దానదయాబహుమానపరతంత్రబుద్ధితో నాదర్శప్రాయమగు జీవితము గడిపి సన్నుతికెక్కిన ధన్యురాలు. 'మానినులీడుగారు' (ఆం. మ. భాగ. 1-24) అన్న ఎత్తుగడతో లక్కమాంబ నిష్ఠాగరిష్ఠత్వమును, తల్లియెడల తనయుని భక్తిప్రపత్తులును చక్కగా సూచింపఁబడినవి. ఆతల్లి ఈతనయుని ధీచాతురితో తురీయపురుషార్థరతునిగ, ఈశ్వరసేవాతాత్పర్యధుర్యునిగ, దీన మానవ సముద్ధరణదీక్షాదక్షునిగ తీర్చిదిద్దినదని ధ్వనిపూర్వకముగ చెప్పక చెప్పినాఁడు. అంతకు పూర్వము కవులెవ్వరు తల్లుల గూర్చి చెప్ప లేదు. తండ్రిని గూర్చి చెప్పుటే ఆచారమైన కాలములో మాతృమూర్తిని గూర్చి పోతన ప్రత్యేకముగా వక్కాణించుటలో ఆయన అవలంబించిన స్వాతంత్ర్యము మాతృభక్తిపరాయణత్వము ద్యోతమానమగుచున్నది.

పోతన యన్న తిప్పన. 'ఈశ్వర సేవాకాముఁ'డని భాగవతమును బట్టియే తెలియుచున్నది. (1-25) కృత్యాది వచన మందలి 'మహేశ్వరధ్యానంబు చేసి,' అను మాటలను బట్టి పోతన కూడ పరమ మాహేశ్వరాచారసంపన్నుఁడగుటయే తెల్లమగుచున్నది. (ఆం. మ. భాగ. 1-13) అంతవఱకు పోతన వంశస్థులందరు శైవాచారపరాయణులే. పోతన శివకేశవాభేదము తు చ. తప్పకుండ పాటించినవాఁడు కాపుననే ఆయనకు మహేశ్వరధ్యానము వలన శ్రీరామచంద్రసాక్షాత్కారము దక్కినది. తుదకుకృష్ణాంకితముగా భాగవతకృతి నావిష్కరించినాఁడు. ఇట్లు చూడ శివకేశవ భేదముగాని, హరిహరమూర్త్యంతరభేదపరిగణనప్రీతిగాని యాతనికి లవలేశము లేదని నిరూపితమగుచున్నది.

పోతనకు మల్లన యను కుమారుఁడుండినట్లు లోకప్రతీతి గలదు. కాని దీనికి గ్రంథస్థాధారము లేవియు లభ్యమగుట లేదు. 'దాక్షాయణీ పరిణయ' ప్రబంధ కర్తలైన కేసన-మల్లనలు పూర్వకవి స్తుతిలో బమ్మెఱ పోతనార్యుని స్తుతింపుచు నాతఁడు తమ తాతయని పేర్కొనియున్నారు. కేసన-మల్లనలు తమ తండ్రి ప్రౌఢసరస్వతి యనియు ఆ ప్రౌఢసరస్వతి పోతన కుమారుఁడనియు తమ గ్రంథమున తెల్పియున్నారు. 'ఒడయనంబి విలాస'మను గ్రంథము వలన ప్రౌఢసరస్వతి యను బిరుదు గలవాఁడు కేసన యని తెలియుచున్నది. ఏతత్ప్రౌఢసరస్వతీ బిరుదాంకితుఁడగు కేసన, పోతన పుత్రుఁడని తెలియుచున్నది. ఈ కేసన అప్పలమ్మ యందు కేసనన్నను, ఎల్లమ్మ ద్వితీయ కళత్రమగు వీరాంబ యందు మల్లనను గాంచెను. ఎల్లమ్మ అజ్జరపు పేరయలింగమున కిచ్చి వివాహము గావించెను.

భాగవతము, వీరభద్రవిజయము, దాక్షాయణీ పరిణయము, ఒడయనంబి విలాసము నను గ్రంథము లాధారములు

పోతన వంశవృక్ష మీ క్రిందివిధముగా పట్టికారూపములోఁ జూపవచ్చును.

కౌండిన్యస గోత్రము — అపస్తంబ సూత్రము

బమ్మెఱ మల్లన్న
|
భీమన
|
అన్నయ (భార్య గౌరమ)
|
సోమన (భార్య మల్లమ)
|
రేచన | అన్నయ | ఎల్లన (భార్య మాచమ) | అయ్యలప్రెగ్గడ | మాదయనాగఁడు

ఎల్లన (భార్య మాచమ)
|
కేసన (భార్య లక్కమాంబ) | మాధవుఁడు | ఇమ్మడి నాగయ్య

కేసన (భార్య లక్కమాంబ)
|
తిప్పన | పోతన (భాగవత కర్త)

పోతన (భాగవత కర్త)
|
కేసన (ప్రౌఢసరస్వతి బిరుదాంకితుఁడు)
|
భార్య అప్పలమ్మ | భార్య వీరాంబ

భార్య అప్పలమ్మ
|
కుమారుఁడు కేసన | కుమార్తె ఎల్లమ (అజ్జరపు పేరయలింగ కవి భార్య)

భార్య వీరాంబ
|
మల్లన

మనకు లభ్యమగు చారిత్రికాధారములను బట్టి పోతన వంశము భీమన నుండి, కేసన వఱకు నీవిధముగా విస్తరిల్లినది. కాని వారిని గూర్చిన వివరము లేవియు మనకీనాడు తెలియుట లేదు.

II. పోతన నివాసము :

శ్రీకృష్ణుని వినియుండని యాంధ్రుడుండిన నుండ వచ్చును గాని పోతన నెఱుంగని యాంధ్రుఁడు లేఁడని చెప్పవచ్చును. ఆయన కవితారసప్రసూనసౌరభము సకలజనమనస్సమ్మోహనమైనది. పూవెచ్చట పుట్టిన దన్నది ప్రశ్న కాదు. సౌరభమును బట్టియే పుష్ప గౌరవ మేర్పడును కాని పుట్టిన ప్రదేశమును బట్టికాదు గదా! పోతన యెచ్చట పుట్టిన నతఁడాంధ్రు లందఱికి చెందిన కవితామకరందమనోజ్ఞ మందారము.

పోతన బమ్మెఱ గ్రామస్థుఁడై పిదప నోరుగల్లు నివాసియై యుండెనని విమర్శకులు పెక్కురు సిద్ధాంతీకరించి యున్నారు. ఓరుగల్లు పట్టణము కాకతిరాజధానియగు నేకశిలా నగరమే. 'ఓరుగల్లు' అను తెనుఁగు పదము సంస్కృతీకరింపబడి 'ఏకశిలానగర'మైనది. శబ్దవ్యుత్పత్తి చేతనేకాక కవిప్రయోగ బాహుళ్యము చేతకూడ నీ 'ఓరుగల్లు' ఏకశిలానగర మగుచున్నది. పోతనకు కొంచెము ముందు వెలువడిన 'క్రీడాభిరామము' (54)లో—

"మంచన వింటివో వినవొ మన్మథుఁడేక శిలాపురంబులో....

అని ఏకశిలాపురమును ప్రస్తావించి, తదనంతర ప్రాతఃకాల వర్ణనలో—

"ఓరుఁగంటి పురంబు సౌధములపై నొప్పారెడిన్ జూచితే...." (64)

అ[illegible] శిలానగరమునే ఓరుగల్లుగా వ్యాఖ్యానించి మనకు సందేహము లేకుం[illegible]డ గా[illegible]వించెను. ఇదేవిధముగా కొఱవి గోపరాజు రచించిన '[illegible]' (8-156) యందు కూడ నిరూపితమయ్యెను.

ఉ. "అకడ నీతిశాస్త్ర విదుఁడై గురుపీఠ్యొని యేగె వేడ్కతోఁ
గాకిత మూలశక్తి గనిగా నొనరించిన పైఁడిచట్టు నా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁబోని యట్టి సిరిపుట్టిన యింటికి నోరుగంటికిన్"

ఓరుగల్లును, బమ్మెఱయను గ్రామము నితఃపూర్వము నిజాము రాష్ట్రమునకు చెంది, ఈనాడు తెలంగాణ మందున్నది. పోతన వంశ మూల పురుషులు మొదట బమ్మెఱ గ్రామ వాస్తవ్యులనియు, పిదప తమ తమ యభీష్టముల ననుసరించి బుద్ధిబలమును ప్రదర్శించి కాకతిరాజుల రాజధాని యగు నోరుగంటికి, దాని పరిసరప్రాంతములకు వలస వచ్చి స్థిరపడిరనియు వారే బమ్మెఱ వారుగా ప్రఖ్యాతి వహించిరనియు సిద్ధాంతీకరింప వచ్చును.

విద్వాన్ ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి వ్రాసిన 'భక్త పోతన'యను విమర్శగ్రంథమున "ఏకశిలానగరమనుసది కడప మండలములోని 'ఒంటిమిట్ట' కాద"ని నిశ్చయించిరి. (పుట-౯) పోతన కూడ బమ్మెఱ గ్రామములోనే పుట్టి యచట కొంత కాలమున్నట్లు కూడ నిదర్శనములు కనబడుచున్నవి పోతన కృతినందఁదలఁచిన సింగభూపతి కూడ పోతనతోపాటు ఓరుగంటి ప్రాంతనివాసియే. భాగవత శిథిలభాగపూరణము గావించిన వెలిగందల నారయాదులు కూడ ఓరుగంటి ప్రాంత నివాసులై దగ్గరలోనున్న పోతన్నకు శిష్యులైరి. పోతన సగోత్రకులగు బమ్మెఱ వారిప్పటికిని ఓరుగంటి ప్రాంతమున నున్నారు. బమ్మెఱ గ్రామములో 'పోతరాజుగద్దె'యని నాల్గురాళ్లు పాతిన స్థలమందలి యొకశిలను పోతరాజని వ్యవహరించుచు, శుభ సమయములలో నాశిలను నేటికిని పూజించుచున్నారు.

పోతన భాగవతరచనాకాలము నాటికి ఏకశిలా నగరవాసి. ఏకశిలానగర మనగా 'ఓరుగల్లు' లేక వరంగల్లు. ఈయోరుగల్లు కాకతి రాజుల రాజధానియగు ఏకశిలానగరమే. ఓరుగల్లునకు అనతి దూరమందలి బమ్మెఱ గ్రామము పోతన జన్మస్థానము, పోతన వంశస్థులు ఆ బమ్మెఱ గ్రామ నామమునే గృహనామముగా స్వీకరించియుండిరి, ఏతన్నియోగి బ్రాహ్మణ కుటుంబులు బమ్మెఱ గ్రామమునుండి వెడలవచ్చి ఓరుగంటిపురమున, తత్పరిసర గ్రామములందును స్థిరపడియుండిరి అని మనము సిద్ధాంతీకరించుటలో విప్రతిపత్తిలేదు. ఈ వాదమునకు వినుకొండ వల్లభామాత్య కృతమగు క్రీడాభిరామమును, సింహాసన ద్వాత్రింశికయును ప్రోద్బలకముగ నుండుటయేగాక శ్రీజయంతి రామయ్యపంతులుగారు, కందుకూరి వీరేశలింగంపంతులుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, శేషాద్రిరమణకవులు, కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారు సమగ్ర పరిశీలనము గావించి బహుజన సమ్మతముగా స్వీకరించి యున్నారు.

III. పోతన కాలము :

పోతన యేకాలము వాడని యిదమిత్థముగా నిరూపించుటకు తగిన సాక్ష్యాధారములు శాసనస్థములుగాని,శాసనేతరములుగాని ఇంతవఱకు లభింపకుండుట మన దురదృష్టము. అంతకు ముందు ఆంధ్రదేశము, ఆంధ్రతేజము కూడ కలసి మెలసి, పొంది పొసగి అవిభాజ్యమై కాకతీయ సామ్రాజ్యముగా విరాజిల్లినను, అతర్కిత బహుతురుష్కనిష్కారణ దండయాత్రాఫలితముగ ముక్కచెక్కలై కకావికలైనది. రాజకీయస్థైర్యము లోపించిన జాతి జీవన మూహించుటకే దుర్లభముగా నుండెను. అందును తురుష్కదండయాత్రలకు లోనైన దేశము మిక్కిలి బీభత్సముగా, నిస్తేజముగా నుండెను. అనాటి యాంధ్రదేశము ముక్కచెక్కలై యెక్కడికక్కడి కొక్కొక్క సామంతుని పరిపాలనములో నుక్కిరిబిక్కిరి యగుచుండెను. ఆరోజులలో బమ్మెఱ గ్రామమందు పోతన సముద్భవించెను. ఆయన కాలనిర్ణయము స్థూలముగానైనను చేయగల్గుటకు మన క్రింది యాధారములు పనికివచ్చుచున్నవి.

## 1. పోతన శ్రీనాథునకు సమకాలికుఁడు :

పోతన శ్రీనాథుని సమకాలికుఁడనియు, నాయన బావమఱది యనియు వీరిరువురికి బాంధవ్యకారణముగ రాకపోకలు సాగుచుండె ననియు కట్టుకథఁ కట్టలుకట్టలుగా ప్రచారములో నున్నవి. ఆకథలు సాహితీ విమర్శకులెల్లగు నుదాహరించినవే. పోతన నిరాడంబరజీవనము నాక్షేపించినవారిలో శ్రీనాథుఁడు ప్రథముఁడని యాగాథల తాత్పర్యము. శ్రీనాథుని కాలము క్రీస్తుశకము (1380–1460) మధ్య కాలమని విమర్శకులు నిరూపించియున్నారు. (చాటుపద్యమణిమంజరి–పుట 115) ఆయన కీయన సమకాలికుఁడైనచో సుమారు పోతన కాలము కూడ నిదే కావలసివచ్చును. కాని యీ బావమఱది వాదము కల్పితము, నిరాధారమని చెప్పకతప్పదు. పోతన శ్రీనాథుని కాని, శ్రీనాథుఁడు పోతననుకాని తమతమ కృతులలో ప్రస్తావించి యుండలేదు. అంతేకాక శ్రీనాథుఁడు పాకనాటినియోగి. పోతన యారువేలనియోగి. ఆకాలమునందు ఆరువేలనియోగులకు పాకనాటి నియోగులకు పిల్లల నిచ్చిపుచ్చుకొనునంతటి సాంగత్యములేదు. మఱియు శ్రీనాథుఁడు కాల్పట్టణము వాఁడు. పోతన తెలంగాణము వాఁడు. వీరిరువురికి ప్రాదేశికముగా సాన్నిహిత్యమేనియు లేదు. రాకపోకల సౌకర్యము లేమాత్రము లేని యారోజులలో నంతదూరముగా పిల్లల నిచ్చిపుచ్చుకొను నాచారము లేదనియే చెప్పవచ్చును. మఱియు శ్రీనాథుని బావమఱదినని చెప్పుకొన్న దగ్గుపల్లి దుగ్గన పోతనను గూర్చి యుటంకింపలేదు. పోతన శ్రీనాథునికి వాస్తవముగా బావమఱది యైనచో నుటంకింప కుండునా! అల్లే కేసన–మల్లనలు తమ 'దాక్షాయణీ పరిణయము'లో పోతన పౌత్రులమని చెప్పుకొనిరేగాని శ్రీనాథుని గూర్చి వారును పేర్కొనలేదు. సంబంధమున్నచో నంతటి వానిని పేర్కొనకుండుట ఆచారము కాదు. అందుచే పోతన శ్రీనాథు

నికి బావమఱిది యన్న వాదము నిర్హేతుకము, కేవల కల్పనాజల్పిత మని నిర్వివాదముగా కొట్టిపాఱవేయవచ్చును.

2. భోగినీదండకము — సర్వజ్ఞసింగభూపతి :

పోతన చిన్ననాటి కృతియగు భోగినీదండకమునకు కృతిపతి సర్వజ్ఞసింగభూపతి. ఈ సర్వజ్ఞసింగన క్రీ. శ. 1430–1475 మధ్య కాలమున పరిపాలించినవాఁడని శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు నిర్ణయించియున్నారు. (ఆం. మ. భాగ ఉప. పుట 15) సింగభూపతి ప్రేరణపై పోతన తన చిన్ననాట నీకృతి రచించి యుండును. ఇందు సింగభూపతి కృతిభర్తయే గాక, కథానాయకుఁడు కూడ కథానాయిక సింగభూపతి వేశ్య. ఆమె సింగభూపతిని చూచి మరులుగొని తనతల్లి నాతని వద్దకు దూతికగా పంపించి, యాతని సౌముఖ్యముతో బాటు, గజారోహణాదికములగు గౌరవలాంఛనములు స్వీకరించుట ఇందలి యితివృత్తము. పోతనవంటి పరమనైష్ఠికుడిట్టి వారకాంతాకథాకథ నను గావించునా యని యనుమానించువారు లేకపోలేదు. కాని యౌవనారంభమందు వయసు పరవళ్లుద్రొక్కు యువకవి యేపంవిధ మగు నితివృత్తము స్వీకరించి యుండవచ్చుననుకొనుటలో ననౌచిత్య మేమియులేదు.

సర్వజ్ఞసింగభూపాలుఁడు సాహితీసమరాంగణముల సంగడి కాడు సాహితీసాన్నిహిత్యము అవక్రపరాక్రమము పారంపర్యముగా సంక్రమించినవాఁడు. భోగినీదండకములో నీతనిని గూర్చి పోతన కుమారాన్న పోతావనీనాథసూనుఁడనియు, పోచమాంబాలసద్గర్భసంజాతుఁడనియు, రావుసింగక్ష్మానాథపౌత్రుఁడనియు, సమీచీన రేచర్ల గోత్రాంబుజాతత్వమిత్రుఁడనియు పదింపదిగా వర్ణించియున్నాఁడు.

ఈవంశమందు సర్వజ్ఞ బిరుదాంకితు లిద్దరు గలరు. వీరిలో మొదటి సర్వజ్ఞసింగభూపాలుఁడన్నమాంబ కుమారుఁడు. ఇతఁడు

రసార్ణవసుధాకర గ్రంథకర్త. అది సంస్కృత లక్షణ గ్రంథము. పండితు లందరి రసౌచితి కౌదలలూచి మెచ్చిరని ప్రతీతి. ఇఁక రెండవ సర్వజ్ఞ బిరుదాంకితుఁడగు రావుసింగభూపాలుఁడే మన భోగినీదండక కృతి భర్త. ఈతఁడు పోచమాంబా కుమారుఁడు. కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు ఈతనిని దర్శించి ప్రస్తుతించెను. అదియునుగాక యీ సర్వజ్ఞసింగని గూర్చి శ్రీనాథుఁడు కూర్చిన చాటువు నేటికిని జన వ్యవహారములో గాటముగా నాటియున్నది.

క. "సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును తక్కొరు
సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే"

(చాటుపద్యమణిమంజరి—పుట 117)

ఇంతకును మన పోతన తన పాతికేండ్ల వయసులో భోగినీ దండకము విరచించి సర్వజ్ఞసింగభూపతికి కృతియిచ్చియుండుననియు, పోతన రచనా ప్రారంభము పదునైదవ శతాబ్ది యుత్తరార్ధమునకు చెందినదనియు, పోతన యౌవనము శ్రీనాథుని యవసానకాలమున కించుమించుగా సంవదించి యుండుననియు అనుశ్రుతముగా శ్రీనాథుని గూర్చి పోతన విని యుండుననియు, వీరుభయులకు సంబంధబాంధవ్య ములు లేవనియు మనమీసందర్భములో సిద్ధాంతీకరించుకొనవచ్చును. ఏయాధారము నుండియేనియు మనము స్థూలారుంధతీ న్యాయమున పోతన కాలమునకు పయనించవలసిన వారమే కాని నేరుగా జొరబడు నవకాశము లేశమును గానరాదు. అట్టిచో పాతిక ముప్పది సంవత్స రము లించుమించుగా మనము గమ్యస్థానము చేరుకొనగలము.

కేసన, మల్లనలు—దాక్షాయణీ పరిణయము :

పోతన పౌత్రులగు కేసన, మల్లనలచే రచింపబడిన 'దాక్షాయణీ పరిణయ' కావ్యము ఈకాల నిర్ణయమున కుపస్కారక మగు భూమిక యైనది. దాక్షాయణీపరిణయ కృతిపతి గురజాల చినమల్లన సోమ యాజి. ఇతనికి నాల్గవతరమువాఁడగు పేరయామంత్రికి పోడూరి పెద రామామాత్యుఁడు ఈకృతియొక్క 80 సంవత్సరముల క్రిందటి ప్రతిని విమర్శించి మఱొక క్రొత్తప్రతిని వ్రాసి యిచ్చెను. ఆక్రొత్తప్రతి ధాత నామ సంవత్సర అశ్వయుజ బహుళ దశమీ సోమవారము నాఁడు వ్రాసియిచ్చినట్లు అందలి పద్యమొకటి మనకు సాక్ష్యమిచ్చు చున్నది.a దానికి సరియగు తేది క్రీ. శ. 18-10-1756.

a సీ॥ ధాతాశ్వయుజ కృష్ణదశమీఁ దువారంబు,వరకు దాక్షాయణీ పరిణయంబు
తత్కృతి నాథుఁడై తనరిన గురుజాల, చినమల్ల సోమయాజికి తనూజుఁ
డగులింగ ఘనసుతుఁడైనట్టి యజ్ఞసత్ప్రభునకు తనయుఁడౌ పార్వతీశ్వ
రునకు తిమ్మమకు పుత్రుఁడయి షోడశమహా, దానముల్ సప్త సంతానములను

తే॥ చేసి వంశవర్ధనుఁడయి సిరుల వెలయు
పేర మంత్రీశ్వరు నకు పోడూరి పెద్ద
రాముఁడెనుబది సంవత్సరముల నాటి
ప్రతి విమర్శించి వ్రాసిచ్చె పక్షమునకు.

ఆనాటినుండి మనము (3+3=6) ఆఱు తరములు వెనుకకు లెక్కకట్టు కొని పోయినచో మనకు పోతన కాలము తేటతెల్లమగును. తరము నకు సుమారు 30 సంవత్సరము లనుకొని వెనుకకు జరిగినచో పోతన

కాలము సుమారు క్రీ. శ. 1450-1500 అగుట కభ్యంతరముండదు. చాగంటి శేషయ్యగారి యాంధ్రకవితరంగిణి (పుట 169) ననుసరించి పోతన కాలము క్రీ. శ. 1450-1508/1509 మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు కూడ నీవాదము నంగీకరించిరి. (ఆం. మ. భాగ. ఉప. పుట 14) పిమ్మట 'అకాడమీ భాగవత పీఠికాకారులును', (పుట 12) ఆంధ్ర భాగవతవిమర్శలో (పుట 41) డా॥ ప్రసాదరాయ కులపతిగారును కూడ ఈ వాదమునే స్వీకరించియున్నారు.

పైయాధారముల ననుసరించి పోతన కాలము క్రీ.శ. 1425-1500 అని నిర్ధారించుటలో ఎట్టి విప్రతిపత్తి యుండదని నావిశ్వాసము.



# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 3. ఆంధ్రమహాభాగవత పూరణములు

ఆంధ్రసాహిత్యమం దేమిచిత్రమో కాని యే యితిహాసమును పరిశీలించినను నది యేక కర్తృకముగా సాగలేదు. ఆంధ్రుల కాదికావ్యమగు మహాభారతమును నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ యను ముమ్వురుకవులు విరచించిరి. ఎల్లవిధముల మనకు ప్రమాణ గ్రంథమగు నా మహాభారతమందే మూడుచేతులు అతిలోకమనోజ్ఞ రచనాచణములై శరణాగత త్రాణములగు త్రిమూర్తుల కరకమలములవలె దర్శన, మిచ్చుచుండును. అట్లే రామాయణము కూడ హుళక్కి భాస్కరుఁడొక్కఁడే యాంధ్రీ కరింపలేకపోయినాఁడు. దానిని అయ్యలార్యుఁడు, మల్లికార్జునుఁడు, కుమార రుద్ర దేవుఁడు సాయము పట్టి అయినదనిపించినారు. ఈనాటి వఱకు భారతమును, రామాయణమును, భాగవతమును కూడ పెక్కురు కవులు మక్కువతో తెనిగించుచునే యున్నారు. కాని జన వ్యవహారములో మాత్రము భారతమనగా కవిత్రయ భారతమే రామాయణమనగా భాస్కర రామాయణమే, భాగవతమనగా బమ్మెర పోతన భాగవతమే. మిగిలినవికావు కాలేవు.

భాగవతమును ప్రధానముగా పోతన యాంధ్రీకరించినాఁడు. ఇందు పంచమ స్కంధమును బొప్పరాజు గంగన, షష్ఠస్కంధమును ఏర్చూరి సింగన ఏకాదశద్వాదశస్కంధములను వెలిగందల నారయ తెనిగించినారు. మఱియు కొన్ని శిథిలభాగములను కూడ నారయ పూరించియున్నాఁడు. ఈ విధముగా భాగవతము కూడ నాలుఁగు చేతుల మీదుగా నడచినదే. మొత్తము మీద ప్రధానములగు

ఏములు ఈమూఁకు ఆనేక కర్తృకములుగానే నడచినవి. కారణములేవైనను తి మీదుగా సాగు సదృష్టము వీని కబ్బలేదు.

అనేక కర్తృకములుగా నడచిన గ్రంథములకు నేటి కాలములోకూడ పెక్కు రణములు చూపించవచ్చును. అందు ప్రముఖముగా పేర్కొనదగినది పతివెంకటకవి విరచితమగు దేవీభాగవతము. ఇతరములైన యితిహాసముల వీ భాగవతము కూడబృహద్గ్రంథమే. రచనా ప్రణాళిక సిద్ధపఱచి కొన్నప్పుడే శాస్త్రిగారు, వెంకటశాస్త్రిగారు నేకాభిప్రాయులై చివరి నాల్గుస్కంధములు పటకు వారి సహాధ్యాయులను, శిష్యులను ప్రోత్సహించి వారిచే రచింపించిరి. పు అది తిరుపతివేంకటీయముగానే ప్రకటింపబడినది. ఇందు మూలముగా సారాంశమేమనగా బృహద్గ్రంథముల ననేకకర్తృకములుగా కొనసాగించుట కాదు. మీదుమిక్కిలి అది సులభ మార్గము. అట్లు చేయుట వలన రచన కాబద్ధమై సుసాధ్యమగును. ఈ దృష్టితోడనే పూర్వమనేకములగు నితిహాసములు ండినవి. ముద్రితమైన బమ్మెర పోతన భాగవతము కూడ సుమారు తొమ్మిది ద్యపద్యములు గల మహాగ్రంథము.

ఆ గ్రంథమునందు మొదటి నాలుగు స్కంధములను, సప్తమ స్కంధము శమ స్కంధము వఱకు గల నాల్గుస్కంధములను పోతన యాంధ్రీకరించి రు.

అపు డయిదాఱుస్కంధములను గంగన, సింగనల కాతఁడే యిచ్చి తెనుఁగు ప్రోత్సహించి యుండును. ఏడవ స్కంధము నుండి రచన వివిధకథాసుధా మై శ్రద్ధగా తీర్చిదిద్దవలసిన దయ్యెను. అందులకే అయిదాఱు స్కంధములు న మిత్రులు, సహవ్రతులునగు గంగన సింగనల కొసంగియుండునను చే యుక్తముగా నుండును. అంతియకాని పోతన భాగవతమంతయు పూర్తిగా తరువాత అయిదాఱు స్కంధములందు శిథిలములగుటచే గంగన, సింగనలు పెట్టిరని సమర్థించుకొనుట సమంజసముకాదు. వారనుసరించిన రచనా

విధానమును నిశితముగా పరిశీలించినచో వారివారి తారతమ్యములు మనకు విశదము కాగలవు.

## గంగరాజు పూరణవైఖరి :

పంచమస్కంధమును చెప్పనామాత్యపుత్రుఁడగు గంగరాజు తెనిగించిన ట్లాశ్వాసాంతగద్యను బట్టియే మనకు తెలియుచున్నది. మొదటి నాలుఁగు స్కంధముల వలెకాక యీస్కంధము రెండాశ్వాసములుగా విభజింపబడినది. గంగరాజు తన్నుగూర్చి యిందేమియు చెప్పికొనలేదు. ఈతడు పోతన సహవ్రతుఁడై ప్రీతిపాత్రుఁడై యుండనోపును. ఈ రచన మంతయు సుమారు యథామాతృకముగను, శ్రీధరీయ వ్యాఖ్యాన మార్గానుసారముగను, పోతరాజ కవితాప్రతిబింబమాత్రముగను సాగినది.

అందములు చిందులాడు స్వకపోల కల్పన లందందు లేకపోలేదు. పూర్వచిత్తి యను నచ్చర మచ్చెకంటి యపూర్వ సౌందర్యమును వర్ణించుచు నాతఁడిట్లు చిత్రించెను –

మ. "పటు తాటంక రథాంగ యుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచున్
నటనం బందెడు గండు మీనములతో నాసన్న నీలాలకో
త్కట భృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు మా
ఱట కాసారముఁ బోలి నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్"

(ఆం. మ. భాగ. 5-38)

తాటంకము లనెడి రథాంగములకు భయపడి కన్నులనెడి గండుమీలు నటించుచున్నవను నలంకారము ( ఉత్ప్రేక్ష ) పై పద్యమునందు మిన్నగా నున్నది, ఈ కల్పన ఆమూలకము.

గంగరాజు భరతోపాఖ్యానమందు కరుణరసమును చక్కఁగా పోషించెను. భరతుఁడు లాలించిన హరిణశాబకము పిన్ననాట గావించిన చెయ్దములు స్వభావ

సుందరముగా వర్ణించెను. భరతుని కథయందు అవిరతమగు వ్యథ కన్నులకు కట్టినట్లు చూపించెను. లేడి పిల్లపై నల్లికొన్న భరతునెడంద గావించు సందడి పెంచిపోషించు డెందమందలి కొంచలము చదువరుల నెమ్మదిని దండడిగొల్పక మానవు.

## సింగరాజు పూరణము :

భాగవత షష్ఠస్కంధము నాంధ్రీకరించినవాఁడు ఏర్చూరి సింగరాజు. ఇతడోరుగల్లు ప్రాంతమగు నేర్చూరు గ్రామనివాసి ఇతఁడు గావించిన స్కంధమున అవతారిక, ఆశ్వాసాంత గద్యకూడ మిక్కిలి విపులముగా నున్నవి. అందెచ్చటను షష్ఠస్కంధము ఖిలమైనట్లు చెప్పలేదు. పోతన యాదేశానుసారమే యీ రచన మీతఁడు గావించియుండును. అవతారికలో నీతడు ఇష్టదేవతాప్రార్థనము, స్వప్న వృత్తాంతము, షష్ఠ్యంత నిర్ధారణముగావించినాఁడు. భాగవతమును పూరించిన ముప్పురిలో నీలని స్థానము ప్రశస్తమైనది. ఇతని కవిత్వము ధారా శుద్ధి శోభితమై రసోజ్జ్వలనిమ్నగాప్రవాహసదృశమై యుండును.

సింగరాజునకు గురువు పోతన ఐనచో కవితా గురువు తిక్కన. ఈతఁడు పోతన వలె హృదయమునకు, తిక్కన వలె బుద్ధికి గూడ సమప్రాధాన్య మొసంగి రచన సాగించియుండెను. శబ్దమునకు పోతన, భావమునకు తిక్కన గురువులుగా స్వీకరించి యీకవి ప్రస్థానము గావించినట్లితని కవిత్వమే మనకు సాక్ష్యమిచ్చున.

ఇంటి వాకిలి చూచినచో నింటినిగూర్చియు నిల్లాలిని గూర్చియుకూడ చెప్ప వచ్చునందురు. అట్లే అవతారిక చూచినచో కావ్యమును కవితా నిష్టను కూడ చూచి నట్లే యగును. సింగరాజు గావించిన యవతారిక నిష్టానిష్ఠలముగా సాగినది. శబ్దములు మిక్కిలి పొదుపుగా వాడబడుచు నర్థవంతముగా నడచినది.

ఉ. "ఎమ్మెలు సెప్పనేల? జగమెన్నఁగఁబన్నగ రాజశాయికిన్
సొమ్ముగ వాక్య సంపదలు సూఱలు చేసినవాని భక్తిలో
నమ్మిన వాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁబేర్మితో
బమ్మెఱపోతరాజుఁ గవి పట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్."

( ఆం. మ. భాగ. 6–12 )

పోతరాజును తొలుదొల్త మ్రొక్కినవాఁడు సింగరాజే. ఎటువంటి తేట మాటలు పోతనకు ప్రీతినింపునో అటువంటి తేటమాటల తోడనే యీ పద్యము నీటుగా సాగుట గమనింపదగ్గది. సుకుమారములు, సుందరములు నగు శబ్దములతో చేయబడిన యీ పద్య ప్రసూనోపహారము రసమరందసుందరమై యలరారుచున్నది. సింగన పద్యములు పెక్కులు పోతన వేమోయను భ్రమగొల్పుచుండును. ఒక్కొక్క చేతి కొక్కొక్క వింతయగు నొడుపు సొంతమగుచుండును. పోతన చేతి యొడుపులో చొక్కము చు పక్కి చక్కఁగా దక్కఁగొన్న నిక్కపుకవి సింగరాజొక్కఁడే.

సింగరాజ విరచితమగు నవతారిక తిక్కన భారతావతారికవలె నడచినది. ఇదిదాని కనుకరణ ప్రాయమై యున్నది. పిమ్మట కథారచనమున సింగరాజు కూడ పోతరాజు వలెనే శ్రీధరీయవ్యాఖ్యానుసారముగా రచన సాగించెను. కాని పోతరాజు వలె నిబ్బడి ముబ్బడిగా రచన పెంచక కొంచెము క్లుప్తముగావించెను. పోతన వాణికి నీతని బాణి మిక్కిలి దగ్గరఁగ నడిపి కృతార్థుఁడయ్యెను. ఈతఁడు గంగరాజు కంటెను, నారయ కంటెను మిన్నయగు కవిత్వము చెప్పగలిగినాఁడు. పోతన కవితా మహోద్యమమున పలుమారులు పరిభ్రమించి తదమందమరందరసాస్వాదనముగావించి కవితానిష్ఠులైన మహనీయులలో సింగరాజు పాత్రతః స్మరణీయుఁడు.

అజామిళోపాఖ్యానమున సింగరాజు వసంతర్తు వర్ణనము గావించెను. అది పోతన గజేంద్ర మోక్షణ మందలి వసంత వర్ణనమును తలపించుచు నందముగా నడచినది. సహజ సుందరమగు సింగరాజు కవనమందు శబ్దము అయాచితముగా నడచివచ్చి పొందిపొసగి వీనులకు విందు సేయును. ఈ వచన మందలి యక్షరములు గావించు శయ్యానటనముచే నర్థముతో సంబంధము లేకుండ శబ్దము విన్నంతనే మనస్సులు పల్లవించి, కోరకించి, కుసుమించి, ఫలించును.

సింగరాజు అలవోకగా పద్యము చెప్పుటలో దిట్ట. తేట తెనుగు మాటలతో అతడు గావించు రచనము పోతరాజు రచనమా అని భ్రమకొల్పుచుండును. పోతన ప్రభావముచే సింగన నోటి నుండి జాలువారిన ఈ పద్యము చూడుడు.

క. "నాకును సఖ్యము పుణ్య
శ్లోకులతోఁ గాని తక్కుఁగాన్యులు సంసా
రైక విమోహులతోడం
గాకుండ నొనర్పుమయ్య! కంజదళాక్ష!" ( ఆం. మ. భాగ. 6-401 )

దీనికొజ్జబంతియగు పోతన పద్యమిది -

క. "నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూత దయయును
దాపస మందార! నాకు దయ సేయఁగదే!"

( ఆం. మ. భాగ. 10 పూర్వ. 1269 )

పోతన పద్యములు కొన్ని సాహితీ ప్రియుల మానసముల కొల్లగొట్టి యెల్ల వేళల రసబిందువు పొట్టును పట్టుకొనియుండును. ఆంధ్రమున పద్య నిర్మాణములో నాయన చూపించిన కౌశలము మిక్కిలి ప్రశంసాపాత్రమైనది. సింగరాజట్టి పద్యములు కొల్లలుగా పుక్కిటబట్టి యానందించెను. అప్రయత్నముగా వానిఛాయలలో తన పద్యములు హృద్యములై నడక సాగించెను.

సింగరాజు అంశముగా నాంధీకరించి కృతార్థుడైనాఁడు. నెరసులేరి కొనుచు రంధ్రాన్వేషణము సేయువారికి నెరసులే కన్పించును. భక్తి వినమ్రుఁడగు హనుమంతుని జూచి కోతియని పరిహాసము గావించిన నక్తంచరార్భకుల గతి సి రంధ్రాన్వేషణ చక్రవర్తుల యూహాపోహాలు పట్టించుకొనుట పౌచిత్యముకాదు. రస ప్రలుబ్ధచిత్తులగు నీతివిత్తముల మొత్తములకు హారతులెత్తు నీకవిసత్తముని ప్రస్తు తించుట మన కనీసపు కర్తవ్యము.

## ఏ పూరణమేమి :

భాగవతమును పూరించినవారిలో వెలిగందల నారయ ముఖ్యముగా దగినవాడు, ఈతడు పోతనకు సమకాలీనుడు, శిష్యుడు కూడనై భాగవతాంధ్రీకరణముతో నతిసన్నిహితముగా ముడిపడి యున్నవాడు. ఏకాదశ, ద్వాదశ స్కంధములను స్వీయ కర్తృకములుగా నిర్వహించినవాడు. పోతనామాత్యుని ప్రియశిష్యుడనని ఆశ్వాసాంత గద్యలలో పేర్కొని డు. ఏకాదశ, ద్వాదశస్కంధ విరచనమే గాక, దశమస్కంధోత్తర వందును, ఇతర స్కంధములందును, శిథిలములయిన భాగముల నీతడే పని చెప్పుమందురు. శిథిలములయిన ఏయే భాగముల నీతడు సమర్పించెనో ముగా చెప్పుటకు వలసిన సాక్ష్యాధారములు మనకీనాడు లభించుటలేదు. పూరించిన శిథిల భాగములు పోతనశైలి ననుసరించి పూరించి యుండుటచే ఏము లివియని వక్కాణించుట దుష్కరమైనపని. ఏయే భాగములు శిథిల గంథమున కొంత శిథిలమైనట్లు తదనంతర కర్తృకములైన గ్రంథ స్థాధారముల నకు తెలియుచున్నది. అందు నారయ పూరించిన భాగములు కనిపెట్టుట ము లభించుట లేదు.

అంతవరకెందులకు ? డెబ్బదేండ్ల క్రితము తిరుపతివేంకటకవులలో గు శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు పాండవవిజయము అను నాటకము కాకినాడ సరస్వతీ పత్రికలో తిరుపతివేంకటీయముగా ప్రకటించిరి. కాలమున నదే నాటకమును పెంచి "పాండవోద్యోగము", "పాండవ" అను రెండు నాటకములుగా విభజించి ప్రకటించిరి. ఆ పెంచిన లో గాని మరేయితర గ్రంథములలోగాని వారుభయుల రచనము వింగడించుట దుస్సాధ్యమైయున్నది. ఈనాటికిని వారి సహపఠితులలో, శిష్యులలో సజీవులై యుండియు కూడ ఎవరేయే రచనలు గావించిరో చెప్పకున్నారు. తము నచ్చు యంత్రము మన దేశమునకు వచ్చిన తరువాత మన కనుల ే జరిగిన విషయము. ఈనాటికి సంబంధించిన రహస్యములు ఎన్నియో ్క యాతన పెట్టుచుండగా సుమారు ఐదువందలేండ్ల క్రితము సంభవించిన లిత్యమునకు కారణములను, సమాధానములను ఊహించుకొనవలసినదే కాని పగినది కాదు.

నారయ ఏకాదశద్వాదశస్కంధములను మిక్కిలి విలక్షణముగా పూరించెను, ఇతని రచన యథామాతృకముగా సాగలేదు. పయిగా మిక్కిలి సంగ్రహముగా నడచినది. అటయును నిశితముగా పరిశీలించినచో మనోహరముగ సాగలేదు. అట్లని యీతనికి పద్యరచన సుష్ఠుగా పట్టుబడలేదని నిర్ధారింతుమా భాగవతమునందు ఈతడు వ్రేలుపెట్టిన ఘట్టము లన్నింటికి అదియే గతి పట్టవలసి వచ్చుచున్నది. భాగవతమున రసహీనములగు తావులన్నియు నీతనివియని నింద మోపుట కూడ పాడిగాదు. ఒక చేతిమీదనే నడచిన గ్రంథము లన్నింటిలోను ఒకచోట సరసముగ నడచుట మరొకచోట నీరసముగ నడచుట గమనించుచునే యున్నాము. శ్రీకారము నుండి మంగళం మహత్ వరకు ఒకేటాకిని నడచిన మహాగ్రంథములందు కూడ ఈ సందర్భములు చూపింప వచ్చును.

నారయ శిథిలభాగ పూరణములు మిక్కిలి నిష్ఠతో గావించి యుండును. ప్రియ శిష్యునిగా తన కర్తవ్యమును గుర్తెఱింగి గురుభక్తితత్పరుడై ఆతడు పెక్కు శిథిలభాగములను జాగరూకుడై పూరించియుండును. అట్లు పూరించుట కాతడు మిక్కిలి శ్రమనొంది ఎక్కువకాలము వినియోగించి యుండును, అనంతరము ఏకాదశద్వాదశస్కంధములను ఏకారణముచేతనో తక్కువ వ్యవధిలో పూరింపవలసిన వాడయ్యెను ఆ కారణములు సాంసారికములో, సాంఘిక రాజకీయ విపరిణామములో కావచ్చును. అందుచే నాతడు కొంత తొందరపడి ఎవరో తరుముకొని వచ్చుచున్నట్లు మిక్కిలి సంగ్రహముగ అన్యాక్రాంతమగు మనస్సుతో పూరించి యయినదనిపించెను. అందుచేతనే పోతనకు ప్రియశిష్యుడయ్యును పోతనకు ప్రీతిపాత్రమగు కవితారీతిని ప్రదర్శింపలేక పోయెను.

నారయ సంగ్రహముగా రచించుటచేతను, అందముగా రచింపలేకపోవుట చేతను ఏకాదశద్వాదశస్కంధములు నాటినుండి నేటివరకు నవిచ్ఛిన్నముగ నిర్మింపబడు చునే యున్నవి. ప్రాచీనులలో హరిభట్టు రచన సహజసుందరమై, ధారాశుద్ధి శోభితమై గణన కెక్కినది. హరిభట్టు పూరణములతోడి పోతన భాగవతములు పెక్కులు ప్రచురింపబడినవి ప్రాచీనులలో హరిభట్టువలె అర్వాచీనులలో సింగరాచార్యులు మంచిపేరు తెచ్చుకొనిరి. పదునొకండవస్కంధ మొక్కదానినే పెక్కుమంది కవులాంధ్రీకరించిరి. ఈ విధముగా పెక్కురీస్కంధములాంధ్రీకరించుటకు కారణము నారయ వీనికి గావించిన అన్యాయమే.

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 4. భాగవతము - స్కంధములు

భాగవతము కల్పవృక్షముతో పోల్చఁబడి అందలి భాగములు స్కంధములుగా నిర్దేశింపఁబడినవి. భాగవత కల్పవృక్షము మొదలు నుండియే పన్నెండు శాఖలుగా చీలి ఆకసమంట ఎదిగినది. కనుకనే ద్వాదశ స్కంధములైనది. ఈ పన్నెండింటికి అసలు బోదె ఒకటే.

మ. "లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై."

( ఆం. మ. భాగ. 1-20 )

కల్పవృక్షమనఁగా కోరికలను తీర్చు చెట్టు. ఇది స్వర్గములో నుండును. కాని ఆ కోరికలు భౌతికమైనవే కావలెను. ఇక భాగవత కల్పవృక్షమన్ననో ఒక్క భౌతికవాంఛాపరిపూర్తికే కాక ఆధ్యాత్మికప్రగతి రూపమైన మోక్షసిద్ధికి కూడ పనికివచ్చును. పైగా దీనికోసము ఏ స్వర్గమునకో పోనక్కరలేదు ఇది భూమి యందు వెలసిన కల్పవృక్షము. అందుచేతనే "వెలయున్ భాగవతాఖ్యకల్పతరువుర్విన్" అని కవి స్పష్టీకరించినాఁడు.

ఇందుముఖ్యముగా భగవల్లీలావతార వర్ణన చేయఁబడినది. భగవంతుఁడైన శ్రీమన్మహావిష్ణువు తన శరీరమున జగత్తునకు ఆయాసమయములలో సంభవించెడి ఆపదలను నివారింపుటకై అనంతకోట్యవతారముల నెత్తును. వానిలో ఏకవింశత్యవతారములు బహుధా కీర్తనీయములు. ఇంకను మరింతముఖ్యముగ అందలి దశావ

తారములు అత్యంత ప్రధానములు. వానిలో కృష్ణావతారము అనిర్వచనీయ మహా ప్రాముఖ్యశోభితము. ఏలయన కృష్ణుడు పరిపూర్ణతమావతారము. వైకుంఠములో విష్ణుమూర్తి కున్న శక్తులలో కొన్ని మాత్రమే మిగిలిన అవతారములలో ఆవిష్కృతములు కాగా కృష్ణావతారములో అన్నియు ఆవిష్కరింపబడినవి. అందుచేతనే అది పరిపూర్ణతమావతారమైనది. రామునకు సంబంధించిన వంశనామములగు దాశరథి, రాఘవుడు, ఇనవంశోద్భవుడు, సీతావల్లభుడు ఇక్ష్వాకుకులదీపకుడు మొదలగు పేర్లకు రాముడనియే అర్థము గాని విష్ణువని అర్థము రాదు. కాని కృష్ణునకు గల వంశనామములన్నియు, అనగా వాసుదేవుడు, నందనందనుడు, దేవకీనందనుడు, యాశోదేయుడు, యదువంశోద్భవుడు, ద్వారకావల్లభుడు, రుక్మిణీమనోహరుడు, తాలాంకావరజుడు మొదలగు పేర్లన్నియు కృష్ణుని యందును, విష్ణువునందును సమానముగా ప్రవర్తిల్లును. కృష్ణుడు భాగవతములో ఎంత ప్రధానపాత్రయో, భారతములోకూడ అంత ప్రధానపాత్రియే. కనుకనే భారత ప్రశంసకూడ భాగవతములో చేయవలసి వచ్చినది. ఏ ప్రశంస ఎచ్చట చేసినను, దాని ప్రధాన తాత్పర్యము తురీయపురుషార్థ సముపార్జనములోనే పర్యవసించునను విషయము విస్మరింపదగదు.

ఇక స్కంధములలో ప్రధానముగా వర్ణింపబడిన విషయములను దిఙ్మాత్రముగా స్పృశించుట అప్రస్తుతముకాదు. ప్రథమ స్కంధములో ఉత్తరాగర్భ సంరక్షణము, అశ్వత్థామగర్వభంగము, భీష్మస్తవము, పరీక్షిజ్జననము, శ్రీకృష్ణ నిర్యాణము, ధర్మజమహాప్రస్థానము, పరీక్షిత్పాలనము, శృంగిశాపము, శుకమహర్షి కృతభాగవత పఠనము విస్తరింపబడినవి. వీని అన్నింటిలోను ప్రత్యక్షముగనో పరోక్షముగనో శ్రీకృష్ణ ప్రశంస చోటుచేసికొనియే ఉన్నది.

ద్వితీయ స్కంధములో విరాట్స్వరూపము వర్ణింపబడినది. ఏతత్పరిజ్ఞానము కృష్ణతత్త్వమందే పర్యవసించును. శుకుడు పరీక్షిత్తునకు ఈ స్వరూపము నిరూపించును. భక్తి ప్రాశస్త్యమిందు తలస్పర్శిగా వివరింపబడినది. ప్రపంచము యొక్క పుట్టుకనుగూర్చి ప్రతిపాదింపబడి పురాణత్వసిద్ధిని పొందినది. హరిలీలావతారవర్ణనము, జగత్సృష్టికై శక్తి నార్జించుకొనగోరి బ్రహ్మదేవుడొనర్చిన తపస్సమాధి వర్ణనము ఇందు పొందుపరుపబడినవి.

తృతీయ స్కంధములో అఖండవేదాంతపరమార్థసారము వర్షించెడి విదు మైత్రేయసంవాదము నిబంధింపఁబడినది. స్వాయంభువమనువృత్తాంతము, య వరాహావతారవర్ణనము, జయవిజయులకు సనకాదులచే కలిగిన శాపము, హిరణ్యా హిరణ్యకశిపుల జననగాథ, హిరణ్యాక్ష సంహారము, కర్దమదేవహూతుల వివాహము కపిలుని యుపదేశసారము, సవిస్తరముగ వర్ణింపఁబడినవి. స్కంధారంభము ఎంతటి అనిర్వచనీయమహావేదాంతసారప్రవర్షము కురిసెనో స్కంధాంతము అంతటి వేదాంతమహావైభవవిశేషప్రతిపాదనమే కపిలదేవహూతిసంవాదములో సవ కూర్పఁబడినది.

చతుర్థస్కంధములో దక్షాధ్వరధ్వంస గాథ మనోహరముగా ఆవిష్కరింప బడినది. ఇది కేవలము శివప్రాధాన్య దన్యమైనది. దీనితో పోతన హరిహరాద్వై సిద్ధాంతసమిద్ధబుద్ధినిబద్ధత ప్రత్యక్షముగా గోచరించుచున్నది. పైగా పురాణము సర్గ ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితోపనిబంధనబంధురమై విలసిల్లవలెను గనుక సర్గారంభమున నవబ్రహ్మల సృష్టివిధానమును విస్తరించుచు అందు దక్ష ప్రజాపతి ప్రశంస చేయక తప్పదు గనుక అట్లు చేయుచు ప్రాస్తావికముగ ఆతని అహంకారము, తత్ఫలము శివ బహిష్కారపూర్వక యజ్ఞనిర్వహణ, తద్వినాశనము లతో స్పష్టీకరించి ఏకేశ్వరోపాసనావైభవమును వెలార్చెను.

ఇట్లు శివ పారమ్య నిరూపణ చేయుటచే పోతనామాత్యునకు శివద్వేష మంట గట్టువారి ఆట కట్టివైచినట్లయినది. ఆసందర్భమున చతుర్ముఖప్రజాపతికృతనీలకంఠ స్తోత్రము పోతన శివభక్తికి నిర్ణాయక మగుట బహుధా ప్రశంసనీయము.

విష్ణు పారమ్య బోధకమైన ధ్రువోపాఖ్యానము ఈ చతుర్థ స్కంధమునకు మరియొక పెట్టని నగ. ఇది ప్రహ్లాదచరిత్ర వంటి అకలంకబాలభక్తమూర్ధన్యుని ధన్యగాథ. ఇందలి నారదోపదిష్టతారకమంత్రరహస్యము సకలప్రాణి సంసార యాత్రాసంతారకము కాగలదు.

ఇందలి వేన మహారాజు చరిత్రము శాస్త్రప్రమాణమును ధిక్కరించు స్వేచ్ఛా బుద్ధి జీవుల పతనమును పట్టిచూపు నాదర్శము వంటిది. ఆవెనువెంటనే ప్రచలితనమై

పృథు చక్రవర్తి చరిత్ర ధర్మమార్గావలంబులకు కల్గు విజయసిద్ధిని పరిదర్శించు సాధనము. రుద్రగీత, పురంజనోపాఖ్యానము పెక్కు ధర్మములకు గనుల వంటివి.

ఇక పంచమ స్కంధములో ఋషభావతార వర్ణనము, భరతోపాఖ్యానము సంగ్రథితములయినవి. ఈ భరతుడే ఈ ఖండమునకు భరతఖండ ప్రశస్తి తెచ్చిన మహనీయుడు. పిమ్మట భూగోళ, ఖగోళ విస్తార వర్ణనము, పాపులు శిక్ష ననుభవించు నరకలోక ప్రశంస ఇందు విస్తరింపబడినవి. కేవలము ప్రత్యక్షమును మాత్రమే ప్రమాణముగా స్వీకరించు అశాస్త్రపరిజ్ఞాతలకు నచ్చక పోయినను క్రాంత దర్శులగు మహర్షుల దివ్య చక్షురున్మీలనములో సాక్షాత్కరించు లోకాంతర గాథలు అసత్యములని కొట్టి పారవేయుట ఎవరితరము ?

షష్ఠ స్కంధములో అజామిళోపాఖ్యానము, హరిభక్తుల నిత్యకల్యాణ సంపన్మహనీయజీవనవైభవమును చాటి చెప్పును. దక్ష కృత హంస గృహ్యస్తవము, నారాయణ కవచమును మంత్ర శాస్త్ర రహస్యోపనీతములైన పుణ్యఘట్టములు. చిత్ర కేతూపాఖ్యానము మరల ఒక పురుషార్థ ఖని.

సప్తమ స్కంధములో సుయజ్ఞోపాఖ్యానము ప్రాస్తావిక గాథ. ఇందలి ప్రహ్లాద చరిత్ర భాగవతమున కంతకును మణిమకుటాయమానమగు మనోహర భక్తిరసప్రధానప్రబంధరాజము. ఇందలి నృసింహావతార వర్ణనము, స్తంభోద్భవ గద్య భగవద్గీత యందలి విభూతి విశ్వరూప సందర్శన యోగములతో తులతూగు నంతటి మహిమ సంపన్నములగు మధుర సన్నివేశములు. నృసింహమూర్తి ప్రహ్లాదు నాదరించిన ఘట్టము భగవంతునకు భక్తునకు గల విడదీయరాని అనుబంధమునకు కావించిన సాక్షరప్రాణ ప్రతిష్ఠ హిరణ్యకశిపు వధ –

''పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'' (భగవద్గీత 4-8)

అను భగవద్వచనమునకు ప్రత్యక్ష నిదర్శనము.

త్రిపురాసుర సంహార ఘట్టము మరియొక శివమహిమానుబోధకమధుర సందర్భము. ఇట్లు పెక్కుచోట్ల హరి మహిమతో పాటు హరమహిమకూడ పోతనామాత్యుడు ప్రకటించుచు వచ్చుట అతని అద్వైతదృష్టికి నిర్ధారకము. ఇందే నారద భగవానుని పూర్వజన్మగాథ బోధింపబడినది.

అష్టమ స్కంధములో గజేంద్రమోక్షగాథ కలదు. ఇది పోతన కవితా యశఃపతాక అగుటయేగాక ఆంధ్రుల భక్తిభావరసఝరికూడ నగుట రసజ్ఞులకు ముదావహము. సప్తమస్కంధమందలి ప్రహ్లాదచరిత్రముతోను, అష్టమస్కంధమందలి గజేంద్రమోక్షములోను పోతనామాత్యుని కవితాపరిపాకము, పుటములుదీరిన పదియారువన్నెబంగారువలె చేవలుగక్కుచున్నది. గజేంద్రునిమొర మూలాతిశాయి భక్తిభావబంధురమయి. అదియొక ప్రత్యేక భావకావ్యమువలె పరిఢవిల్లుచున్నది. ఆపత్కాలములో ఆంధ్రగృహస్థులు -

క. కలఁడందురు దీనుల యెడఁ
గలఁడందురు పరమయోగి గణముల పాలం
గలఁడందు రన్ని దిశలను
గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో" (ఆం. మ. భాగ. 8-86)

ఉ. "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందుఁ బరమేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్.
( ఆం. మ. భాగ. 8-73 )

శా. "లా వొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా."
( ఆం. మ. భాగ. 8-90 )

మొదలగు పద్యములను పారాయణ చేసికొందురు. ఆవిధముగా అయిదుశతాబ్దములుగా అక్షరస్వరూపుఁడయి, ఆంధ్రుల జిహ్వాగ్రమందు నర్తింపుచున్నాఁడు. మొర విన్న వికుంఠవాసుని స్వరూపము

మ. "అలవైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబుదా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంకరమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁగుయ్యాలించి సంరంభియై."

( ఆం. మ. భా. 8-95 )

అన్న పద్యములో పోతన ప్రత్యక్షీకరించిన తీరు "నభూతో నభవిష్యతి" అన దగ్గిదిగా నున్నది. ఇఁక గజేంద్రత్రాణ పరాయణుఁడైన నారాయణుఁడు వికుంఠసీమలనుండి భూమికేతెంచు ఘట్టము కన్నులకు కట్టినట్లు వర్ణింపపట్టున పోతన చూపిన కూర్పు నేర్పు అనన్యసామాన్యము.

మ. "సిరికిం జెప్పఁడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగ పతిం బన్నింపఁడాకర్ణి కాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణా వనోత్సాహియై".

( ఆం. మ. భాగ. 8-98 )

ఇందు భగవానుని దుష్టశిక్షణ, శిష్టరక్షణ, వ్యాపారబాహుళ్యము అతిలోకస్తవనీయముగా వన్నెకెక్కినది.

పిమ్మట క్షీరసాగరమథనగాథ, జ్ఞానావతారమగు కూర్మావతారమును గూర్చిన వర్ణనము పయఃపయోధిగర్భజనితసుధాకలశ నిమిత్తమై సంఘటిల్లిన సురాసుర సంగ్రామములో హరి ప్రదర్శించిన నేర్పు వర్ణనాతీతము. పిమ్మట వామన చరిత్రగాథ ఒక స్వతంత్ర మధురకావ్యముగా తీర్చిదిద్దఁబడినది.

మ. "ఇతఁడే దానవ చక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గర్వాపనయప్రవర్తి గతలోభ స్ఫూర్తి నానామఖ
వ్రత దాన ప్రవణానువర్తి సుమనో రామామనో భేదనో
ద్ధత చంద్రాతప కీర్తి సత్య కరుణా ధర్మోల్ల సన్మూర్తి దాన్."
( ఆం. మ. భాగ. 8-543

ఉ. "స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు హాసమాత్రవి
ధ్వస్త నిలింపభర్తకు నుదార పదవ్యవహర్తకున్ మునీం
ద్ర స్తుత మంగళా ధ్వర విధాన నిర్జరీగళ
న్యస్త సువర్ణ సూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్".
( ఆం. మ. భాగ. 8-545

మొదలగు పద్యములన్నియు ఆంధ్ర సాహిత్యమునకు సంగీతశాస్త్రసమ్మేళనము సహ కూర్పబఁడిన దివ్యోదాహరణములు. బలిప్రదర్శించిన సత్యవాక్పరత్వము, ప్రభువు రక్షించుకొనవలెననెడి శుక్రాచార్యుని ఆరాటము ఏమయిన చెడిపిచనునో బలిచక్రవర్తి అవహేళన చేయవచ్చుననెడి వామనమూర్తియొక్క నిర్లిప్త గాంభీర్యశోభ బహుధ స్తవనీయములు.

శా. ''కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతింబొందరే
వారేరీ సిరి మూట గట్టికొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశః కాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరేయిక్కాలమున్ భార్గవా."
( ఆం. మ. భాగ. 8-590

కం. ''వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్త ద్వీపముల నయినఁ జక్కంబడునే." ( ఆం. మ. భాగ. 8-574

మొదలగు పద్యములు పోతన యథాలాభ సంతుష్టికి అద్దము పట్టుచున్నవి.

మ. "నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైనదు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
వమ్మడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన రాఁ
తిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా! ధీవర్య వేయేటికిన్."

(ఆం. మ. భాగ. 8—593)

ఇట్టి ప్రదర్శితమైన బలిత్యాగ మహిమ అతిలోక మనోహరము.

శా. "ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపైనంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై"

(ఆం. మ. భాగ. 8—622)

అనుపోట దానము గ్రహించి వామనుఁడు త్రివిక్రముఁడై ముల్లోకముల నాక్రమించు పట్టున పోతన చూపిన రచనా పాటవము వేనోళ్ల శ్లాఘించినను సమగ్రము కానేరదు. ఆటు పిమ్మట మత్స్యావతార ఘట్టము మధురమధురముగా ప్రపంచితమైనది.

నవమ స్కంధములో సప్తమ మనువగు వైవస్వతుని ఆవిర్భావగాథ ఆరంభింపఁబడినది. పిమ్మట మఱియొక మధుర మంజుల స్వతంత్రకావ్య కళా ఖండముగా తీర్చిదిద్దఁబడిన అంబరీషోపాఖ్యానము భక్తుల గాథలలో మణిపూస వంటిది. దుర్వాసుని అహంకారము, అంబరీషుని వినయగరిమ, సుదర్శనచక్రముయొక్క అప్రతిమవిక్రమము, విష్ణుభగవానుని ఆర్తత్రాణపరాయణత్వము, భక్తుల అలోకసామాన్యమగు నాధిక్యవిశేషము ఇందు రసోదంచితముగా ప్రపంచింపఁబడినవి.

ఇక్ష్వాకు వంశగాథ, సగరుని కథ, గంగావతరణము, శ్రీరామచరిత్రము, భరతయయాతిపరశురామరంతిదేవ ప్రభృతి మహనీయుల గాథలన్నియు, దేనికదే ఒక రసవత్ప్రబంధముగా ఇందు పొందు పఱుపఁబడినవి.

భాగవతమునందలి స్కంధములన్నియు ఒకయెత్తు, దశమస్కంధము ఒక్కటియు ఒకయెత్తు. విష్ణుమూర్తియొక్క దశావతారములను విపులముగా వర్ణింప పట్టిన పోతనామాత్యుఁడు కొన్ని కొన్ని స్కంధములలో కొన్ని కొన్ని అవతారములను గూర్చి నాతివిపులముగను, దిఙ్మాత్రముగను, సందర్భోచితముగను వర్ణించి వదలివైచెను. ఏ అవతారమునుగూర్చి ముచ్చటించినను దానిపరమార్థము నావిష్కరించి దానివలన సిద్ధించు పురుషార్థస్వరూపమును వివరించుచుండును.

కాని ఒక కృష్ణావతారమును వర్ణింపబట్టిన అతఁడు ఆ అవతారగాథ భాగవత మహాగ్రంథములో ఏకదేశమే అనుమాటను విస్మరించి అదే గ్రంథసర్వస్వముగ తత్తత్ సన్నివేశముల కుచితమైన రసపరిణతిని సవిస్తరముగ సాధించుచు ఒక అనూహ్య మానసికహారవశ్యముతో బ్రహ్మానందలీలామహార్ణవలహరీవిహారమొనర్చుచు స్వతంత్ర మహాకావ్యరచనగా దానిని తీర్చిదిద్దెను.

శ్రీకృష్ణుఁడు విష్ణుమూర్తియొక్క పరిపూర్ణతమావతారము కనుక విష్ణు మూర్తి కున్న జ్ఞాన, బల, ఐశ్వర్య, శ్రీ, శక్తి, సౌందర్యములు పరిపూర్ణముగ కృష్ణావతారములోకూడ యథాతథముగా అవిష్కృతములైనవి. అందువలన ఈ అవతారమునకు ప్రత్యేక ప్రాధాన్యమిచ్చి పోతన ఈస్కంధమును ప్రథమద్వితీయ భాగములుగావిభజించినాఁడు. శ్రీకృష్ణుని అవతారారంభమునుండి కల్యాణముపఱకు గల గాథను పూర్వభాగమునను, అక్కడినుండి మిగిలినగాథను ఉత్తరభాగమునను పొందుపఱచెను.

దశమస్కంధ పూర్వభాగములో శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవుల కుమారుఁడుగా ఆవిర్భవించినదిమొదలు బాల్యక్రీడలను వర్ణించుచు పోతన, అతఁడు పూతనను సంహరించుట, శకటాసురసంహారము, తృణావర్తుఁడు మొదలగు రాక్షసుల మడియించుట అనుఘట్టములను బాలకృష్ణుని అలౌకికాద్భుతశక్త్యావిష్కారపూర్వకము సుకుమారమనోహరశైలీపరిపాకలావణ్యాగణ్యముగా రచించెను. కృష్ణుఁడు చేయు శైశవచేష్టలలోభాగముగా మృద్భక్షణ మొనర్చినపుడు తోడిబాలకులు యశోదతో చెప్ప ఆమె భయముచెప్పుటకై తగురీతిని దండింపఁబోయెను. అప్పుడు బాలకృష్ణుఁ నోరుతెఱచి తల్లికిచూపిన విశ్వరూపమును అసాధారణ ప్రతిభాసుందరముగా ప్ర పాదించెను.

"శా. అమ్మా మన్నుదినంగ నే శిశువునో యాకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరిమాటలు మదిన్ నన్నీవు గొట్టంగ వీ
రి మ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్ దప్పైన దండింపవే."

( ఆం. మ. భాగ. 10 పూర్వ. ౩౩౨ )

"మ. కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్ నేరక యున్నదాననొ యశోదాదేవిఁగానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతని ముఖస్థంబై యజాండంబుప్ర
జ్వలమై యుండుట కేమిహేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్"

( ఆం. మ. భాగ. 10 పూర్వ. ౩౪౩ )

మొదలగు పద్యములు ఆంధ్రవాఙ్మయములో రసగుళికలు. పిమ్మట యమళార్జున భంగము, బృందావనవిహారము, వత్సాసురధేనుకాసురవధలు, కాళియమర్దనము, గోపికావస్త్రాపహరణము, గోవర్ధనోద్ధరణము, గోపికాగీతలు, రాసక్రీడలు, జలక్రీడలు, ఋతువర్ణన, శంఖచూడ, కేశి, వ్యోమ, దానవహననము — అను నీఘట్టములు వేనికవే మధురాతిమధురమైన దివ్యానుభూతిదాయకములగు సన్నివేశములు. ఆయా ఘట్టముల లోని ఆధ్యాత్మికవిభూతిని ఆస్వాదింపలేని అపరిపక్వమనస్కులకు అవి అశ్లీలములుగా గోచరించుట వారివారి ప్రారబ్ధములకు సూచకములేగాని కథాసందర్భములలో అనౌచిత్య మేమియులేదు. నందగోకులమును బృందావనమునువీడి రామకృష్ణులు మధురానగర ప్రవేశ మొనర్చి దుష్టుఁడగు కంసునివధించి ఉగ్రసేనుని పట్టాభిషేకము కావించిన కథా భాగములుకూడ ముద్దుముద్దుగా ముగిసి ముచ్చటగొలుపుచున్నవి. అపైన భ్రమర గీతలు ఒకమధురమైన ఆధ్యాత్మికసన్నివేశము. అటనుండి ముచికుందసంరక్షణము, కాలయవనసంహారము గావించి రుక్మిణీదేవిని జరాసంధాదిదుష్టదానవసంహారపూర్వకముగా వివాహముచేసికొనుటవఱకు పూర్వభాగములోని కథలే. ఏపాత్రయొక్క ఏఅవస్థను వర్ణింపవలసివచ్చినను పోతనామాత్యుఁడు అవర్ణనావిశిష్టమైన తత్తదవస్థాస్థితపాత్ర పాఠకుని చిత్తములో శాశ్వతముగా ముద్ర వహించునట్లువర్ణించి కవితాజగత్తులో చరి తార్థుఁడయ్యెను.

దశమస్కంధోత్తరభాగము శ్రీకృష్ణగాథలో అతిముఖ్యములయిన ఘట్టములకు-అనఁగా శ్రీకృష్ణభగవానుని ప్రౌఢవయస్సులోను ఉత్తరవయస్సులోను ఆచరించిన లోకోత్తర ప్రతిభాసముతమయిన కర్మకలాపములకు వేదికగా అమరినది. శ్రీకృష్ణుని కుమారుఁడగు ప్రద్యుమ్నునిగాథ యిందే విస్తరింపఁబడినది. విఘ్నేశ్వర చతుర్థి నాఁడు పారాయణయోగ్యమైన స్యమంతకమణి వృత్తాంతము, సత్రాజిత్తు మణిని ధరించి సుధర్మాప్రవేశము చేసినపుడు కృష్ణుఁడు దానినడుగఁగా అతఁడు తిరస్కరించిన పిమ్మట ప్రసేనుఁడు దానిని అలంకరించుకొని వేటకు పోఁగా సింహ మాతనిని వధించి ఆమణిని తైకొనిపోవుచుండఁగా జాంబవంతుఁడు దానిని వధించి ఆమణిని తనపుత్రికకు ఆభరణముగచేయుట, ఇది తెలియని లోకము శ్రీకృష్ణునే నిందించుట, అందులకు కారణము వినాయకశప్తుఁడైన చవితిచంద్రుని క్షీరఘటమున రోచూచుట ఈమున్నగు వృత్తాంతములు మొదలుకొని ద్వంద్వయుద్ధములో జాంబవంతుని మెప్పించి మణితోపాటు అతని కూతురగు జాంబవతియను కన్యామణిని స్వీకరించుట, మణిని సత్రాజిత్తున కీయఁగా అతఁడు ఆమణిని మరల కృష్ణునకే ఇచ్చుటతోపాటు మరియొక కన్యామణియగు సత్యభామనుకూడ ఇచ్చుటవంటికుగల కథాభాగమునంతను రసోదంచితముగా పోతనామాత్యుఁడిందు ప్రతిపాదించెను.

ఇఁక నరకాసురవధ ఒక స్వతంత్రకావ్యమనవచ్చును. ఇందు నాచన సోముని ఉత్తరహరివంశమునకు పెక్కు అనుకరణములు గోచరించును. పారిజాతాపహరణము వేరొక స్వాతంత్ర్యకావ్యమా అన్నట్లు మలచఁబడి ముక్కుతిమ్మనగారికి మార్గదర్శకమైనది. బాణాసురవధ, ఉషాపరిణయము మరియొక రసవద్గాథ. నృగమహారాజు లోకోత్తరధర్మాచరణతత్పరుఁడై అశేషప్రజానీకమునకు ఆదర్శప్రాయుఁడుగా వర్ధిల్లి అబుద్ధిపూర్వకముగాచేసిన విప్రాపకారముచే ఊసరవెల్లియై ధర్మాచరణకు వీలులేని శిక్ష ననుభవించుచుండ అతని పాపము పరిపక్వమైన కాలమును గుర్తించి శ్రీకృష్ణభగవానుఁడు స్వీయహస్తస్పర్శచే అతనికి పూర్వరూపమొసంగిన కథను రసవత్సుందరముగ పోతనామాత్యుఁడిందు తీర్చిదిద్దెను.

విష్ణుస్వరూపుఁడగు వాసుదేవునిపై కక్షకొంది ఆసురీప్రకృతిగల పౌండ్రిక వాసుదేవుఁడు తానే అసలు వాసుదేవుఁడనని మదించి శంఖచక్రములుకూడ ధరించి

ఆవాసుదేవుఁడు పుష్పకవిమానముతో విహరించుచుండఁగ అతనిపై పోటీకి తాను సౌంభక విమానముతో విహరించుచు అమాయకప్రజలను కృష్ణభక్తినుండిమరల్చి తన్నే పూజింప వలసినదిగా హింసించుచుంత పెచ్చరిల్లిపోయిన ప్రజలగోడునాలించి శ్రీకృష్ణభగవానుఁడా పౌండ్రికవాసుదేవుని వధించినగాథను పోతనామాత్యుఁడు కృష్ణభక్తులకిందు సరస మనోహరముగా కానుకపెట్టెను.

పిమ్మట ధర్మరాజుకావించిన రాజసూయయాగఘట్టము హరిభక్తిస్థాపకముగ ప్రపంచింపఁబడినది శ్రీకృష్ణుని సాహాయ్యములేనిదే ధర్మరాజు స్వీయసోదరచతుష్టయముచే చతుర్దిగ్విజయ మొనర్పఁజేయుట, శిశుపాలనిబర్హణపూర్వకముగ యాగనిర్వహణవిషయమున సఫలీకృతమనోరథుఁడగుట సంభవించెడివిగావు. కినుకి పేరునకు ధర్మజుఁడు యజమానుఁడయినను యాగభోక్తయగు మాధవుఁడే ఈ సందర్భమున యాగకర్తకూడ అయ్యెనన్నను యథార్థదూరముకాదు.

శ్రీకృష్ణుని అఖండరమావిభవసంపన్నతకు వన్నెపెట్టిన వినయపూర్వక మహౌదార్యసంపద్విలసితమయిన సేవాప్రవృత్తి మనోహరముగ ఆవిష్కృతమయిన కుచేలగాథ ఇందు పోతనామాత్యునిచే సహజగంభీరనిరాడంబరశైలీమనోజ్ఞముగ పొందుపరుపఁబడి ఆనంతరిక బహుస్వతంత్రకావ్యనాటక నిర్మాణములకు మాతృకగా విలసిల్లినది. ఇచ్చటి వర్షవర్ణన ప్రాబంధికశైలికిగూడ హ్రీకారియైకొనసాగినది. కుచేలుని దారిద్ర్యము బహుకుటుంబిత్వము, ప్రాప్తలాభపరితుష్టమానసత్వము వామాక్షి పాతివ్రత్యము, కుచేలకృతప్రపత్తిపూర్వక వాసుదేవ సందర్శనము, వాసుదేవుని దీనజనోద్ధరణ ప్రియంభావుకత్వము ఉత్తరోత్తరమహనీయ ప్రతిభాపురస్కృతముగా, ఇందువర్ణింపఁబడి సారస్వతేయులకు సార్వకాలికనవరస భరితసత్కావ్యమృష్టాన్నభోజనమువడ్డింపఁబడినది. పిమ్మట బలరాముని మనోరథమునకు విరుద్ధముగ శ్రీకృష్ణుడు సుభద్రను అర్జునునకిచ్చుటలో వహించినపాత్రను, అర్జునుఁడు వివాహముపట్ల రాగముతో విరాగివేషము వేసికొన్నవిషయమును విరుద్ధరస సన్నివేశసుందరముగవర్ణించిన సుభద్రాపరిణయముకూడ తరువాతి పెక్కుమంది కవులకు ప్రేరణకల్పించి స్వతంత్రకావ్యముల నవతరింపఁజేసినది.

ఏకాదశస్కంధములో శ్రీకృష్ణుని చరమగాథ ముక్తిసౌధసోపానప్రాయముగ మలచఁబడినది. వసిష్ఠాదిమహర్షులు శ్రీకృష్ణభగవానుని సందర్శించుట, విదేహ ఋషభసంవాదము, బ్రహ్మాదిదేవతలువచ్చి శ్రీకృష్ణుని వైకుంఠమునకు ఆహ్వానించుట, శ్రీకృష్ణావతార ప్రయోజనము పూర్తిగ నెరవేరుటచే అందుల కాతఁడును సమ్మతించుట, ఇంక బహుస్వల్పకాలములో అప్రతిహతమైన యాదవవంశము అంతరించుటకు సూచనగ పెక్కు దుర్నిమిత్తములు తోచుట, యాదవులను ప్రభాసతీర్థమునకు పంపుట పరమ భక్తాగ్రగణ్యుఁడయిన ఉద్ధవునకు శ్రీకృష్ణభగవానుఁడు పరకోటికెక్కిన వైరాగ్య వైభవముతో పరమార్థము ఉపదేశించుట, తుదకు లీలామానుషవిగ్రహుఁడై భూ లోకమున అనన్యసామాన్యసామర్థ్యవిశేషముతో నిరంతర సాంఘికరాజకీయసాంస్కృతిక సైద్ధాంతికాది బహుకార్యబాహుళ్యనిర్వహణములో తనకు తానే సాటియని ఏ శరీరము ద్వారా నిరూపించుకొనెనో ఆ పాంచభౌతికశరీరమును విసర్జించి, వైకుంఠధామమునకు విచ్చేయుట అనునీగాథలు ఛురీవేగతుల్యముగ ముచ్చటింపఁబడినవి.

ద్వాదశస్కంధములో భావికాల ప్రస్తావన గలదు. భారత మందలి అరణ్యపర్వములోను, భారతమునకు ఖిలపురాణముగ ప్రశస్తమయిన భవిష్యపర్వము లోను చెప్పఁబడినట్లే ఇచ్చటను శ్వేతవరాహకల్పమందలి వైవస్వతమన్వంతరములో అష్టావింశన్మహాయుగానంతరవర్తిష్యమాణగాథావిశేషములను గూడ ప్రస్తావించెను. నాల్గురకముల ప్రళయములు యుగధర్మములు విజ్ఞాన విలసితముగ విస్తరింపఁబడినవి. జనమేజయమహారాజు కావించిన సర్పయాగము వర్ణింపఁబడినది. వేదములు, పురాణములు ప్రవర్తిల్లిన క్రమము సక్రమముగ నిరూపింపఁబడినది మార్కండేయోపాఖ్యానము వీనులవిందుగా వివరింపఁబడినది. ద్వాదశాదిత్యులనిరూపణము, తత్తత్ చైత్రాది ద్వాదశమాస చక్రసంచార వివరణము ప్రదర్శింపఁబడినది.

ఈవిధముగ భాగవతము దేశాంతర లోకాంతర యుగాంతర పురుషాంతర గాథా ప్రపంచముతో మానవమేధకు అవసరమయిన విధముగ సకలరంగపరివ్యాప్తమయిన విజ్ఞానవిభవసంపత్తి నందించుటలో కృతకృత్యమగుతీరున వ్యాసభట్టారకునిచే సంస్కృతములో ఎట్లు నిబంధింపఁబడెనో అట్లే ఆప్రామాణ్యమునకు తరుగని తీరున పోతనామాత్యునిచే ఆంధ్రభాషలో నిబంధింపఁబడి సాహితీపరుల శాశ్వతప్రశంసలకు పాత్రమయి తెలుఁగుజాతికి గర్వకారణమయినది.

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 5. భక్తిశృంగారముల ఉత్పత్తివికాసములు

నిజప్రపంచమునకు రసప్రపంచమునకు నొక అవినాభావమగు సంబంధము కలదు. నిజప్రపంచములోని వస్తువులను, వ్యక్తులను ఆలంబించుకొని జీవించుచున్న కవి తత్తద్వస్తువిస్తారమునే రసప్రపంచములోనికి మళ్ళించి మనకు ప్రశాంతతలు కలిగించును. జీవనశకటమునకు ప్రవృత్తియొక చక్రమైనచో, నివృత్తి రెండవ చక్రము వంటిది. పోతన జీవితపు బండి కీరెండుచక్రములు సక్రమముగా నవ్యక్రవిక్రాంతిక్రమసమంజసముగా పొందిపొసగి యుండెను. ఆయన సంతుష్టుడై సంసారము సాగించెను. శాంతుడై పరమేశ్వరారాధనము కొనసాగించెను. లోకసామాన్య మగు జీవనము రతిప్రాధాన్యమై ప్రవృత్తిప్రాధాన్యమై సాగుచుండును. అలోకసామాన్య మగు జీవనము శమప్రాధాన్యమై భక్తిప్రాధాన్యమై సాగుచుండును. ప్రవృత్తియందలి రసము లన్నియు నివృత్తిచే క్షాళితములై రసనిమ్నగాప్రవాహము నాకాశమునుండి భూతలమునకు ప్రవహింపజేయుచుండును. అట్టి అలౌకిక రసప్రవాహముల కేతనెత్తి ప్రవహింపజేసిన కవితల్లజులలో పోతన అగ్రస్థానీయుడు.

కావ్యములు రసప్రధానములై యుండును. కావ్యమను శరీరమునకు రసము ప్రాణము వంటిది. రసప్రతీతి లేని కావ్యమునకు కావ్య ప్రపంచమందు స్థానము లేదు. ప్రస్థానము లేదు. కావ్యమున కాత్మయేది యను విషయములో నాలంకారికులు పెక్కండ్రు పెక్కుసిద్ధాంతములను ప్రతిపాదించి యుండిరి. కొంద రలంకారములనిరి. కొందఱు గుణములనిరి. మఱికొందఱు రీతియనిరి. కొందఱు ఉక్తివైచిత్రి యనిరి. చివరికి రసమే ప్రాణప్రద మనియు, నత్యావశ్యక మనియు నిర్ధారించిరి. రసమునకు ధ్వని పర్యాయపదము వంటిది. కావ్యము ధ్వని ప్రధానమైనదని "ధ్వన్యాలోకము" చాటిచెప్పుచున్నది. పూర్వాలంకారికు లెల్లరు తమ తమ

వాదములు వింగడించియున్నను మొత్తముమీద రసప్రాధాన్యము నంగీకరింపనివారిం మందున్నైననులేరు. కాగా రసమే కావ్యమున కాత్మస్థానీయమని సిద్ధాంతీకరిం వచ్చును.

మానవుఁ డేజాతికి చెందిన వాఁడైనను, ఏ యుగమునకు చెందిన వాఁ నను ఇతరానేకజంతుసంతానమునకుంబలెనే పుట్టుట, పెరుగుట, గిట్టుట సహ సిద్ధముగా సంక్రమించుకొన్న వాఁడై యున్నాఁడు. ఇందు పుట్టుట యను పని ే యాలంబనముగా సాగుచున్నది. ఈరతియే కేంద్రస్థానీయమై సంసారమహావృ పరిపోషకమై యున్నది. మన కంటికి కనిపించు స్త్రీప్రపంచ మంతయు రతి విస్తరిల్లినదే. అట్టి రతి స్థాయికముగా నుద్భవిల్లిన రసమే శృంగారము. ప్రకృతి ననుసరించినది. శృంగారము అప్రాకృతమైనది. శృంగార మొక్కటేకాఁ రసము లన్నియు నప్రాకృతములే. స్థాయిభావము లన్నియు ప్రాకృతముల ప్రాకృతములగు స్థాయిభావములే విభావానుభావ సాత్త్వికసంచారీభావ సముల్లాసితము అప్రాకృతములగు రసములుగా పరిణమించుచున్నవి. రసము అన్నది ఆనం స్వరూపమైనపుడు ఆయారసముల వైవిధ్యము సిద్ధాంతముల కొఱకేకాని వాస్తవమం అన్నిరకముల యానందములు లేవని మనము గుర్తించుకొనవలయును. కా పాత్రము గావించు సహృదయు లందఱి చేతను రసానంద మనుభూయమానమైన ఈలోకమందలి శాస్త్రము లన్నియు మానవానుభవమే ప్రమాణముగా పుట్టిన అనుభవముతో పొందికలేని శాస్త్రము మనస్సులేని శరీరమువలె శుష్కమగు దానికొక ప్రయోజన ముండదు. 'రసానందము' అనునది నభః కుసుమమైనచో యానందముతోకాని, దానిని వివరించు నలంకారశాస్త్రముతోగాని మనకు పనిలే కాని అది యట్టిది కాదు. కావ్యానుశీలనముచేతను, నాటకాదుల సందర్శనముచేత సహృదయు లాయానందమును కించిత్కాలమైనను పొందుచునేయున్నారు. యానందము పొందరానిదైనచో కావ్యనాటకాదులచే నీ సమాజమునకు పనియేలే కావ్యనాటకాదు లింతగా విస్తరిల్లుటకు అవి యందిచ్చెడు నానందమే కారణము వేరు కాదు. సాహిత్యమందలి శాఖోపశాఖలచే నానందము, దానిచే రసానంద సహృదయులచే ననుభూయ మానము లగుచున్నవని ఒక్కవ్యాంశము.

ఈలోకమున నతిప్రాచీనములగు భాషలలో సంస్కృతభాష యొకటి. అది నదులలో గంగానదివలె పరమపవిత్రమైనది. అది సమగ్రము, సార్థకము, సమీచీనము నగు లక్ష్య లక్షణ సమన్వయ సంపదౌదార్యగాంభీర్యమైదేవభాష యని ప్రశస్తి గాంచినది. బుద్ధిప్రియ మగు మానవజీవితమునకు సమగ్రత నాపాదించి వాని నుద్ధరింపగల వాఙ్మయము శాఖోపశాఖలుగా విస్తరిల్లినది ప్రాచీనమగు నీ సంస్కృత భాషయందే. ఇందలి వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు కూడ నీ ప్రయోజనము కొఱకే విస్తరిల్లినవి. ఆ విస్తృతి కాలక్రమమున కావ్య నాటక ప్రస్థానముగా రూపుదిద్దుకొన్నది. సంస్కృతభాషయందలి కావ్యనాటక ప్రపంచము నందు శృంగారరసమునకు పట్టాభిషేకము చేయఁబడినది. దానిననుసరించి వీర రసమునకు ప్రాధాన్య మీయబడినది. ముఖ్యముగా కావ్యములలో వెలుబడినోత్తము శృంగారరసప్రధానముగా నడచినవే. శృంగారరసము వర్ణింపఁబడని కావ్యము లేదన్నను అతిశయోక్తి కానేరదు. శృంగార మొక్కటే రసము, తక్కినవి కావని భోజుఁడు లక్షణమును స్థాపించుటలోని యంతరార్థ మిదియే.

"రసో ఽభిమానోఽహంకారః శృంగార ఇతి గీయతే" ,

అని భోజుఁడు సరస్వతీకంఠాభరణమున (పే. 558) కీర్తించెను. ఈ శృంగార రసమును ప్రధానముగా స్వీకరించి కాళిదాసు, బాణుఁడు మొదలగు మహాకవులు అద్వితీయము లోజ్జకల్పనావైభవసముచితముగా వర్ణించి దీనికి లక్ష్య సిద్ధి చేకూర్చినారు. శృంగార మొక్కటే రసమని వాదించిన భోజుని మతమున శృంగామునకు అభిమాన రసము, అహంకారరసము అనునవి నామాంతరములు. శాంత మొక్కటే యహంకార ప్రశమ రూపమగు రసము. తక్కిన రసములన్నియు నహంకార రూపములే. శృంగార మొక్కటే రసమని యాతఁడు నక్కాణించినాఁడు.

> శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః ।
> తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతి తిష్ఠతి !"
>
> ( ధ్వన్యాలోకము - ద్వితీయోద్యోతము 7-16 )

"ధ్వన్యాత్మ భూతే శృంగారే యమకాది నిబన్ధనమ్ ।
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః ॥"
(ధ్వన్యాలోకము - ద్వితీయోద్యోతము 1-2)

అని ఆనందవర్ధనుఁడు శృంగారరసముయొక్క ప్రాముఖ్యమును ప్రస్తావించి యున్నాఁడు.

"లోకోత్తర నాయకాశ్రయత్వేన శృంగారస్య పరిపోషాతిశయః"
(ప్రతాపరుద్రియశోభూషణము - పుట 162) అని విద్యానాథుఁడారసమును పేర్కొనియున్నాఁడు.

లోకములో నితరములైన సంబంధములయందు కంటె భార్యాభర్తల సంబంధమునందు శారీరకముగానే కాక మానసికముగా కూడ సాంతత్యము మెండుగా నుండును. స్త్రీ పురుష సంబంధము వారి హావభావములచేతను, లీలావిలాసముల చేతను, వినోదవిహారములచేతను, కటాక్ష మందహాసములచేతను, చుంబనాలింగన ములచేతను పరిపుష్టమై సురతక్రీడల యందు పరిణమించి శృంగారరసపరిపోషక మగుచుండును. ఈశృంగార రసమునకు రతి స్థాయిభావము. నాయికానాయకులు ఆలంబన విభావములు, కటాక్షమందహాసాదులు, వస్త్రాభరణాదులు, వసంతర్తు కోకిలగానచంద్రదర్శనమలయానిలప్రసారాదు లుద్దీపన విభావములు. నాయికానాయ కుల సమాగమమునకు పెక్కులాటంకములు కలుగుచుండును. అపుడు వారి మనసులలో పెల్లుబుకు శంక, గ్లాని, మూర్ఛ, ఈర్ష్య మొదలగునవి వ్యభిచారిభావములు. ఈస్థితి నతిక్రమించిన పిదప రతియను స్థాయిభావమందలి రజస్తమో రూపమైన లౌకిక కాలుష్యము క్షాళితమై, రతి భావితమై సాత్త్వికత సంతరించుకొనును. అపుడు పొడకట్టు స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, గాద్గద్యము మొదలగు నవి సాత్త్విక భావములు.

"విభావైరనుభావైశ్చ, సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
ఆనీయమాన స్స్వాదుత్వం, స్థాయిభావోరసః స్మృతః"
(దశరూపకము VI. I)

విభావానుభావసాత్త్వికవ్యభిచారిసామగ్రిచేత సముల్లాసితమైన రతియను స్థాయిభావమే చైతన్యముయొక్క అధః ప్రకృతి నుండి ఊర్ధ్వ ప్రకృతికి చేరుకొని క్రమముగ శృంగార రసముగా పరిణమించును.

''శృంగం ప్రాధాన్యమియర్తీతి శృంగారః'' అని నైఘంటికులు దీనికి వ్యుత్పత్తి చెప్పియున్నారు. (అమరకోశము – గురుబాం ప్రబోధికావ్యాఖ్య 1-17) ప్రాధాన్యమును పొందునదని దీని యభిప్రాయము. శృంగారము రసరాజముగ పరిగణింపఁబడు చున్నది. ఈ రసరాజము భగవంతునకు కూడ ప్రీతిపాత్రమైనది. ''శృంగారప్రియో విష్ణుః'' అను నార్యోక్తి యీ విషయమును వ్యక్తము గావించు చున్నది. శృంగారమునకు విష్ణువధిపతి కనుక దీనికి పారమార్థిక ప్రాధాన్యము కూడ నున్నదని తెలియుచున్నది. లీలాశుకుఁడు కృష్ణకర్ణామృతములో, జయదేవుఁడు గీత గోవిందములో, పోతనామాత్యుఁడు భాగవతములో శ్రీకృష్ణునిలీలలను శృంగారరస పరిపూతములుగ పరకాష్ఠదశలో చిత్రించి తరించినారు.

భావనచేత భావ్యమాన మగునది భావము. భావనాపథము నతిక్రమించునది రసము. అందుచే మనస్సున కనుకూలములు గాని దుఃఖాదులందు తనకుగల సుఖానుభవాభిమానమే రసము. అది పరంపరా సుఖహేతువు అగుటచే రత్యాదు లందు రసపద ముపచారికము. కావున రత్యాదులకు రసత్వములేదు. భావనా విషయములగుటవలన భావత్వమే. కావున శృంగారమే రసము. శృంగార మనగా-

''రసోభిమానో౽హంకారః శృంగార ఇతిగీయతే
యో౽ర్థస్త స్యాన్వయాత్కావ్యం కమనీయత్వ మశ్నుతే.
విశిష్టాదృష్ట జన్మాయం జన్మినా మంతరాత్మసు,
ఆత్మసమ్యగ్గుణోద్భూతే రేకో హేతుః ప్రకాశతే.
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్,
సఏవ చేదశృంగారీ నీరసం సర్వమేవ తత్.''

(సరస్వతీకంఠాభరణము V - 555)

దీనివలన కావ్యమునకు కమనీయత్వము లభించును. కవి శృంగారియైనచో అతని కావ్యము రసమయమగును. శృంగారి కాని కవిచే రచింపఁబడిన కావ్యము నీరసముగ నుండును. తన కోర్కెలచే నభివ్యక్తములగు రత్యాదులు ఇతర వ్యక్తి యందు గ్రహించి స్వవిషయములుగా భావించుటవలన తన రత్యాదులకు నతిశయము కల్గును. మఱియు బుద్ధి సుఖదుఃఖాదులకును అతిశయము కల్గును. ఈ అతిశయమునకు హేతుభూత మహంకారవిశేషము, ఈ యహంకారమే శృంగారము.

## నవరసములు:

"శృంగార హాస్య కరుణాః రౌద్రవీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యేరసాః స్మృతాః
ఏతేహ్యష్టౌరసాః ప్రోక్తా ద్రుహిణేన మహాత్మనా."

(నాట్యశాస్త్రము VI – 16 - 27)

అని బ్రహ్మ చెప్పినట్లుగా శృంగారాదులు రసము లెనిమిదియని వ్యాఖ్యానించెను. ఆ యెనిమిదింటికి స్థాయిభావములు వరుసగా ఇట్లు పేర్కొనెను.

"రతిర్హాసశ్చశోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః"

(నాట్యశాస్త్రము VI - 18)

అని భరతముని తన నాట్యశాస్త్రమున నెనిమిది రసములనే నిరూపించెను. కాని "క్వచిల్శమః" ఆని భంగ్యంతరముగ శాంతము నంగీకరింపకపోలేదు. పిమ్మట శాంతరసమును గుఱించి విచారించి నిర్ధారించినవాఁడు భట్టోద్భటుఁడు. అతఁడే యీ శాంతమును రసముగా నంగీకరించి దానికి వలసిన స్థాయిభావమును నిర్ణయించి నాట్యశాస్త్రమునఁ బ్రవేశపెట్టెను.

మమ్మటుఁడు, ఆనందవర్ధనుఁడు, అభినవగుప్తుఁడు మొదలగు నర్వాచీనులగు నాలంకారికు లందఱు నవరసవాదము నంగీకరించినవారే. చిరకాలము తొమ్మిదిగా వెల్గిన రససంఖ్య క్రమముగా పెరుగ జొచ్చెను. రుద్రటుఁడు ప్రేయో రసమును ప్రవేశపెట్టెను. పిమ్మట దానికి "స్నేహప్రకృతిః ప్రేయాన్" అని

ప్రేయోరసమునకు స్నేహము స్థాయిభావముగా నాతఁడు పేర్కొనినట్లు కావ్యాలంకార సంగ్రహములో సన్నిధానము వారు తెల్పియున్నారు(3—304). మఱియు స్నేహితుల పరస్పరవ్యవహారమే ప్రేయోరసమని నిర్వచించెను. ఈ విధముగా రసములు పదియే గాక నిర్వేదాదులు కూడ రసత్వమును పొందుచున్నవి. శృంగారాదులు రసత్వము పొందుటకు రస్యమానత్వరూపధర్మమే కారణము, ఈ రస్యమానత్వము నిర్వేదాదు లందును గలదు. కావున అవియు రసములే యని యాతని మతము. రసము లనంతములనియు, లోకప్రసిద్ధి ననుసరించి భరతుఁడు కొన్నింటినే గ్రహించెననియు వ్యభిచారి భావములు కూడ విభావాది సంయోగమున రసము లగుచున్నవని సిద్ధాంతీ కరించెను.

భరతుఁడు రససంఖ్యలో వత్సలరసమును చెప్పకపోయినను తన సిద్ధాంత ములో వత్సలరసము నంగీకరించెను. వత్సలరసముయొక్క స్థాయిభావము వాత్స ల్యము, అనఁగా స్నేహము. దీనికి పుత్రభ్రాత్రాదు లాలంబనము. వారి చేష్టాదు లుద్దీపనము. ఆలింగనము, ఈక్షణము, పులకలు మొదలగునవి అను భావములు, అనిష్టశంక, గర్వము, హర్షము మొదలగునవి వ్యభిచారిభావములు.

ఈవిధముగా సువ్యవస్థిత మగు రససంఖ్య అవ్యవస్థితమై 'అనంతా వై రసాః' అన్నట్లున్నది. ఒకవైపున రసములసంఖ్య పెరుగుచుండగా మఱొకవైపున ఏకరసవాదము మొలకెత్తినది శృంగార మొక్కటే రసమన్న భోజుని వాదము, మనము పరిశీలించియుంటిమి. 'ఏకోరసః కరుణ ఏవ' అని కరుణ మొక్కటే రసమని భవభూతి మహాకవి సిద్ధాంతీకరించి యుండెను, అట్లే అద్భుతమును రస మన్న వారును గలరు.

లౌకిక జీవితములో భార్యాభర్తలకు, తల్లిబిడ్డలకు, అన్నదమ్ములకు గురుశిష్యులకు, స్నేహితులకు, సహాధ్యాయులకు, సహోద్యోగులకు సన్నిహితసాంగత్య ముండును. ఈసాంగత్యములందు భార్యాభర్తల సాంగత్యము విలక్షణము, దృఢము, ఆంతరంగికమునైనది. లైంగికమైన స్త్రీపురుష సంబంధము క్రమముగా నాంత రంగికమై, నిరంతరాయమై, అవిభాజ్యమై ఇహపరసుఖసాధకముగా పరిణమించును. చతుర్విధపురుషార్థములను సాధించుటకై నూతనవధూవరులు అగ్నిసాక్షికముగా నొకరి

నొకరతిక్రమించి పర్తింపమలి ప్రమాణము చేయుదురు. "ధర్మేచార్థేచ కామేచనాతి చరామి", అనునది మన సంప్రదాయబద్ధప్రమాణము. సనాతనసంప్రదాయము ననుసరించి యట్లు ప్రమాణముగావించిన వధూవరులు శారీరకముగాను, మానసికముగాను కూడ ఐక్యమును పాటించి పురుషార్థములను సాధింతురు. ధర్మార్థకామమోక్షములను సాధించుటలో భార్య భర్తకు సహకరించును. అందుచే భార్యాభర్తలందు ప్రవర్తించు కామము శాస్త్రసమ్మతమై, దోషరహితమై యొప్పుచున్నది. భార్యాభర్త లిరువురు కామక్రీడారతు లగుటయే గాక పురుషార్థసంపాదనరతులై కూడ కలిసియే ప్రవర్తింతురు. ఒకరి ఎడబాటు నొకరు సహింపలేరు, పరస్పరదర్శన స్పర్శనములు అపరిహార్యము లగును. హావభావములు, లీలావిలాసములు, వినోద విహారములు, కటాక్షమందహాసములు, చుంబనాలింగనములు వీని యన్నిటితో పాటు సురతక్రీడలు ఈమిథునములకు నిత్యకృత్యము లగును. ఇదియే శృంగారరసము.

ఏ మానవుడైనను సాధారణముగ కోరుకొనునది ఇహసుఖము. ఈ లోకములో సుఖముగా జీవయాత్ర సాగించుటకు మానవుడు గావించు ప్రయత్నమంతయు కర్మ అను పరిధి లోనికి వచ్చును. ఇహమందలి సుఖమును అభ్యుదయ మందురు. పరమందలి సుఖమును నిశ్శ్రేయస మందురు. ఇహపరాభ్యుదయ నిశ్శ్రేయస హేతుభూత మగుటకు మానవుడు విహితకర్మల నాశ్రయించుచు నిషిద్ధ కర్మలను పరిహరించుచు జీవయాత్ర సాగించును. కర్మాచరణమునే కర్మయోగ మందురు. ఇట్టి కర్మయోగమునకు దాంపత్యజీవితము జీవగఱ్ఱ వంటిది. గృహస్థాశ్రమము నాశ్రయించి మానవుడు ఇహసుఖమును పరసుఖమును పొందగలడు.

శృంగారాది రసము లన్నియు మానవజీవితముతో ముడివడి యున్నవి. మానవజీవితముతో సంబంధములేని రసములకు నిజజగత్తులోగాని, రసజగత్తులో గాని తావులేదు. మానవుడు ఆయా వస్తువులను సంపాదించుటకు ఆయా సంపదలను పొందుటకు ఆయా మనోభావములతో ప్రవర్తించుచున్నాడు. మనస్సు నుండి పుట్టినది భావము. ఈ భావము సుస్థిరమై నిరంతరప్రవర్ధమానమైనపుడు అదియే రసముగా పరిణమించుచుండును. ఆ రసము మానవుని నీరసమునుండి మళ్ళించి వానిని ఎల్లప్పుడు ధృత్యుత్సాహసమన్వితుని గావించుచున్నది. ఈవిధముగా మానవుడు కర్మ నాశ్రయించి ప్రవృత్తి నాశ్రయించి తన మనుగడ సాగించుచున్నాడు.

...కడు నిర్ధనునిగా జీవితము ప్రారంభించినాడు. ఉత్సాహవంతుడై యొకానొక వ్యాపారము నాశ్రయించి ధనార్జనము గావించినాడు. ఎన్నో అధికారములను చేపట్టినాడు. తనమాట కెదురులేని రీతిగా సమాజములో తన వ్యక్తిత్వమును ప్రతిష్ఠితము గావించుకొనినాడు. ఎటు చూచిన సుఖము, సంపద, అధికారము, ...న్నత్యము ఇట్లెన్నియో విభవము లొకదానివెంట నొకటిగా నతనికి కైవసము లగు ...న్నవి. అయినను వాని మనస్సున నేదో తీరనిలోటు చోటుచేసికొని గాటముగా ...టియున్నది. అబాధనే భవరోగమని పెద్దలు చెప్పుదురు. జననమరణపరం పరా ప్రవాహరూప మగు సంసారసాగరమున కొట్టుకొనిపోవుచున్న జీవుడు తన ...ంచితమును భుజమున గట్టుకొని ఒకానొక జన్మము నెత్తినాడు. వెంటనే అనుభ ...ంపవలసిన కర్మఫలమును ప్రారబ్ధమందురు. అది సమంచిత ఫలప్రదాత్రియైన ...రణముగా మానవునకు సంపద, అధికారము, గౌరవము కోటికి మిక్కిలిగ మేటి ...స్తును. అయినను వాడనుభవింప వలసిన దుఃఖముకూడ అవశ్యమనుభోక్తవ్యమే. ...ఖము వలన శాంతి, దుఃఖము వలన అశాంతి - జీవుడీరెంటిని సమానముగా ...నుభవింప వలసిన వాడగుచున్నాడు.

మానవుడు తాను చేసిన కర్మమునకు బద్ధుడై కాలక్షేపము చేయుచుండగ ...గవంతుడనువాడు మూడవ వ్యక్తి (Third Party) యగుచున్నాడు. మాన ...డు గావించు కర్మలలో ఆతనికి కర్తృత్వముగాని, ఫలభోక్తృత్వముగాని లేవు. ...తడు కేవలము ద్రష్టమాత్రమే. కేవలము సాక్షి మాత్రమే. భగవదారాధనము ...న మానవునకు చిత్తశాంతి లభించును. కామప్రశమనరూప మగు నీశాంతిచేత ...తడు వాసనాక్షయమును ఇహాముత్రఫలభోగవిరాగమును, వాని మూలమున ...నోనాశనమును, ఆత్మసాక్షాత్కారమును పొందగలుగు చున్నాడు.

మానవ జీవితములో ప్రవృత్తికి నిద్దమగు నద్దముపట్టి చూపించు నట్టిది ...ంగారరసము నివృత్తికి నిష్కంటకమగు బాటవేయునది భక్తిరసము. రక్తిని ...పించునది శృంగారము. విరక్తిని ప్రదర్శించునది భక్తి. అనగా ఈ రెండు ...ములు పరస్పర విరుద్ధములైనవి. పైకట్లు భిన్నత్వము కనిపించుచున్నను వాని ...ందేగత్వ మున్నది, అదియే చమత్కారము. నాయికానాయకులు ఆలంబనముగా ...ంగారరసము ప్రవర్తించినట్లే భక్తుడు భగవంతుడు ఆలంబనముగా భక్తిరసము

ప్రవర్తించును. భక్తుఁడు నాయికాస్థానీయుఁడు. అతఁడు తన నాయకుఁడగు భగవంతుని తోడి విరహము నేమాత్రమును భరింపఁజాలనివాఁడై నిరంతరసంతత భగవత్పదపంకేరుహ చింతాక్రాంతుఁడై కాలక్షేపము చేయును. గుడి, గోపురము గంటలు, హారతి, కప్పురము ఆతనికి ఉద్దీపన విభావము లగుచున్నవి. 'భగవంతుఁ డింకను కరుణింపలేదే' యను అసహనము భగవానుని దయఁజూరగొన్న భక్తుల యెడ నసూయ, భగవానుఁడెన్నడు కటాక్షించునోయన్న పరితాపము, కంపము, స్వేదము, గాద్గద్యము మొదలగునవి వ్యభిచారి భావములై ఏతద్భక్తిరసనిమ్నగాపరిపోషకములై రసజ్ఞహృదయసంతోషకరము లగుచున్నవి.

కర్మ, భక్తి, జ్ఞానము అనునవి ముముక్షువులకు మోక్షప్రదానము గావించుటకు ఏర్పడిన మూడుభిన్నమార్గములు. ఈ మార్గములందు మానవుఁడుమ్మడిగా ఆచరింపవలసిన కర్మలందును, సిద్ధాంతములందును ఏకత్వమున్నది. ఇటు కర్మను అటు జ్ఞానమును చీలవలె కలుపునది భక్తి. ముముక్షువుయొక్క మార్గమునందు ఈ భక్తి మానవునకు మాధవునకు మధ్యగల అగాధమునకు వంతెనవంటిది. ఇహమందు మనమాచరించు కర్మలకు, మనము సంపాదించు జ్ఞానమునకు ఒక అనుస్యూతత కావలెను. భక్తిలేని కర్మలకు—అవి నిష్కామములయ్యును అర్థములేదు. అవి జీవుని బద్ధుని గావించుచు లోకములో ముంచును. కర్మవల్లనే మోక్షము సిద్ధించుట అసంభవము. కర్మకు దైవభక్తి తోడించునపుడు అది జ్ఞానముగా పరిణమించును. మనమొక పదార్థము సేవించుచు దానిని ఈశ్వరదత్తముగా భావించి సేవించినచో దానికి జ్ఞానము నీయగలశక్తి కలుగును. లేనినాఁడా పదార్థనిషేవణము మనకు బంధకారణమగునేకాని మోక్షకారణము కాఁజాలదు.

ఇఁక జ్ఞానములో భాగమే భక్తి. జ్ఞానమొక దేహమైనచో నందు ప్రవహించు రక్తమే భక్తి. రక్తప్రసారము ప్రాణపోషణమున కెంత అవసరమో భక్తిరసప్రసారము జ్ఞాన పరిపోషణమునకంతే యవసరము. కాపున భక్తి లేనిచో జ్ఞానము లేదనియే తేలుచున్నది. "భజ సేవాయాం" అనుధాతువునుండి పుట్టినది

భక్తి యను శబ్దము. భక్తి యనగా భజించుట యని యర్థము. విభజించుట యని అర్థాంతరము. శాశ్వతుఁడగు నీశ్వరుని అశాశ్వతమగు జగత్తునుండి విభజించి అవధరించుటే భక్తి. నామరూపరహితుఁడగు భగవంతునకు ఒకనామము ఒక రూపము నేర్పఱచుకొని నిరంతర ధ్యానసమాధి నిష్ఠాగరిష్ఠుఁడై సేవించుటే భక్తి.

యుగములు నాల్గింటిలో కలియుగ మల్పాల్పమైనది. దీని దుర్బలత్వము కారణముగానే ఇందలి మనుజులు అలసులు, మందబుద్ధులు నగుచున్నారు. కృత యుగమున మానవు లస్థిగత ప్రాణులు. త్రేతాయుగమున మాంసగత ప్రాణులు. ద్వాపరమున రక్తగతప్రాణులు. కలియుగమున అన్నగత ప్రాణులు. కలియుగ మందలి మానవులు కష్టసాధ్యములగు జపతపము లాచరింప సమర్థులుకారు అందు చేతనే ఈ యుగములో మానవులకు స్మరణచేతనే ముక్తి కలుగును. వ్రతధ్యాన దానాది సత్కార్యము లాచరించుటకు కావలసిన శక్తిసామర్థ్యములు కలిమానవులకు బొత్తిగాలేవు. అయినను వారు స్మరణ మాత్రముచేతనే దైవపద మధిష్ఠించుటకు అపునర్భవప్రదసత్వస్వమును కైవస మొనరించుటకు సమర్థులగుచున్నారు ఈ కలిమానవులకు మోక్షసామ్రాజ్యమును జూఱలిచ్చు తలంపుతో విశాలబుద్ధి యగు వ్యాసభగవానుఁడు ద్వాదశస్కంధసుందరము, భగవల్లీలావిలాసకథాకథనమునగు భాగవతమును విరచించెను. అందు నందనందనుఁడు గావించిన భక్తరక్షణ, దుష్ట శిక్షణలు భక్తిమార్గానుయాయుల కుపాదేయములై యొప్పుచున్నవి.

భక్తిచేతనే జ్ఞాన ముదయించును. మానవ శరీరమందలి ఇంద్రియములు, మనస్సు, బుద్ధికూడ జడములై యున్నవి. ఆబుద్ధికి పరమందు జీవుఁడు కలఁడు. ఉపాధి దోషముచే జీవుఁడు శరీరము తానేయని, ఇంద్రియములు తానేయని భ్రమలో పడి బురదలో పడ్డ యేనుగువలె వాస్తవ మెఱుంగ లేఁడాయెను. మనము చదువు కొనుచున్నాము. ఆకాశమున నొక మెఱుపు మెఱసినది. జోరుగా వాన కురిసినది. వెంటనే మనస్సు పరిపరి విధములగు ఆలోచనలవైపుగా పరుగుపెట్టును. చిత్త విక్షేపము కలుగును. మనస్సొక చెఱువు వంటిది. ఆ చెఱువులో చిన్న గులక రాయి విసరఁబడెను. ఆ గులకరాయి ఎన్నో వందలవేల చిఱు కెరటములను సృష్టించి నది. అట్లే మనస్సు కూడ మిక్కిలి చంచలమై యుండును. ఇట్టి చంచలమగు మనసను గుఱ్ఱమునెక్కి ఏవైపుగా ప్రయాణింప వలెనన్నను పురోగమించుట దుర్లభము.

మనస్సు వాయువు కంటెను, సూర్యకిరణములకంటెను శీఘ్రగామియై పోవలసిన చోటికి పోలేక ఆలోపుగా పోరాని చోట్ల కలువది యోజనముమార్గ పర్యాణముచేసి తిరిగి వచ్చును. అట్టి మనస్సుతో ఆత్మపదార్థమును వెతుక నారంభించుట గాలిలో దీపము పెట్టుట వంటిది. అట్టి మనస్సునకు కొంత అభ్యాసము, కొంత వైరాగ్యము అలవాటు చేసికొనుచు పోయినచో అది క్రమక్రమముగా స్థిరపడి పరమార్థము వైపుగా ప్రయాణము సాగించ గలదు.

భక్తి యనగా సగుణోపాసనము. భగవంతుని నామము నుచ్చరించుచు రూపమును స్మరించుట. ఈ ప్రపంచమందలి వస్తువులన్నియు నామరూపముల చేతనే లెస్సగా తెలియబడుచున్నవి. అట్లే భగవానుడుకూడ నామరూపములచే బాగుగా తెలియబడుచున్నాడు. నామము రూపములేని పరబ్రహ్మమును ధ్యానించుట నిర్గుణోపాసన మగుచున్నది. నిర్గుణోపాసన కంటె సగుణోపాసన సులభము. ఇవి రెండును భిన్నమార్గము లయ్యును గమ్య మొక్కటియే. ఈ రెంటియందును సాధకునకు కావలసినవి — మనస్సు పరమాత్మ యందునిల్పుట, నిరంతర దైవ చింతన, శ్రద్ధ కలిగి యుండుట - అనగా భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత ముఖ్య మైనవి. సగుణోపాసన మందలి సౌలభ్యము నిర్గుణోపాసన యందులేదు. సగుణోపాసకుడొక నామము నుచ్చరించుచు, నొక రూపమును ధ్యానించు చుండును. గోపికలు శ్రీకృష్ణుని నామము నుచ్చరించుచు, రూపమును ధ్యానించుచు మోక్షమందిరి. భక్తున కీనామము, రూపము నాలంబనములుగా పనికివచ్చును. నిర్గుణోపాసనయందిట్టి యాలంబనము లేవియు నుండవు. అందు చేతనే యది క్లేశతరమని తెలియుచున్నది. అక్లిష్టమార్గములో ప్రయాణము గావింప నుద్యమించువారు కూడ లేకపోలేదు. జన్మజన్మల సంస్కారముల ప్రభావము వలననే లోకులు భిన్నరుచు లగుచున్నారు. గమ్య మొక్కటే యయ్యును మార్గము లందలి వైవిధ్యమున కిదియే కారణము.

మనసు సంకల్పవికల్పములతో ఊగులాడుచుండును. బుద్ధి ఏదో ఒక నిశ్చయము చేయుచుండును. ఈరెంటిని భగవంతునియందు స్థిరముగా స్థాపించిన వాడు ఆమరుక్షణమునుండి భగవంతునియందే నివసింపగలడు. మనస్సు మిక్కిలి

చంచలమైనది. అదియొక అద్దము వంటిది. పరిశుభ్రమైన ఆ నిలువుటద్దమున కెదురుగా ఒక రంగురంగులతెర గలదు. జ్ఞానేంద్రియములయొక్కయు కర్మేంద్రియములయొక్కయు విషయ సంయోగముచేత సంగ్రహింపబడిన అనేక విషయముల యొక్క ఛాయాపటములు ఆయవనికపై స్ఫుటతరకాంతులతో ప్రతిబింబించుచుండును. ఆతెర మీది బొమ్మలన్నియు ఆ యద్దములో నిద్దముగా ప్రతిఫలించక తప్పదు. ప్రతిబింబించుట తప్పని బుద్ధి చెప్పినను మనస్సు ప్రతిబింబించుటమానదు. పెక్కు సందర్భములలో బుద్ధి మనస్సును మందలించును. కొన్ని సందర్భములలో ఆ మందలింపునకు కూడ శక్తి చాలకుండును. 'బుద్ధిః కర్మానుసారిణీ' అని పెద్ద లందురు. కర్మఫలము జీవునిచే అనుభవింపఁ జేయునది నిశ్చయాత్మక మైన బుద్ధియే. అట్టి బుద్ధి చేయు నిశ్చయములలో కొన్ని తప్పులుండును. కొన్ని ఒప్పులుండును. ఆతప్పొప్పులు కర్మ ననుసరించి యుండును. ఈ పరిస్థితిలో మనోనిగ్రహమునకు అనన్యభక్తియొక్కటే సులభతరమైన మార్గము. దానిచే మనస్సు క్రమముగా పవిత్రీకరింపఁబడును. ఈవిధముగా జీవుని హృదయస్థాన మందు మనస్సుయొక్క పాత్ర మిక్కిలి ప్రధానమై యున్నది. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని మహాత్ములన్నట్లు మానవుల బంధమోక్షములకు మనస్సే కారణమగుచున్నది.

మనస్సును సమాధానపఱచుట సామాన్యమైన పని కాదు. అట్లని ముముక్షువు భయపడి తన వ్యవసాయము నుండి విరమింపరాదు. భగవంతుని దివ్యమంగళరూపము నాలంబనము చేసికొని యెల్లవేళల ధ్యానించు నభ్యాసము గావింపవలెను. అట్టి అభ్యాసము కూడ పెక్కుమందికి దుష్కరమేయగుచున్నది. అట్టివారు తామాచరించు కర్మలన్నియు స్వార్థరహితులై యీశ్వరార్పణబుద్ధితో గావింప వలెను. కర్మ భగవదర్పణబుద్ధితో చేసినచో సిద్ధి లభించును. అట్లు కర్మాచరణము గావించుట కూడ కష్టమే కావచ్చును. అట్టివారు కర్మఫలము నీశ్వరునకు ధారవోసి యేకాంత భక్తితో భగవంతుని సేవింపవలసియున్నారు.

అభ్యాసమనఁగా వేదధర్మములను తెలిసికొనుట. జ్ఞానమనఁగా నాత్మతత్త్వమును బోధపఱచికొనుట. అభ్యాసము కంటె జ్ఞానము గొప్పది. జ్ఞానము కంటె భగవన్నిష్ఠమగు ధ్యానము గొప్పది. అట్టి ధ్యానము కంటెను కర్మఫల త్యాగము గొప్పది. త్యాగముచే శాంతి తప్పక లభించును. భాగవతాదులగు సద్గ్రంథములు బోధించు సూత్రము త్యాగమే.

భక్తుఁడు భూతదయ కలిగి యుండవలయును. ప్రాణులయెడ ద్వేషభావము విసర్జింపవలయును. జీవకారుణ్యము కలిగియుండవలయును. భక్తులందు ఈ లక్షణము స్ఫుటముగా గోచరించును. మమకారమును అహంకారమును విడిచి పెట్టవలెను. కీడు చేసిన వారిపట్ల పగ తీర్చుకొనక ఓరిమి కలిగి యుండవలెను. దొరికినదానితో తృప్తి కలిగి యుండవలెను. ఎల్లప్పుడు భగవంతుని స్మరించవలెను. ప్రయత్నశీలియై యుండవలెను. దృఢనిశ్చయముతో మనోబుద్ధులు భగవదధీనములు కావించుకొనవలెను. లోకమును క్షోభపెట్టరాదు. లోకముచేతను క్షోభపడరాదు. సంతోషము, కోపము, భయము, ఉద్వేగము మొదలగు విషయభావములను విడిచి పెట్టవలెను. కోరికలు విడువ వలెను. బాహ్యశుద్ధి, ఆంతరశుద్ధి కలిగి యుండవలెను. కర్మాచరణమందునేర్పరియై యుండవలెను. దిగులు పోగొట్టుకొనవలెను. సంకల్పములను విడనాడవలెను. ఎగ్గుబాటు జరిగినపుడు శోకింపరాదు. దొరకని సుఖమును కోరరాదు. మంచిచెడ్డలను సమానముగా విడిచిపెట్టవలెను. శత్రువు నందును మిత్రుని యందును సమదృష్టి కలిగియుండవలెను. మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములపట్ల సమచిత్తుఁడై యుండవలెను. దేనియందును సంగము పెంచుకొనరాదు. ఇతరులు తన్ను పొగడినపుడు పొంగరాదు. తెగడినపుడు క్రుంగరాదు. పరమాత్మతత్త్వమును మననము గావించుకొనవలెను. ఎచ్చటను స్థిరముగ నివసింపరాదు. భగవంతుని యందు స్థిరముగ నివసించు భక్తితో నాతనిని కొలుచు చుండవలెను. ఈవిధముగా సమస్త సల్లక్షణ సమంచితుఁడై భక్తిశ్రద్ధలతో భగవంతుని కొలుచు భక్తుఁడు ఈశ్వరునితో నైక్యమొందును. జీవేశ్వరైక్యము మోక్షము. ఇదియే భక్తిరసమునకు పరకాష్ఠ.

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 6. భక్తి - రసప్రతిపత్తి

సంస్కృతాంధ్రసాహిత్యము లందలి కావ్యనాటక ప్రస్థానములో రసమునకు ప్రత్యేక ప్రతిపత్తి యుండెను. రసహీనమైన కావ్యమునకు ప్రాచీన సాహిత్యమందు చోటులేదు. పాఠకుఁడు గాని ప్రేక్షకుఁడు గాని అనుభవించు ఆనందమునకే స్థూలముగా రసమను నామకరణము గావించి ప్రాచీనాలంకారికులు దానిని శతవిధముల వింగడించి నిరూపించిరి. రసమనునది పాఠకునిచేత ఏవిధముగా అనుభూయమాన మగుచున్నదో ఉదాహరణపూర్వకముగా ఆనందవర్ధనాచార్యుఁడు మొదలగు మహనీయులు ఆయానంద సంవర్ధనమును మనకన్నులకు కట్టినట్లు ప్రదర్శించిరి. కావ్యనాటకములందు రసమాత్మస్థానీయము ఆత్మచైతన్యములేనిదే శరీరమునకు మనుగడ లేనట్లే, రసము లేనిదే కావ్య శరీరమునకు మనుగడ లేదని అభిజ్ఞులగు నాలంకారికు లెల్లరు ఏకాభిప్రాయబద్ధస్పృహులై సిద్ధాంతీకరించిరి. ఈ విధముగా కావ్యనాటక పరిశీలనము గావించు నపుడు సహృదయులెల్లరకు రసమను పదార్థము కొలబద్ద యయ్యెను. ప్రాచీన కవులెల్లరకు రస మనుల్లంఘనీయమై తత్పరిపోషణము కొఱకై వారు తత్తత్కావ్యములను ఒకేమాటపై, ఒకేబాటపై ఒకే మూసలో నడిపించుట కృతార్థులైరి. రసపోషణ మందు భారతాద్యుద్గ్రంథములు, కుమారసంభవాది కావ్యములు, శాకుంతలాది నాటకములు అగ్రస్థానీయములై ఈనాటి పఠితల్లు కవితల్లజు లెల్లరకు మార్గదర్శకములై యలరారుచున్నవి.

"రస్యతే ఇతి రసః" అని రసమును నిర్వచింతురు. అనఁగా ఒకానొక రసము స్వాదూకరణ సామగ్రిచే ఆనందదాయకముగా పరిణమించి రసమగును. అనఁగా మన హృదయ మందలి భావమే పోషింపఁబడి రసముగా పరిణమించుచున్నదని యభిప్రాయము. ఈ లోకమందనేకములగు భావములున్నవి. ఆ భావసమాహార

మగు తోరపుటాకాశతీరమున వాక్సరస్వతి విహారము చేయుచుండును. అట్టి భావము లన్నియు రసములు కాతేవు. రసములు అనగా కావ్యప్రస్థానములో నానందమును విందుసేయగల రసములు — తొమ్మిదే. ఈ నాటకము, ఈ కావ్యము నవరసభరితముగా నున్నది యనుకొందుమే కాని యారసముల సంఖ్య మనము సాధారణముగా పెంచము, తగ్గించము. అనఁగా నీనాటకమందు రసము లన్నియు తత్తదుచితస్థానములలో లెస్సగా పోషింపఁబడినవన్నమాట. దీనిని బట్టి తేలిన దేమనగా—ఈలోకమందు భావము లెన్నియున్నను రసములు మాత్రము తొమ్మిదే. కొంత యానంద మీయగల శక్తి మాత్రమే భావమున కున్నది. కాని రసానంద మీయఁగల శక్తి రసమునకే యున్నది. భావమనఁగా అభిప్రాయము. అట్టి అభిప్రాయముల సమాహారములో వాని అనుస్యూతినిబట్టి స్వాదూకరణవిధానమును బట్టి 'రసము' ఆవిర్భవించుచున్నది. "గాలి చల్లఁగా వీచుచున్నది. బెగ్గురులు కలస్వనముతో గానము సేయుచున్నవి". ఈ రెండును రెండు భావములు. వీనిని కలిపినచో నొక అందమైన భావమేర్పడినది. అది కొంత ఆహ్లాదము కైసేయఁగలిగినదేకాని అదే రసానందము మన కిందియఁజాలదు.

ఇక భావమునకు కవిత్వమునకుఁగల సంబంధమును గూర్చి పరిశీలింప వలసి యున్నది. భావమనఁగా అర్థము, లేక అభిప్రాయము, లేక ఉద్దేశము. అనేకములగు బావముల సమాహారమే ఈ లోకమగుచున్నది. అట్లే అనేక భావముల సమాహారమే కావ్యమగుచున్నది. ఆధునికాంధ్ర కవిత్వములో 'భావకవిత్వము', అనునది ముఖ్యమగు శాఖలలో నొకటి. ఈ శతాబ్దమునందు సగభాగమునకు పైబడి భావకవులు విజృంభించి ప్రముఖ స్థానము లాక్రమించిరి. భావమును ప్రధానముగా నాశ్రయించి చెప్పఁబడిన కవిత్వమే భావకవిత్వము. ఇట్టి భావకవిత్వము పూర్వకవుల కవిత్వములో నేటి కంటె మేటిగా సాటిలేని కాంతులతో దర్శనమిచ్చుచునే యున్నది. ఈ శతాబ్దమందలి బావకవులందరికి స్ఫూర్తిదాయకుఁడు, మార్గదర్శకుఁడు, గురుస్థానీయుఁడు ఆనాటి పోతనయే అనుటలో విప్రతిపత్తి లేదు. ఆతని మాటలు వర్ణచిత్రములను బోలియుండును.

మానవుఁడు కావ్యపఠనముగావించునపుడు కించిత్కాల మయినను బాహ్యస్మృతి కోల్పోయి ఆనందము ననుభవించును. తన్ను, తనచుట్టుపట్ల నున్న ప్రపంచ

మును మఱచి పఠిత ఆస్వాదించు నానందమునే రసానందముగా వక్కాణింతురు కావ్యమునకు ప్రయోజనము కూడ ఆనందమే. ఆనందమే దాని ప్రయోజనము కానినాఁడు ప్రాజ్ఞులెందఱో నిరంతరము కావ్య పఠనము గావించుట పొసగదు కావ్య పఠనము, శ్రవణము గావించు బుద్ధిమంతులను పెక్కుమందిని మనము చూచుచున్నాము. కావ్యములు పెక్కులు చక్కగా రచింపఁబడి ప్రాచుర్యము వహించియుండుటయును గమనించు చున్నాము. కావ్యరచనయు, కావ్య పఠనమును నిరంతరాయముగా కొనసాగుట కందలి యానందమే కారణము.

వాఙ్మయమంతయు మూఁడు రకములుగ విభజింపఁబడినది. వేదవాఙ్మయము, పురాణవాఙ్మయము, కావ్యవాఙ్మయమునని. వేదములు శబ్దప్రధానమైనవి పురాణము లర్థప్రధానములు. ఇఁక కావ్యములు సూక్తి ప్రధానములు. కాంతా సమ్మితములు. గుణవతియగు భార్య తన గుణరూపశీలములచే భర్త మనస్సు నాకర్షించును. మంచిమాటలచే నాతని సన్మార్గవర్తునిగాఁ జేయును నడపించును అట్లే కావ్యములు కూడ తమ గుణాలంకారశయ్యాసౌకుమార్యలావణ్యమాధుర్యవిశేషములచే పఠితల కానందము చేకూర్చుచు ధ్వని పూర్వకముగా వానికి కర్తవ్యోపదేశము గావించును. ఈవిధముగా కావ్యములందు ఉక్తివైచిత్రికి, వ్యంగ్య మర్యాదకు శబ్దార్థౌచిత్యమునకు ప్రాధాన్యము లభించును. మొత్తము మీఁద ఆనందము, ఉపదేశము కావ్యములకు ప్రధాన ప్రయోజనములని తెలుచున్నది. అందు ఆనందము గొప్పదా ? ఉపదేశము గొప్పదా ? అను విషయములో అభిప్రాయభేదమున్నను అభినవగుప్తుఁడు మాత్రము ఆనందమే పరమ ప్రయోజనమని నొక్కి వక్కాణించెను. ప్రీతి కారణముగా ఆనందము కారణముగా మానవుఁడు కావ్యపఠనము గావించు చున్నాఁడు.

భరతుఁడు మొదలుకొని ప్రాచీనాలంకారికులెల్లరు భక్తిని నవరసములలో చేర్చియుండలేదు. భక్తి భావమే యనియు దానికి రసప్రతిపత్తి లేదనియు త్రోసివైచిరి. నవరసములలో తొలుత స్థానము లేకున్నను కాలక్రమమున వత్సల రసము, ప్రేయోరసము, భక్తిరసము కూడ చోటు చేసికొన్నవి. ప్రకరణాంతరమున వత్సల రసము, ప్రేయోరసము వివరింపఁబడినవి. ఇఁక భక్తి రసమునకు వచ్చినచో భాగవతాదిగ్రంథములు పెక్కు భక్తిరసప్రధానములై, పఠితలకు నాలంకారికులకు కూడ

అవశ్య పఠనీయములై, ఆనందసంధాయకములై యొప్పుచున్నవి. భక్తి కేవలము ఒక భావమే కాక రసానందము నందీయగల భావరాజముగ గుర్తింపఁబడి, స్తుతింపఁ బడినది. భక్తిరసమునందు భక్తుఁడు నాయికా స్థానీయుఁడు కాఁగా, భగవంతుఁడు నాయక స్థానీయుఁడగు చున్నాఁడు. భక్తునియందలి భగవద్రతి రూపమగు స్థాయి భావమే విభావానుభావాదులంచే చక్కఁగా పోషింపఁబడి భక్తి రసముగ పరిణమించు చున్నది.

ధనంజయుఁడు, హేమచంద్రుఁడు, మమ్మటుఁడు మొదలగు పెక్కుమంది లాక్షణికులు భక్తి రసము కాదని సిద్ధాంతీకరించిరి. ఇట్టి పూర్వలాక్షణికు లందరి యందును కొంత ముందుచూపు కలిగి భక్తి విషయకముగ పురోగమించినవాఁడు జగన్నాథుఁడు. ఆతఁడు కూడ భక్తిని భావముగానే స్వీకరించి యున్నను దానికి విభావానుభావాది సామగ్రిని నిర్దేశించి తుట్టతుదకు మాత్రము దానిని రసముగ నంగీకరింపలేకపోయెను. భక్తి రసమేల కారాదు? భక్తి రసమందు భగవంతుఁ డాలంబన విభావము. రోమాంచాశ్రుపాతాదు లనుభావములు. హర్షశోకాదులు వ్యభిచారులు. ఇందు భగవదనురాగరూపమగు రతియే స్థాయి భావము. ఇది శాంత రసము కంటె భిన్నమైనది. ఏలయన భక్తికి స్థాయి భావము అనురాగరూప మగు రతి. శాంతమునకు స్థాయిభావము వైరాగ్యము. ఈరెండును పరస్పర విరుద్ధములు. భక్తి దేవతావిషయకమగు రతి యగుటచే అది రసముకాదు, భావమే యని భరతముని ప్రమాణీకరించెను. 'దేవతా విషయకమగు రతియు, వ్యభిచారులును భావమని చెప్పఁబడినది' అని ప్రాచీన సిద్ధాంతము.

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః
భావః ప్రోక్తః....... ............."

కావ్యప్రకాశము - చతుర్థోల్లాసము - శ్లో. 35

అని మమ్మటుఁడు దేవాది విషయక రతిభావమే కాని రసము కాదని నిరసించెను. రతి కామినీ విషయకమయినను, భగవద్విషయక మయినను రతియే. ఇందొక రతి భావమై మరొక రతి రసమగుట విడ్డూరముగానున్నది. భగవద్విషయకమగు రతి భావమే యయినచో కామినీ విషయకమగు రతి కూడ భావమే అనవలసి యుండును.

స్థాయి భావములలోనున్న రతి దేవతా విషయకమైన రతి యని పేల యనరాదు? ఏది రసమో ఏది భావమో వీని వ్యవస్థా విషయమున భరతముని వచనమే మనకు ప్రమాణము.

ఈవిధముగా నలంకారశాస్త్రకారులెల్లరు భక్తి రసము కాదనియు భావమే యనియు సిద్ధాంతీకరించిరి. కాని వీరియందిరువురు మాత్రము భక్తికి రసత్వము నంగీకరించి ప్రాచీనుల వాక్యములకు పూర్వపక్షము గావించి సవిస్తరముగా ప్రతిపాదించిరి. వారిలో ప్రథముఁడు "ఉజ్జ్వలనీలమణి" కర్తయు, వంగదేశీయుఁడు నగు రూపగోస్వామి. రెండవవాఁడు పరివ్రాజకాచార్యుఁడైన మధుసూదన సరస్వతి. రూపగోస్వామి మధురము, ఉజ్జ్వలమునను పేరుతో భక్తిరసమును సవిస్తరముగ ప్రతిపాదించెను. ఈతఁడు వివరించిన భక్తి శ్రీకృష్ణగోపీవిషయకమైనది. శృంగార రూపమైనది. దీనికి చిత్తద్రవము స్థాయిభావము. ఇతరశృంగారముపాదేయము కాదు. కాని గోపగోపీ విషయకమగు రతియే ఉపాదేయము. అదియే భక్తి రసముగ పరిణమించుచున్నది. రూపగోస్వామి భక్తి రసము ప్రపంచింపఁగోరి అందే కదేశమగు మధురభక్తిని మాత్రమే స్వీకరించి అదియే భక్తిరసమని ప్రపంచించుట భ్రమ ప్రమాదములకు లోనయ్యెను. గోప గోపీవిషయకమగు భక్తిమాత్రమే భక్తి యైనపుడు ధ్రువప్రహ్లాదాది బాలుర యొక్కయు, జనకాంబరీషాది రాజర్షులయొక్కయు నారదసనకసనందనాది దేవర్షుల యొక్కయు, కుచేలార్జునాది సఖుల యొక్కయు భక్తి భక్తి కాక పోవలసి వచ్చుచున్నది. భగవదాకారాకారితమగు చిత్తవృత్తియే భక్తి. అట్టి చిత్తవృత్తియందు మధుర భక్తియనునది ఒకానొక శాఖికమాత్రమే. అదియే వృక్షము కాదు. ఒక్కొక్క భక్తుఁడు ఒక్కొక్క విధముగ భగవంతుని భావించి ధ్యానించును. ఒకఁడు నందాంగనాడింభకుని మనః ఫలకమున ముద్రించుకొనును. మఱొకఁడు గీతోపదేశము గావించుచున్న చతుర్భుజుని ధ్యానించును. వేఱొకఁడు తాను గోపికగ మారి గోపాలుని విమలమేచకాకారము ధ్యానించును. ఈ విధముగ భక్తి రసము శాఖోపశాఖలుగ విస్తరిల్లి కల్పలతాభమై భక్తులకు భగవదనురక్తులకు ముక్తికాంతా కిరావలంబమును సమకూర్చుచున్నది.

భక్తికి సంపూర్ణ రసప్రతిపత్తి కలిగించినవాఁడు హరిభక్తి రసాయనకారుఁడగు మధుసూదన సరస్వతి. అతఁడు ప్రతిపాదించిన భక్తిరసము సమగ్రమై

సార్థకమై, సముదాత్తమైయున్నది. అతఁడు స్వప్రమాణముగా భక్తికి రసత్వమును సంస్థాపించెను. శోకము, క్రోధము, భయము మొదలగు భావములు మనకు దుఃఖ మొనఁగూర్పఁగలవే గాని సుఖ మావంతయైనను చేకూర్పలేవు. అట్టి భావములకుకూడ అనుభవమే ప్రమాణముగా రసత్వ మంగీకరించుచున్నాము. శోకము చక్కఁగా పోషింపఁబడి కరుణరసముగా పరిణమించు చున్నది. శోక మను భావము లోకులకు ఆనంద మొసంగుట విలక్షణమైన విషయము. అయినను ఆ శోకమే చక్కఁగా పోషింపబడిన కావ్యము మనకానందమే యిచ్చుచున్నది. ఇది అనుభవైకవేద్యమైన విషయము. ఇట్లే భక్తిరసము కూడ పెక్కుమందిచే ఆనందింపఁబడుచున్నది. భక్తిరసము మిగిలిన రసములకంటె వేయిరెట్లు అధికముగ రస్యమాన మగుచున్నది. అట్టియెడ భక్తి రసము కాదనుట హాస్యాస్పదము. రసకోవిదులెల్లరు దేవతా విషయకమగు రతి రసముకాదనిరి. అది భావమే యని సిద్ధాంతీకరించిరి. ఇతర దేవతా విషయకమగు రతి భావమే. ఇతర దేవతలు కూడ జీవులే యగుట వలన వారు పరమానందము నీయఁజాలరు. పరమాత్మ స్వరూపుఁడగు శ్రీకృష్ణుని యందలి రతి పరమానందము నందీయఁగలదు. అందుచే దానికి రసత్వమంగీకరింప వలసిన వార మగుచున్నాము. అంతేగాక కాంతాది విషయకమగు రతికిని భగవద్రతికిని భేదము గలదు. కాంతాది విషయకములగు రసములచే ఆనందము కలుగదు. వానియందు రసపుష్టి లేదు. అందుచే శృంగారాది రసము లన్నియు క్షుద్రరసములు. భగవద్రతి పూర్ణరసము. ఆరసములు మిడుఁగురు పురుఁగుల వంటివి. భక్తి రసము సూర్య కాంతి వంటిది. ఈ భక్తి రసమునకు నాలంబన విభావము భగవంతుఁడు. తచ్చరిత్రి లుద్దీపన విభావములు. భగవదాకార చిత్తవృత్తియే స్థాయి భావము. అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమునఁ బుట్టిన నేత్రాది వికారములు. వ్యభిచారులు నిర్వేద శంకాహర్షాదులు. ఇది పరమానంద స్వరూపమగు భక్తి రసముగాఁ బరిణమించును.

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 7. భక్తి వైవిధ్యము

'భజ' సేవాయాం అను ధాతువు నుండి భక్తి యను పదము నిష్పన్నమగును. సేవా ప్రాధాన్యము గల ఈశ్వరారాధనము భక్తిగా పరిగణింపబడును. ఆ సేవ ఈశ్వరునితోపాటు తద్దేహముగా పరిగణింపబడు జగత్తునకుకూడ వర్తించును. అనగా జనోపయోగకరమైన కార్యక్రమములు చేపట్టుట, ప్రకృతి వైపరీత్యములు సంభవించినపుడు పీడిత ప్రజానీకమునకు బాధోపశమనార్థమై నిర్మాణయుతముగ కొన్ని పనులు నిర్వహించుట, దీనులను, రోగులను ఆదుకొనుట ఈ అన్నింటికి ప్రతిఫలము కోరకపోవుట సేవయే అగును. కనుక అది భక్తిలో భాగముగనే స్వీకరింపవచ్చును. త్యాగబుద్ధి ఈ అన్ని కార్యములలోను అంతర్లీనముగ నుండును. "To Serve the Man is To Serve the God" "మానవ సేవయే మాధవ సేవ", అనుటను ప్రధానముగా గ్రహించి రామకృష్ణమఠము, సత్యసాయి సేవా సమితి మొదలగు అనేక సంస్థలు ప్రజోపయోగకరములైన అనేక సేవా కార్యక్రమములను నిర్వహించుచు మానవుల కెంతో సేవ చేయుచున్నవి.

భగవంతుని శరీరమగు జగత్తును సేవించుకొనుట బాహ్యభక్తి అగును. జగత్తునకు అంతరాత్మగ నున్న భగవంతుని పట్ల అచంచల విశ్వాసముతో ప్రవర్తించి ఆత్మార్పణము చేసికొనుట అంతర్భక్తి యగును. భగవంతుని సర్వకాల సర్వావస్థలయందు మానసికముగ అంటిపెట్టుకొని యుండుట దీని ప్రధానలక్షణము. ఈశ్వరునితో నెడబాటు ఒకక్షణమేనియు సహింపలేకపోవుట భక్తులకు నిత్యానుభవ సిద్ధము. భక్తియందలి వైవిధ్యమును స్థాపించుచు పోతన సప్తమ స్కంధములో —

"తను హృద్భూషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్ర మంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!"
(ఆం. మ. భాగ. 7–167)

తల్లి గర్భము నుండియే యోగి శిఖామణియు మహాభక్తాగ్రేసరుఁడు నగు నారదభగవానుని ఉపదేశామృతమును గ్రోలు నదృష్టమునకు నోచుకొన్న ప్రహ్లాదుఁడు తన తండ్రియు అధర్మమార్గసంచారనిష్ఠాగరిష్ఠుఁడునగు హిరణ్యకశిపునకు భక్తి వైవిధ్యమును గూర్చి ఉపదేశించుచు ఈవిశేషములను ప్రవచించెను. ఇష్టము వచ్చిన పనులెల్లను చేయుచు ఏదో ఒకసారి హరి, నారాయణ, గోవింద అన్నంత మాత్రముతో ఇది భక్తియుకాదు. వాఁడు భక్తుఁడునుగాఁడు. మొదట సత్యవ్రతమును దీక్షాదక్షతతో ఆచరింప వలెను. అదియే భక్తిలో ప్రథమస్థానము నాక్రమించుచున్నది. మనస్సులో తలంచు ఆలోచన, నోటితో చెప్పుమాట, ఇంద్రియములతో చేయుపని – ఈ మూఁడును ఒకటిగా నుండుటకే సత్యమని పేరు. అయినను నిందు రాగద్వేషములకు తావుండరాదు. పరుల సొమ్ము నపహరింపవలెనని ఆలోచించి, అపహరింతునని నోటితో చెప్పి, ఆచరణ పూర్వకముగ అపహరించినచో నిందు మనోవాక్కాయములకు ఏకసూత్రనిబద్ధత యున్నను నిది సత్యముకాదు. శాస్త్ర విరుద్ధమగుటయే అందుకు హేతువు. కనుక శాస్త్రచోదితమైన ధర్మ కర్మవిషయమునందే త్రికరణ శుద్ధి పాటింపఁబడినచో సత్యమనిపించుకొనును. ఇది వ్రతముగ స్వీకరింపఁబడినపుడు ఆచరణ క్రమములో అనుకొనని పెక్కు క్లిష్టపరిస్థితు లేర్పడుచుండును. అట్టి వానిని సమయోచిత ప్రజ్ఞా పాటవముతో పరిష్కరించుకొనుచు ప్రత్యవాయ రహితముగ పురోగమించువాఁడే సత్యవాది.

సత్యము జగచ్చక్ర పరిభ్రమణమునకు మూలము. వ్యక్తికి సంస్కారానుగుణముగను, పరిసరసామాజికజీవనస్థితిగతులంబోని అనుకూల్య ప్రాతికూల్యములను బట్టి ఏర్పడు నిమ్నోన్నతములను బట్టియు తనకు తాత్కాలికముగ సుఖమని తోచిన దానిని చేయ నిర్ణయించు ప్రలోభము ఉండవచ్చును. కాని శాస్త్రమున నట్టి ప్రలోభములు ఏవియు నుండవు. అది కేవలము జగత్కల్యాణ తాత్పర్యముతోనే

త్రైకాలిక ధర్మ వ్యవస్థను నిర్దేశించును. అట్టి ధర్మము యొక్క స్వరూపస్వభావము ఎట్టిదో తెలిసికొనక గ్రుడ్డిగా నాచరింపఁబోవుట నేల విడిచి సాము చేయ వేరుకాదు. కనుకనే భక్తిలో ద్వితీయ స్థానము శ్రవణమున కీయఁబడినది. దసలు విషయపరిజ్ఞానమునకై శాస్త్రసూత్రములను విజ్ఞానవేత్తల భాష్యములను అభ్యసింపవలెను. వినునప్పుడు పొటమరించు అనేకానేక సందేహములను తలానుభవ ప్రాతిపదికపై వేత్తృశిరోమణులు విచారించి సత్పథమును భగవత్తృష్ణ మొనర్తురు.

ఏ శాస్త్ర మెప్పుడెచ్చట నేమి యుపదేశించినను ఆయుపదేశముల సమునకు జగన్నిరసనపూర్వక జగత్కర్తృచరణ శరణాగతియే సారభూత తాత్పర్యాంశమగును. అట్టి భగవంతునకు దాస్యము చేయుట భక్తిసౌధ పరంపరలో మూఁడవదిగ నిశ్చయింపఁబడినది. సాధకుఁడు మొదట నామరూపగుణక్రియాదిలక్షణవిరహితమైన అనుపహితశుద్ధచైతన్యరాశిని ఊహింపలేఁడు శాఖాచంద్రన్యాయముగ ... యొక నామమును, రూపమును నిర్దేశించుకొని భగవన్మూర్తికి దాసుఁడై నిరహంకారముగ ప్రవర్తించుట అభ్యసింపవలెను. ఫలవాంఛ యీ సందర్భములో సర్వాత్మనా నిషిద్ధము.

తరువాతిది వందనము. వందనమనఁగా నమస్కారము. ఇది ఈశ్వరుఁడు నను భేదమును సమసింపఁజేసి యిరువురిని ఐక్యమొనర్చు ప్రదానికి సంకేతముగనే రెండు చేతులు జోడించుట జరుగును.

తరువాతిది అర్చన. గంధము, పుష్పము, అక్షతలు మొదలగు పరికరములతో స్వామి నలంకరించి తనపట్ల సుముఖునిగఁ జేసికొనుట ం యాశయము. సాధకుఁడు తనలో నప్పుడప్పుడు మొలకెత్తు అహంకారమును ద్రుంచివేసికొనుచు భగవంతునిలో తనపట్ల అనురాగ మొదవునట్లు – అనఁగా భగవత్ప్రసన్నమగునట్లు ప్రవర్తించుట ఈ ప్రక్రియలో సారాంశముగ రూఢమగును.

ఆపయిన సేవయనునది మరింత క్లిష్టమగునంశము. సామాన్య మానవుఁడేపని చేసినను ఏదో ఒక ప్రయోజనము నుద్దేశించి చేయుచుం

పరిమోఃజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే", అని కదా ఆర్యోక్తి? ప్రయోజనము ద్దేశించు నంతవఱకు, స్వార్థచింత ఉన్నంతవఱకు ఆచేయునది సేవ కాఁజాలదు. రీరయాత్రానిర్వహణమాత్రప్రయోజనకారి యగు స్వల్ప ఫలము నభిలషించుట ార్థముకాదు. ఆస్వల్పమునకు కూడ సాధకుఁడు భగవంతునే ఆశ్రయించవలెను నుక అంతమాత్రములో దోషములేదు. ఇఁక నంతకుమించి సుఖభోగములవైపు న స్సేమాత్రము మళ్ళినను, అవి సంగమునకు, అలసత్వమునకు దారితీసి భక్తికి బలప్రతిస్పర్థి యగును. అన్నిటికి నీశ్వరునే నమ్ముకొన్న భక్తుఁడు కర్మాను రముగ సంభవించు శారీరకమానసికక్లేశములను నివారించుటకు కూడ భగవంతునే శ్రయించక తప్పదుకదా! తావన్మాత్రవాంఛాపర్యాప్త్యవధికమయిన చర్యయే సేవ గును.

పరమేశ్వరుని సేవలో మునిగియుండు సాధకునకు అపరిహార్యముగా ండవలసిన మరియొక విశిష్టగుణము ఎఱుక. ఇది వ్యామోహము నుండి మానవుని పాడును. దృశ్యమానమైన ఈజగత్తంతయు గుణాత్మకము, పాంచభౌతికము, శకము అయినను దీనికి హారములో దారమువలె అంతర్లీనముగనుండు నధిష్ఠాన తన్యము శాశ్వతము అని గుర్తించుటయే జ్ఞానము అనఁబడును. ఇది కలిగిన వ వినశ్వరప్రాపంచికతుచ్ఛభోగపరంపరపై నింక అభిలాష యెట్లు ఒదవును? షయదుఃఖదోషానుదర్శనమే ఎఱుకకు ఫలము. ఇది సిద్ధించినంతనే దీని నంటి ట్టుకొని నిరంతర భగవత్ప్రసాదానుభూతి చేతోగోచర మగుచుండును. ఇట్టి స్థితి చ్చిన పిదప సంచితము, ఆగామి అను కర్మవిభాగములు ఫలోన్ముఖములు కాకుండ నే జ్ఞానాగ్నిదగ్ధములయి, ఫలానుభూతిచేఁగాని నశింపని ప్రారబ్ధ మొక్కఁడే మిగిలి, దేహపతనానంతరము కైవల్యసిద్ధి కరతలామలకమగును.

ఆత్మలో నెఱుక ఘటిల్లిన పిదపకూడ అప్పుడప్పుడు మాయాదేవి వేసెడి చ్చులలో తగులుకొనక అసంగుఁడయి, అనహంకారియై, అనవరతము జాగరూ డై లౌకికకర్మాచరణబద్ధుఁడు కారాదు. భగవన్నామసంకీర్తనాపరుఁడై బ్రహ్మా దమహాసాగరకల్లోలడోలావిహరమాణమానసుఁ డగుచుండవలెను. భగవన్నామము సరసంచరజ్జనశ్రోత్రతర్పణకారి యగునట్లు బిగ్గరగా గానము చేసికొనుచుండవలెను. సంకీర్తనధ్వన్యణువులు వాయువాహితములయి అవి పయనించినంత మేర సకల

ప్రాచీనపాపములను హరింపఁజేయును. ఇది లోకకల్యాణపర్యవసాయి. ఇఁక సాధకునకో మనస్సు కేవలము నామసంకీర్తనమునందే లగ్నమయి యుండుటచే, భగవదసంబద్ధ సంకల్పాంకురము పొడసూపదు. ఇది ఆత్మోద్ధరణపర్యవసాయి.

పైకి సంకీర్తన కొంతసేపు చేసిన పిదప కలిగిన అలసటవలననో మరే యితర హేత్వాభాసములవలననో సంకీర్తనము కట్టిపెట్టినపుడు భగవత్సంబంధమయిన చింతనమునందు నిమగ్నుఁడయి యుండవలెను. తన స్వరూపము జగత్తు కాదుగనుక దానితో ఐక్యసంభావన వీడి తన స్వరూపమేదో అట్టి చిన్మయునితోనే శాశ్వత సంబంధము పెట్టికొని మోహరహితుఁడై యుండుట ఈ చింతనమునకు ఫలము. ఇది భక్తిభావములలో చిట్టచివరిది. సాధారణముగ మనస్సునకు ప్రాపంచిక భోగములను గూర్చి చింతించుట అలవాటయిన పనియే అగుటచే ఆ చింతనాభ్యాసమును అవస్తువు నుండి మరల్చి వస్తువు మీదకు తరల్చుట సాధకుని కర్తవ్యము.

ఇట్లు నవవిధభక్తి సాధనములలోను పండిన మహనీయుఁడు స్వయముగ విస్మయుఁడై "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే," అను ఉపనిషద్వాక్యమును అనుభవపూర్వకముగ తెలిసికొని జగత్తునందలి ప్రత్యణువునందును భగవద్విభూతి నాస్వాదించి తదేకభావనతోనే జగత్సేవపూజ చేసికొనును. సాధనావస్థలో విష్ణుభీతుఁడై ఏకాంతత నపేక్షించినను, సిద్ధావస్థలో అన్నింటికి అతీతుఁడై దుఃఖిత ప్రాణిసేవాధురంధరుఁడై సంతతశాంతిసమాక్రాంతస్వాంతుఁడగును.

ఇంక నవవిధభక్తులలో "తనుహృద్భాషల సఖ్యమును" ప్రహ్లాదుఁడు ముఖ్యముగా మొదట పేర్కొనెను. తనువునకు హృదయమునకు భాషకు సంవదించిన ఏకత్వమునే సత్యమందురు. ధర్మమునందలి అంగములలో సత్యమే అగ్రగణ్యమైనది. రామాయణకథానాయకుఁడైన శ్రీరాముఁడు, మహాభారతకథానాయకుఁడైన ధర్మరాజు కూడ నిజజీవితములో సత్యమునకు పట్టము గట్టిన మహనీయులు. మన భాగవత ప్రథమస్కంధమందే ధర్మనందనుని ప్రసక్తి వచ్చును. గురువధజనితవ్యథానిదాఘ దందహ్యమానమానసుఁడగు నాతఁడు అనృతము వ్రాయించియే గురువధ గావించితి నని కలంగుచు దుఃఖిల్లెను. శ్రీకృష్ణుఁడు అతనిని భీష్ముని వద్దకు గొంపోయెను. భీష్ముఁడాతనికి రాజధర్మ ముపదేశించి చేతమందలి కందు దుడుపఁజేసెను.

ఆతఁడాశ్రయించిన అసత్యము ఆభాసమైనదే గాని నిజమైనదికాదు. ఆభాసమగు అసత్యమువలన నాతని కసత్యదోష మంటలేదు. లేనిదోషము నాపాదించుకొని వ్యథ చెందుట ధీరుల కుచితము గాదని భీష్ముఁడాతనిని మూదలించెను. ధర్మజుఁడు అసత్యమునకు వెఱచినట్లు అపమృత్యువునకు కూడ వెఱచినవాఁడు కాఁడు. సత్యవ్రత పరిపాలనాయత్తుఁడై ఆతఁడు నీతి విత్తములలో బుద్ధిమత్తుఁడని పేరు గడించి కృతార్థుఁడయ్యెను.

సత్యము నిల్పి సమాశ్రయించిన మహామహులలో శ్రీరాముఁడు ప్రథమ గణనీయుఁడు. ఈతని చరిత్ర సమస్కంధములో నందముగా నిబంధింపఁబడినది. ఈతఁడు నిత్యసత్యవ్రతుఁడై ప్రతిక్షణసత్యోపాసనాపినిర్మలస్వాంతుఁడై కాలము గడిపెను. ఇందు రాముఁడు పెక్కు చోట్ల సత్యవ్రతుఁడు, సత్యసంధుఁడు, సత్యపరాక్రముఁడు, సత్యనిష్ఠుఁడు అని ఈవిధముగా సత్యదీక్షాదక్షుఁడని ప్రస్తుతింపఁబడి యుండెను. సత్యమే అతని బలము. సత్యమే ఆతని తేజము. సత్యమే అతని విజయము. ఇంద్రజిత్తును సంహరించునపుఁడు, "ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది," అని ప్రతిజ్ఞ చేసినట్లును తత్ఫలముగ రావణి మడసినట్లును నిబంధింపఁబడినది. శ్రీరాముఁడు ఆకారము వహించిన ధర్మమనియే గాక ఆకృతి వహించిన సత్యమని కూడ మన మెఱుంగవలసియున్నది. ధర్మమునకు సత్యమునకు గల భేదము అభేదము కూడ ప్రకరణాంతరమున నిపరింపఁబడియున్నది. ధర్మము వలెనే సత్యమును ఈలోకమునకు కుడ్యమై దినదినప్రపంచమును. అందు వీనికి ఏంత ముడిగినను ఈలోకములో అస్తిత్వమునకు దెబ్బ తగులును. ఈరెండు చక్రములు సక్రమముగానున్న బండి అవక్రగమనమునకు భూచక్రమందెందును తిరుగులేదు.

రెండవభక్తి మార్గము శ్రవణము. ఈవిషయమందు కూడ ధర్మరాజ ప్రథమగణ్యుఁ డనుచున్నాడు. ఆతఁడు పండ్రెండేండ్లు కారడవులలో పదరాసి జన్మములు గడిపెను. ఆసమయమంతయు ఆతఁడు భక్తులతోడను, మునీంద్రులతోడను గడిపి సజ్జనుల సాంగత్యముచే నిరంతరధర్మశ్రవణశీలుఁడై కాలము గడపెను. ధర్మము లన్నియు సచ్చిదానంద స్వరూపుఁడగు భగవంతుని సంపద్విశేషములని చక్కఁగా నిరూపించి చూపించును. ఆ విశేషములు వినుచు నిరంతరధర్మచింతనుఁడై

కాలక్షేపము గావింపుచు ఆతఁడు పండ్రెండేండ్లను పండ్రెండు నిముషములవలె గడిపి కృతార్థుఁడయ్యెను. పిమ్మట కూడ శ్రీకృష్ణుని సాంగత్యముచేత అతఁడు ఎన్నో రహస్యములు విని పాటించి కృతార్థుఁడయ్యెను. మరియు భీష్ముని వలన నారదాదుల వలన అతఁడెన్నో ధర్మములు విని నిర్మల చిత్తుఁడయ్యెను. ఆతని కృతార్థత్వమునకు ఆతని వినుకలియే తొలి కలిమియై వెలుగొందెను. దశమస్కంధమందు వెన్నుఁడు తన పిన్నటినాట పిల్లనగ్రోవి చల్లగా నూది ఉల్లములకు చల్లదనము వెల్లిగొల్పెను. పనిపాటలు మరచి తిండితిప్పలు విడచి పిల్లపాపల గడచి గోపికలు గోపబాలురు కూడ లెక్కకు మిక్కిలిగా పరుగులెత్తుకొని నందనానందసందోహసంధాత్రి యగు బృందావనమున నందనందనుని వేణుగానశ్రవణముచే కర్ణపుటముల ఆనందామృతరసాస్వాదనము గావించి చరితార్థులయిరి. వేణువొక బ్రహ్మగీతము. అది చెవి సోకిన వారికి ఎదతాకిన వారికి అందరికి నందనందనుఁడు అమందానందమునే విందు గావించెను. ధర్మములు వినుచు, వర్ణించుచు ఆశ్రయించు వారికి కలిగిన కైవల్యమే వేణునాదము చెవి సోకిన వారికి కూడ అలవోకగా చేకూరెను. ఇది యంతయు శ్రవణమందు అంతర్భాగమైన విషయమే.

భక్త్యంగములలో దాస్యము మూఁడవది. భక్తుఁడు భగవంతునకు దాసోఽహమని దాస్యము నెఱపుచు క్రమముగా 'సోఽహం'గా పరిణమించును. దాసోఽహమనగా నాపరమాత్మునకు నేను దాసుఁడను అను భావము. ఇది ద్వైతము. సోఽహమనగా నాపరమాత్మయే నేను అనుభావము ఇది అద్వైతము. భక్తుఁడు భగవానుని తెలిసికొనునప్పటి, చూచునప్పటి పరిస్థితి దాసోఽహము. ఆతని యందు ప్రవేశించు నప్పటి పరిస్థితి 'సోఽహం'.

పంచమస్కంధమున నిబంధింపఁబడిన భరతుని కథ దాసత్వమునకు పరకాష్ఠ. బ్రహ్మనిష్ఠుఁడగు భరతుఁడను మహారాజు హరిణపోతమందలి తగులాటముచే పరవిష్ణుతుఁడై హరిణముగా పరిణమించెను. అనంతరజన్మమున బ్రహ్మనిష్ఠుఁడగు బ్రాహ్మణునిగా జన్మించెను. అహంకారమమకారములు విసర్జించెను. ప్రారబ్ధవశమున తనకు సంక్రమించిన బ్రాహ్మణ జన్మమున కాని, బ్రహ్మర్షిత్వ నిషయందు కాని, కర్మాతీత నిజస్థితియందుకాని తగులాటము నొందక అహంకారమును చోటు

చేసికొననీయక అసంగుఁడై జీవించుచుండెను. నిరంతరబ్రహ్మనిష్ఠానిష్ణాతమనస్కుఁడై నిజశరీరయాత్ర నిర్వహించుచుండెను. సంగము పెంచుకొనుటచే తనకు పూర్వము వాటిల్లిన దురవస్థ నెఱింగినవాఁడు కావుననే నిరంతరజాగరూకుఁడై నిజదేహపతనావధికమగు కాలము నసంగుఁడయి వెలుంగుచు మాయ నవలీలగా నతిక్రమింపఁ దొడంగెను. అంతలో నొక మహారాజాదారివెంబడి బంగరు పల్లకిలో దేశాంతర మేఁగుచుండెను. బోయీ లలసియుండిరి. దీనుఁడగు భరతుని గని యాతని నా శిబికా వహనమున నియోగించిరి. భరతుఁ డాభారము లెక్కసేయక మోయు చునేయుండెను. అంతబరువు మోయుటకు నీరసప్రాయమగు నిజశరీరము సమర్థము కాకుండెను. మార్గము విషమముగా నుండెను. కాళ్ళు వడవడ వడంకుచు పల్లకి కుదుపునకు కారకుఁడై రాజగు రహూగణుని కోపమునకు కారణమయ్యెను. ఆరాజు నీఱు గప్పిన నిప్పువలె బ్రహ్మతేజము కప్పువడియుండుటచే నెవఁడో యనుకొని యాతనిని నిందింపఁదొడగెను. ఒక తిట్టుగాక నోటికి వచ్చిన తిట్లెల్లఁ దిట్టెను. ఆ యవమానము ఆ నింద ఆ శిబికావహనభారము సహించుచు సత్త్వలక్షణసమన్వితుఁడై ప్రతిఫలాపేక్షలేని యామోత మోయుచునేయుండెను. అలవాటులేని పనియగుటచే సరిగా చేయఁజాలకుండెను. ఆ రాజు కూడ తత్త్వజ్ఞానాపేక్షతో నేఁగువాఁడు. ఆ యోగి వాగమృతముచే తన యజ్ఞానము తొలంగగా ఆ శిబిక దిగ్గనుఱికి యాతని పాదములకు మోకరిల్లి వినమ్రుఁడై తత్త్వ మెఱింగెను. ఆతఁడు తన దాసత్వ మహత్త్వాతిశయముచే శాశ్వతుఁడైన మహాయోగీంద్రుఁడు. దాసత్వమునకు భక్త్యంగములలో అగ్రస్థాన మొసగిన అవధూత ఈతఁడే.

భక్తి యందు పిమ్మటి యంగము వందనము. ద్రౌపది, కుంతి మొదలగు సాధ్వులు, ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు మొదలగు బాలభక్తులు కూడ వందనముచే నందనందను దయావిశేషము చూరగొనిరి. దర్శనము, స్పర్శనము, వందనము, అర్చనము కూడ ప్రగాఢభక్తివిశేషపరిపాకముచే పరిణతినొంది సాధకునకు తురీయపురుషార్థవైభవము కరతలామలకము గావించును. ఈ యంగము లన్నియు వింగడింపునకు, విషయపరిజ్ఞానమునకు దోహదకారులగునే కాని విడివిడిగా నెలకొని యుండునవి కావు. ద్రౌపది అధర్మవిజితయై కౌరవులచే పరాభవింపఁబడెను భీష్ముఁడు, విదురుఁడు, గురుజనులెవ్వరు ఆమెను రక్షింపలేకపోయిరి. అప్పటి

విక్రమ సనాథులగు నాథులు కల్గియుండియు వారామెను రక్షింపఁజాలక పోయిరి. ఆమెకు దిక్కెవ్వరు లేరైరి. ఆపన్న శరణ్యుఁడగు హరిని దలంచి ఆమె చేతులెత్తి వందనము గావించినది. వందనము అహంకార వినాశనమునకు చిహ్నము. దానికి గుర్తుగా మనము చేతులు జోడించి నమస్కారము గావింతుము. 'న' అనఁగా జీవుఁడు. 'మ' అనఁగా శివుఁడు. నమస్కారమనఁగా జీవబ్రహ్మ సమైక్యము. అహంకారము నశించిన వెంటనే జీవునకు శివుఁడు సన్నిహితుఁడై సార్థక్యముఁ జేకూర్చును. శివుని పొందిన తరువాత జీవునకు పొందవలసిన దుండదు లౌకికము లగు సమస్త పదార్థములు నాతఁడు పొందినవాఁడే యగుచున్నాఁడు. ఆ పరముని ప్రాప్తి లభించిన పిమ్మట సాధకునకు అధికముగా పొందవలసిన పదార్థ మేదియు కన్పించదు. మహాసాధ్వియగు ద్రౌపది ఈవిధమగు వందన ప్రక్రియచే నంద తనయుని కృప నందగల్గెను.

మనము భగవంతునకు ఇహసంపద లీయనక్కఱ లేదు. మన వ్యాపార ములో లాభ మీయనక్కఱలేదు. అట్లే కుంతీదేవియు కృష్ణున కేమియు నీయలేదు ఆతని కెల్లప్పుడు వందనముగావించి మనస్సులో కొల్చుచుండెను. ఆపన్నయగు నామెకు ఆపన్నశరణ్యుఁడగు శ్రీకృష్ణునకు నవిభాజ్యమగు సంబంధము నెలకొనెను. ఆ సంబంధము క్రమక్రమముగా పరిపుష్టివహించి యామెకు జ్ఞానము కరతలామలక మయ్యెను.

శా. "శ్రీకృష్ణా ! యదుభూషణా ! నరసఖా ! శృంగార రత్నాకరా !
లోకద్రోహి నరేంద్రవంశ దహనా ! లోకేశ్వరా ! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా ! నిర్వాణ సంధాయకా !
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ !"
(ఆం. మ. భాగ. 1-199)

భర్తృ వియోగముచే ప్రారంభమైన ఆమె జీవితము కొడుకుల బాధలతో కుమిలిపోయెను. వారికి సుఖములు కట్టబెట్టవలెనన్న తపనతో నామె దేవన ప్రస్థాన మారంభ మయ్యెను. క్రమముగా భక్తిలతానిబద్ధమగు బుద్ధిచే నామెకు మోహలతా విచ్ఛేదన మయ్యెను. కాలక్రమమున పాండవులు విజయలక్ష్మి సనాథులై కురుమహా సామ్రాజ్యమునకు వారసులైరి. దానితో నామె కోర్కె నెరవేఱలేదు. అది యే

చమత్కారము. మనమేదైన నొక వస్తువుకై తహతహలాడు చుందుము. కర్మ వశమున, కాలక్రమమున అది మన చేతి కందును. కోర్కె మాత్రము ఈరిక లెత్తునే గాని దానికి తీరుట సంభవించదు. ఆమె కోరిక తీరెనే గాని క్రమముగా ఆమెకు లభించిన పరిణతితో ఆమె మోహలతలను తొలగింపు మని హరిని ప్రార్థించెను. ఆమెకు పాండవులందును, యాదవులందును మమకారము నిండు. ఆ మమకారము తొలగిననే గాని యామె భ్రమప్రమాదయవనికాసందోహవిచ్ఛేదనము కావించుకొని సముచితమును చిత్రగింపఁజాలదు. దానికై యామె శ్రీకృష్ణు నాశ్రయించి కృతార్థురాలయ్యెను.

భక్తి కైదవ యంగము అర్చనము. అర్చనతో నెందరో భక్తుల చరితార్థులైరి. వారిలో నంబరీషుఁడు ప్రథమగణ్యుఁడు. అతఁడు మహారాజు రాజర్షి. భూచక్రమంతయు తన యేల్బడి క్రిందకివచ్చెను. అందలి సంపదలన్నియు తన స్వాధీన మయ్యెను. అతఁడు మాత్రమా సంపదంకు అధీనుఁడు కాలేదు నిరంతర జాగరూకుఁడై సద్గుణ గరిష్ఠుఁడై వైష్ణవార్చనము గావించెను.

శా. "సప్తద్వీపవిశాలభూభరము దోస్తంభంబునం బూని సం
ప్రాప్త శ్రీయుతుఁడై మహావిభవ సంపత్ప్రాపకుం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్"
( ఆం. మ. భాగ. 9-81

విష్ణు సమర్పనమున తన సర్వస్వము నర్పించిన యా మహీజాని కహీనమగు శా సుఖము కైవసమయ్యెను. క్రమముగా నాతఁడు మనసా సన్యసించి పురమందు అంతిపురమందును తగులాట ముజ్జగించి గోవిందపదార్చనారతుఁడై యుండెను.

ఆ. 'అతని కిహమూరె హారులందుఁ గరులందు
ధనము లందుఁ గేళివనములందుఁ
బుత్రులందు బంధుమిత్రుల యందును
బురమునందు నంతిపురము నందు' (ఆం. మ. భాగ. 9-8

అంబరీషుని భక్తికి సంతసించి విష్ణు వాతనికి నిజ చక్రము కాన్కవెట్టెను. పిద నొక సంవత్సర మాతఁడు ద్వాదశీవ్రతము గావించి హరి సమర్చనము సలి దానాదికములు నిర్వర్తించి పారణ కుద్యుక్తుఁడై యుండఁగా నాతని కడకు దుర్వాస దేతెంచెను. రాజాతని పూజించి తనతో భోజనంబున కంగీకరింపఁజేసెను. అతఁడ స్నానార్థమై నది కేఁగి రాఁడాయెను. ద్వాదశి చనఁజొచ్చెను. తపసి రాఁడాయెను పండితు లా రాజును సలిలంబులు సేవింపుమనిరి. అతఁడట్లే గావించెను. ముని కుపితుఁడై కృత్యను ప్రయోగించెను. విష్ణు వది యెఱింగి చక్రప్రయోగము గావించెను. చక్ర మా కృత్యను దహించి దుర్వాసుని వెంట నంటెను, దుర్వాసుఁడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను శరణుఁజొచ్చెను. వారా చక్రము వాపలేకపోయిరి. హరి నిజ భక్తుల వైభవ మగ్గడించెను. అంబరీషునే శరణువేఁడు మని దుర్వాసునకు బుద్ధి చెప్పెను. దుర్వాసుఁ డంబరీషుని పాదములపైఁబడి చక్రానలజ్వాలామాలికల తాళింపక రక్షింపుమని బ్రతుకు జీవుఁడాయని తన దారిని తాను పోయెను.

భక్తునకు భగవంతునకు గల సంబంధము విష్ణువే స్వయముగా పేర్కొనెను.

ఆ. "నాకు మేలు గోరు నాభక్తుఁ డగు వాఁడు
భక్తజనుల కెల్ల పరమ గతియు
భక్తిఁ గోరుచుఁ జనుచుఁ బర చెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు కోడె కరణి." (అం. మ. భాగ. 9-1 8)

క. "నాతేజము భక్తులలో
నాతత్త్వ మెయుండు వారి నలఁచు జనులకున్
హరిక్రియ భీతి నిష్ఫల
పరితాపంబు బెలుచు సిద్ధము సుమ్మీ". (అం. మ. భాగ. 9-124)

ఈ పద్యములలో హరి తనకు భక్తులకుగల సంబంధము నభేదము చక్కఁగా తెల్పియున్నాఁడు. హరి సమర్చనానిరతుఁ డగు భక్తుఁడు హరిగానే శోభించుచున్నాఁడు. అంబరీషుని హరికి నభేద మేర్పడుటచేతనే యాతని చక్రమే స్వయముగా వచ్చి రక్షించెను. అతని ప్రార్థనము మీదనే చక్రము వెనుదిరిగిపోయెను.

భక్తి యంచలి ఆఱవ అంగము సేవ. భగవంతుని సేవించి తరించిన ధన్యులెందఱో గలరు. వారిలో నక్రూరుఁడు ముఖ్యుఁడు. అక్రూరుఁడు క్రూరుఁడగు కంసుని యొద్ద మంత్రిగా పనిచేయుచు ఆతని దుర్మార్గము తల కెక్కించుకొనకుండ సద్గుణసంపన్నుఁడై హరిసేవాపరాయణుఁడై కాలము గడపెను. యాదవులం దక్రూరుఁడు సజ్జన మూర్ధన్యుఁడై ధన్యుఁడయ్యెను. కోమల మగు నెడద, వినయ సంపన్న మగు వర్తనము, గుణవరేణ్య మగు చిత్తము వీనితో నాతఁడు సార్థకనామ ధేయుఁ డయ్యెను. కంసుఁడు దుర్మార్గుఁడై రామకృష్ణుల హింసింప నెంచెను. వారిని తోడి తెమ్మని అక్రూరుని బంపెను. రామకృష్ణుల బలపరాక్రమములు, శక్తిసామర్థ్య ములు కూడ అక్రూరుఁడెఱుఁగును. ఆతనికి వారియెడల అపారమగు వాత్సల్యము, అనన్యమగు భక్తి. భక్తుఁడగు తనకు భగవంతుఁడగు కృష్ణుని దర్శించి, స్పృశించి, సంభాషించి తోడ్కొని వచ్చు భాగ్యము కల్గెనని అక్రూరుఁడు పరమానందభరితుఁడై గోకులమున కేఁగెను అందు కృష్ణునిఁ జూచి ఆనందము చెంది ఆతనికి కంసుని ఆదేశము వివరించెను. రామకృష్ణులను మనసార ఉపలాలించుచు నుపాసించెను. ఆతనికి వారియందలి భక్తిప్రపత్తులు అధికమై ధ్యానముద్రయందు ఆతఁడు ఏమి చూచినను అందే నందనందనుఁడు కనువిందు సేయఁదొడఁగెను. రామకృష్ణులను వెంట నిడుకొని యాతఁడు రథస్థుఁడై పోఁదొడంగెను. సాయంసమయమున ఆతఁడు సంధ్యవార్చుచు నదీ జలముల స్పృశించెను. అందు రామకృష్ణు లాతనికి దర్శన మిచ్చిరి. ఆతని సేవ ధ్యానముగా పరిణమించి తత్ఫలితమునే రామకృష్ణుల దర్శనముగా పరిణమించినది. అట్టి ఫలోన్ముఖమైన ధ్యానమే కాలక్రమమున జ్ఞానముగా పరిణమించును. జ్ఞానికి భగవంతునకు భేద మిసుమంతయు లేదు. అక్రూరునకు సేవ పండినది, ధ్యానము కుదిరినది అని సూచించుటకు నిదర్శనమే ఆతఁడు నీటిలో దర్శించిన రామకృష్ణుల ప్రతిబింబములు. అక్రూరుఁడు నీటిలోఁ జూచుకొన్నది తన ముఖమును. నీటిలో కన్పించవలసినది తన ప్రతిబింబమే. శ్రీకృష్ణుని ప్రతిబింబము కన్పించుటలో చమత్కారమున్నది భగవంతుఁడు బింబము. జీవుఁడు ప్రతిబింబము. కృష్ణుఁడు బింబము. అక్రూరుఁడు ప్రతి బింబము. ఆ రహస్యమును దర్శించిన అక్రూరుఁడు నీటిలో తన ప్రతిబింబమును చూడఁగల్గెను. కీటకము భ్రమరము చుట్టు తిరిగి భ్రమరముగానే శేషించినట్లు అక్రూరుఁడు శ్రీకృష్ణుని సేవించుకొని శ్రీకృష్ణునిగానే శేషించెను.

యాదవులందు అక్రూరునకు సాటి రాఁగల శ్రీకృష్ణ సేవకుఁడు ఉద్ధవుఁడు. ఉద్ధవుఁడు కూడ చిన్ననాటి నుండియు శ్రీకృష్ణుని సేవించుచు అతని ఆదరము మైత్రి చవిచూచి ధన్యుఁడయ్యెను. శ్రీకృష్ణునకు అంతరంగికములగు సమస్యలు వచ్చినపుడు వాని గూర్చి ఉద్ధవునితోఁగాని, అక్రూరునితోఁగాని సంప్రదించి వారి సేవలను సద్వినియోగము చేసికొనును. రహస్యముగా నెక్కడికైనను పంపవలసి వచ్చినపుడు కూడ వారిలో నొకరిని పంపించుచు వారికానందకారకుఁ డయ్యెను. జీవుని బంధించునవి కామక్రోధములు. ఎంత సజ్జనుఁడైనను వానిని పూర్తిగా విసర్జింపలేఁడు. ఉద్ధవుఁడు కూడ శమంతక మణి విషయములో నొక పర్యాయము ఈ చిక్కులోనే పడెను. కాని శ్రీకృష్ణసాన్నిధ్యముచేత అతఁడా కామము నుండి బయటపడి కృతార్థుఁడు కాఁగలిగెను. ఉద్ధవుని ఎల్ల విధముల ఉద్ధరించి రక్షించినది శ్రీకృష్ణ భగవానుఁడే.

శ్రీకృష్ణ సేవకులలో సంస్మరణీయుఁడు వినతాసుతుఁడు. అతఁడు అమితమగు పక్షద్వయముచే శ్రీకృష్ణుని ఎల్లవేళల వహించి సేవించి భక్తాగ్రగణ్యుఁ డయ్యెను. ఎల్లవేళల కృష్ణునకు అగ్రగామియై తన బలపరాక్రమములను సార్థకము గావించుకొనెను. శ్రీకృష్ణుఁడు నరకాసురునిపై దాడి వెడలినపుడు సత్యభామా శ్రీకృష్ణులను అతఁడు భుజములపై మోసికొనిపోయి అవక్రమగు పరాక్రమముతో రక్కసుల ఉక్కడఁగించి విక్రమించెను. శ్రీకృష్ణునకు ఈతఁడు కేవలమొక వాహనమే గాక అనేక యుద్ధములందు కుడిభుజమువలె నెడలేక విక్రమించుచు సేవించెను. ఇంతటి సేవకుఁడు మరొకఁడు లేఁడు గనుకనే విష్ణ్వాలయములందు ఈనాటికి మనము మూల విరాట్టునకు ముందు గరుత్మంతుని విగ్రహము అవలోకించి ఆతని యనుమతి తోడనే భగవద్దర్శనమున కుపక్రమించుచుందుము.

భక్త్యంగములలో నేడవది ఆత్మలో నెఱుక. ఆత్మలో నెఱుకనే ఆత్మజ్ఞాన మందురు. భక్తి కను క్రమపరిణతిచే హస్తగతమగునది ఆత్మజ్ఞానము. ఇట్టి జ్ఞానులకు 'బలి చక్రవర్తి' ని ఉదాహరింప వచ్చును. బలిచక్రవర్తి రాక్షసరాజ్య రమావిభుఁడై రమాధవుని ద్వేషించుచు పరిపాలన సాగించెను. అమరేంద్రుని నిర్జించి [illegible] అశ్వమేధాదులు శాస్త్రోక్తముగా నిర్వహించెను. అతఁడు గావించిన క్రతుకలాపములు విధివిహితములయ్యును కామ్యకర్మలగుటచే ఆతనికి బంధహేతువులేగాని మోక్షహేతువులు కాలేదు. అతఁడు గావించిన క్రతువులకు

లోకములు, లోకస్థులు, లోకేశులు కూడ భయభ్రాంతులై తల్లడిల్లిరి. అట్టి కామ్య కర్మలు గావించుచు కూడ ఆతఁడు జ్ఞానము కైవసము గావింపకొనఁ దొడంగెను.

ఆతఁడు స్వధర్మనిరతుఁడై యుండుటచేతనే ఆతనికి జ్ఞానోదయమయ్యెను. ఆతనిని నిర్జించి లోకములను కాపాడుటకు, ఆతని నుద్ధరించి భక్త రక్షణము గావించుటకు శ్రీహరి కనతార క్లేశమనుభవించుట తప్పలేదు. వెంటనే అతఁడు వామనమూర్తియై సమస్త జంతుసంతాన చేతోహారి శరీరుఁడై చూచుట తోడనే సమస్త ప్రాణులను ఆనందింపఁ జేయు సౌందర్యమునకు, లావణ్యమునకు, మాధుర్యమునకు, గాంభీర్యమునకు ఉత్పత్తి స్థానమై వామన రూపములో నవతరించి బలిచక్రవర్తి కడకు చరణత్రయదానపరిగ్రహణ మనస్కుఁడై వెళ్లెను. వచ్చినవాఁడు నిక్కపు వడుగు కాఁడనియు ఆతఁడు శ్రీహరియే యనియు ఏతద్దానచ్ఛలమున తన్ను నిర్జింప వచ్చె ననియు బలి ఎఱుకచే గ్రహించగలిగెను. ఆ ఎఱుకచేతనే తాను శ్రీహరికి భక్తుఁడై ఆతఁడడిగిన మూఁడడుగుల పుడమిని విడువని కడకతో నడలని నడకతో నావడుగు నకు దాన మొసంగెను. ఆదానము సాధారణమైనది కాదు. తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము అన్నట్లు ఆత్మగ్లానిహేతుభూతమగు దానమును నెంతటి అవి వేకియు గావింపఁడు. జ్ఞానవిజ్ఞానముల పారము ముట్టిన వాఁడుగావుననే బలి అట్టి దానమునకు ఒడిగట్టి కట్ట కడపటి పురుషార్థము చేపట్టుటలో కృతార్థుఁడయ్యెను.

తనువు లశాశ్వతములు. మానవుఁడు ఎంతటి వాఁడైనను మృత్యు యవ నికను దాటి నడువ జాలఁడు. మానవుని మాధవుని గావించుటకు త్యాగ మొక్కటే సాధనము. త్యాగము చేతనే మానవుఁడు యశఃకాముఁడై మాధవుఁ డగుచున్నాఁడు. ఇహ లోకమున కీర్తికంటె శాశ్వతమైనది లేదు. అట్టి త్యాగముయొక్క గట్టి తన మిట్టిదని బలి వక్కాణించుటలో ఔచిత్య మున్నది. పండిన ఆ రాజేంద్రుని మనో మందిరమున నిండిన ఎఱుక ఈ మాటలలో చక్కగా తేటలెల్ల మగు చున్నది.

శా. "ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరం బుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే."
(ఆం. మ. భాగ. 8–591)

దానవులకు మాధవుఁ డాజన్మవిరోధి. అతఁడు దేవతలను రక్షించుచు దానవులను శిక్షించుచుండును. విష్ణుద్వేషము బలియందు కూడ కాననయ్యెను. విపరీతమగు నా విష్ణుద్వేషము నుండి జ్ఞానముయొక్క అండచే బలి బయట పడఁ గలిగెను. విష్ణు వనఁగా సకలజీవరాసులందును సమస్తపదార్థములందును వ్యాపించి యున్నవాఁడు. అట్లే ఆతనియందు ఈ సమస్త పదార్థములు వ్యాపించి యున్నవి. అట్టి ఆదిపురుషుఁడు కట్టు గుడ్డలతో వట్టి చేతులతో తన్ను యాచింపవచ్చెను. అట్టి సర్వాత్ముఁడగు యాచకుని కోర్కె తీర్చుట దాతయగు తన ప్రథమ కర్తవ్యము. ఆ దాతృత్వమువలన తనకు దాపురించు కష్టమెంతటి దైనను దానిలో ఒక ఔచిత్య మున్నది. సిరిసంపదలు, భోగభాగ్యములు శాశ్వతములు గావు. శరీరము కూడ శాశ్వతము కాదు. శాశ్వతుఁడగు యాచకుని కోర్కె తీర్చుటచే లభించెడి కీర్తి ఒక్కటే శాశ్వతమైనది. ఈ విధముగా ఆలోచించి బలి వామనునకు పదత్రయ దానము గావించెను. వామనుఁడు త్రివిక్రముఁడై పదద్వయమున బ్రహ్మాండ మంతయు నాక్రమించి మరల వామనాకారము నంగీకరించెను. ఏ భక్తునకు భగవంతుఁడు తన సర్వస్వము జుబ్బనఁజాలియ నున్నాఁడో ఆ భక్తుని సమస్తము తాను పరాస్తము గావించి బంధించును. అట్లు గావింపనిచో నా భక్తునకు అహంకార మమకారముల బెడద శాశ్వతముగా తొలఁగదు. అవి తొలఁగిననే గాని భగవంతుఁ డాతనికి మహోన్నత స్వీయపద మీయలేఁడు. ఆ పదమిచ్చుటకు ముందీయాపద మోపక తప్పదయ్యెను.

జ్ఞానియగు వాఁడు ఆత్మగ్లానికంటె ధర్మగ్లానికి, సత్యగ్లానికి వెఱచును. బలి మూఁడడుగులు వామనునకు దానమిచ్చెను. ఆతని మనస్సు ఆత్మగ్లానియందు కాక సత్యవ్రత పరిపాలనమందే నిబంధింపఁబడి యుండెను. వామనుఁడు త్రివిక్రముఁడై భూతల మంతయు నొక్క పాదముననను, స్వర్లోక మంతయు రెండవ పాదమునను ఆక్రమించెను. బలిచక్రవర్తి యాక్రమించిన సమస్తము నాతఁడు రెండడుగులతో నాక్రమించి మూఁడవ పాదమునకు నెలవు చూపుమని కోరెను. అప్పుడైనను బలి తన వలన కాదని వామను తిరస్కరింపవచ్చును. ఆడిన మాట తప్పుట పాడిగాదని నిరయ హేతువని యెఱింగి బలి యా పాదము తన మస్తకమున నుంచుమని వామను నర్థించెను.

"నిరయమునకుఁ బ్రాప్తనిగ్రహంబునకును
బదవిహీనతకును బంధమునకు
నర్థభంగమునకు నఖిలదుఃఖమునకు
వెఱవ దేవ! కొంక వెఱచినట్లు" (ఆం. మ. భాగ. 8-642)

మనస్సు సూనృత వాక్యమందే లగ్నమై యుండెను. సత్యమును పాలించుట కేయాపద కైనను సంసిద్ధుఁడయ్యెను. బలి తన సమస్తసంపదలు కోల్పోయి ఁడై బద్ధుఁడై కూడ స్వీయమగు మనోనైర్మల్యము, కారుణ్యము, సత్యవ్రత నము దప్పక శ్రీహరి మెప్పు వడసెను. తన సద్గుణములచే భగవంతుని మను కూడ జయించి యాతనికి ప్రీతిపాత్రుఁడయ్యెను. తాను పాతాళలో సత్యము వహించి యెల్లవేళల శ్రీహరి సామీప్యమందును, సంరక్షణమందును ము గడిపెను. శ్రీహరి సామీప్యము, సంరక్షణముఁ బొందఁగల్గిన్న భక్తిసత్త ము బలి చక్రవర్తి యొక్కఁడే.

తరువాతి భక్త్యంగము సంకీర్తనము. ప్రహ్లాదుఁడు నిరంతర హరినామ ర్తనముచే తరించిన మహనీయుఁడు. తండ్రియగు హిరణ్యకశిపుఁడు వారించి భయంకరముగా శిక్షించినను కూడ లెక్కసేయక యాబాలుఁడు నామ సంకీర్తన ే హరికరుణపడసి కృతార్థుఁడయ్యెను. ఆతఁడు సంకీర్తనచేతనే విష్ణుమూర్తిని ర్తిని గావించుకొనెను. శ్రీహరి నృసింహమూర్తియై యావిర్భవించి హిరణ్య ని సంహరించెను. పిదప రక్షోవీరులందఱిని సంహరించి చిందరవందర ంచెను. ప్రళయకాలానలజ్వాలవలె విజృంభించెను. దుష్టశిక్షణము గావించిన కూడ నాతని భయంకర విజృంభణము శాంతింప లేదు. ఆతని శాంతింపఁ టకై బ్రహ్మాది దేవతలేతెంచి వేదోక్త ప్రస్తుతించిరి. లాభము లేకపోయెను. ఇందిరాదేవిని పిలిచి నృసింహమూర్తిని శాంతింపఁజేయుమని కోరిరి. ఆమె తటపటాయించెనేగాని ముందడుగు పైఁడి యొకమాట కూడ నాడలేకపోయెను. హరి శాంతించిన పిమ్మటనే సమీపింతునని యూరకుండెను. అపుడు బ్రహ్మదేవుని శనముచే ప్రహ్లాదుఁడు ముకుళిత కరకములుఁడై వినయవివేకభూషితుఁడై నర ంహదేవుని సన్నిధి కేఁగి సాష్టాంగప్రణామము మాచరించి ప్రశస్తమగు నాతని హస్త శచే పులకితగాత్రుఁడై యాతని స్తోత్రము గావించి యాతని కృపను పొందఁ గల్గెను.

గోపికలు కూడ నామసంకీర్తనముచేతనే చరితార్థలైరి. వారు గోపాల బాలునియందు పరులుగాని తమ సమస్తమును విసర్జించి యాతని సంకీర్తనము గావించి తరించిరి. వారికి పిల్లపాపలు గలరు. భర్తలు గలరు. అత్తమామలు గలరు. వారి చుట్టరికపు తగులాటము, వారి యడుపొజ్జలు కూడ నిస్సంశయముగా విసర్జించి స్వీయచిత్తచోరుడైన గోపకుమారునితో చేరి యాట లాడుచు, పాటలు పాడుచు రాసక్రీడాయత్తమానసలై తదేక సంకీర్తనము గావించిరి.

నారదభగవానుడు నామసంకీర్తనముచేతనే కృతార్థుడైన దేవముని. బ్రహ్మమానసపుత్రుడగు నీతడు సర్వకాలం సర్వావస్థలయందును మహనీయమహతీ వాదనా నైపుణ్యముతో నగణ్యమైభవుడగు నారాయణుని కీర్తించు చుండును. విష్ణు భక్తులం దగ్రగామి యగు నితడు భక్తిసూత్రములను నిబంధించి భక్తులెల్లరికి ప్రాతః స్మరణీయుడయ్యెను. ఈతని సూచన మేరకే వ్యాసభగవానుడు భాగవత పురాణనిర్మాణబుద్ధి యయ్యెను.

భక్త్యంగములందు చింతన మాఖరి మెట్టు. సత్యమాదిగా వెలింగెడు నెనిమిదియంగములు కూడ చింతనమందే పర్యవసించి దీనితోడనే భక్తునకు భగవంతు నకు గల సంబంధము అవిభాజ్యము గావించెను. రుక్మిణీదేవి నిరంతరమగు హరి చింతనముచే పలువంతలు గడచి యాతని చేపట్టి తరింపగల్గెను. రుక్మిణి విదర్భా ధీశ్వరుడగు భీష్మకుని కుమార్తె, ఆ రాకుమారి వినుకలివలన వలవంత దగిలి కృష్ణుని పతిగా దలంచెను. బంధుగు లందఱు నామెను కృష్ణున కిత్తుమని తలచిరి. కాని రుక్మిణి యన్నయగు రుక్మి వెన్నుని శౌరి పగబూని యా కన్నియను శిశుపాలున కిత్తునని నిర్ణయించెను. దుండగుడగు రుక్మి నా ప్రయత్నమునుండి యెవ్వరును వారింపలేకపోయిరి. రుక్మిణి శ్రీహరి కడకొక బ్రాహ్మణుని ద్వారా సందేశమును పుత్తెంచెను. ఆతడు ద్వారకా నగరమున కేగి కృష్ణుని కాంచి సందేశము నిట్లు విన్నవించెను —

సీ. "ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోక దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ లేప్రొద్దు చేసిన భువనోన్నతత్వంబుఁ బొంద గలుగు
నే నీ లసన్నామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీ యందు నాచిత్త మనవరతము
నచ్చి యున్నది నీ యాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!
శ్రీయుతాకార! మానినీ చిత్తచోర!"
(ఆం. మ. భాగ. 10 పూర్వ. 1701)

ఇది ప్రియురాలు ప్రియునకు పంపిన లేఖ సారాంశము. ఇందు ప్రేమ ప్రసక్తికంటె సంసారతాపత్రయవిరక్తియే మెండుగా నున్నది. రుక్మిణీదేవి నిరంతర చింతనముచే బంధసంతతుల చింత లుడిగి భక్త్యావేశ పరిపాకమును వ్యక్తీకరణ మొనర్చినది. ఇందు కేవల మగు శృంగారముకంటె భక్తియే వేయిమడుంగు లధికముగా ద్యోతమానమగుచున్నది. పెండ్లి కావలసిన పిల్లకు భవబంధసంతతులఁ గూర్చిన చింతతో పలవంతకు పొంతన కుదరదు గదా! ఆమె చేయు ప్రయత్న మంతయు వివాహబంధముకొఱకే గాని సంసారబంధమోచనముకొఱకు కాదు. అయినను ఆమె మనఃస్థితి ఆ ప్రేమికుల పరిస్థితి కూడ అతిలోక సామాన్యమైనది. అతఁడు మానవ జన్మ మంగీకరించిన శ్రీహరి. ఆమె పిదర్భయం దుద్భవించిన శ్రీదేవి. అందు చేతనే రుక్మిణి కృష్ణునకు తన్ను కైంకర్యము గావింపుకొని తన్నాతని సొమ్ముగా భావించినది.

మ. "ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై గౌరీశు మర్యాద నె
వ్వని పాదాంబుజ తోయమందు మునుఁగన్ వాంఛింతురే నట్టినీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱు జన్మంబులన్
నినుఁ జింతింపుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా!"
(ఆం. మ. భాగ. 10 పూర్వ. 1707

కన్యగా రుక్మిణి కోరుకొన్నది తమోనివృత్తి. దానికై శంకరాదులగు మహాత్ములు కూడ శ్రీహరి పాదాంబుజతోయములందుఁ గ్రుంకులిడగోరుదురు గంగాదేవి విష్ణుమూర్తి పాదము నొద్ద నుద్భవిల్లినది. ఆమెను శంకరుఁ డుత్తమాంగమున వహించెను. అంతటి పురుషోత్తముని కరుణ తనకు కలుగునో కలుగదో దయకలిగినచో సరేసరి. కలుగనిచో భగవంతుని చింతించుట అనువ్రతముతో

నూఱుజన్మములైనను ప్రాణములు వీడుచు ప్రాణేశ్వరుఁ డగు నాతని కరుణఁ జూఱ గొందునని శపథము గావించెను. ప్రాణములలో పురుషుని ప్రాణములు స్త్రీ ప్రాణములని వింగడించుటకు వీలులేదు. ఈలోకమందలి సమస్తప్రాణములు కూడ స్త్రీలే. ఆ ప్రాణములకు ప్రాణపతియగు భగవంతుఁ డొక్కఁడే పురుషుఁడు. అతఁడే పురుషోత్తముఁడు. ఈరహస్యము నెఱిఁగియే ఆమె 'ప్రాణేశ్వరా' అని సంబోధించినది ఈ "ప్రాణేశ్వరా" అను సంబుద్ధి మనము సాహిత్యములో సామాన్యముగా తిలకించునది కాదు. సమస్త ప్రాణులకు ఈశ్వరుఁడైన పురుషోత్తముని గుఱించి గావించినది.

సీ. "ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ! నీవు భోగింపఁగాలేని తనులతవలని సౌందర్య మేల
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని చక్షురింద్రియముల సత్త్వమేల
దయిత! నీయధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల

ఆ. నీరజాతనయన! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని జన్మములకు".

(ఆం. మ. భాగ. 10-1-1708)

దేహికి ఐదు కర్మేంద్రియములుండును. అవి వాక్పాణిపాదపాయూపస్థలు. వీని ఐదింటికంటె ఎక్కువ బలముతో నైదు జ్ఞానేంద్రియములు పనిచేయుచుండును. అవి త్వక్కు, చక్షుస్సు, జిహ్వా, ఘ్రాణము, శ్రోత్రము. ఈ కర్మేంద్రియములకు జ్ఞానేంద్రియములకు నాయకునివలె మనస్సు లేక బుద్ధి లేక అహంకారము పనిచేయుచుండును. పై సీస మందు రుక్మిణీదేవియు తన జ్ఞానేంద్రియములతో భగవత్సేవ గావింపుచు దాస్యభక్తిచే అనుచింతనము గావింపుచుండెను. జ్ఞానేంద్రియములు ఎక్కువ బలము గలవి. అవి ఐదును బలమైన గుఱ్ఱముల వంటివి. ఆ గుఱ్ఱములను నడిపించునది మనస్సు. మన స్సా గుఱ్ఱములకంటె ఎక్కువ బలమైనది. మనస్సుకంటె బుద్ధి మిక్కిలిబలమైనది. ఇవన్నియు ఏకోన్ముఖముగా ప్రయాణము సాగించిన నాఁడే భగవంతుని కృపకు పాత్రుఁడై ఆతనిని చేరుకొనఁగలఁడు.

శ్లో. "జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వన్ద్వ సమర్చ యాచ్యుత కథా శ్శ్రోత్రద్వయ త్వం శృణు
కృష్ణం లోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకున్దపాదతులసీం మూర్ధ న్నమాధోక్షజమ్."

(ముకుందమాల 16)

పై శ్లోకములో నమ్మాళ్వారులు (కులశేఖర మహారాజు) జ్ఞానేంద్రియములను బుజ్జగించుచు విష్ణుసేవారతులు కండని బుద్ధి గరపుచున్నాడు. జ్ఞానేంద్రియములలో జిహ్వామిక్కిలి చపలమైనదని సూచించుచు ముందుగా జిహ్వనే సంబోధించుచు కేశవుని కీర్తింపుమని బోధించినాడు. నాల్కకు మాటలాడుట, రుచిచూచుట అను రెండు ప్రయోజనములు గలవు. అందు కులశేఖరులు మాటలాడుటను తీసికొనినారు. రుక్మిణీదేవి అట్లుగాక రుచి చూచుటను తీసికొని కృష్ణుని అధరామృత మానవలెనని తనకోర్కె నెఱిఁగించుట మిక్కిలి సమంజసముగా నున్నది. అనె మాటలలో జ్ఞానేంద్రియముల సమాహారము మనస్సుతో కలిసి కృష్ణసేవాభిముఖముగ పయనించుట చింతనమునకు పరకాష్ఠయై యొప్పుచున్నది.

హరి కరుణించునో లేదోయను వలవంత, హరిమీది ప్రేముడి విడవాడఁ జాలక నిరంతరముగు చింతన, నందనందను మీఁది వలపు అతఁడు వచ్చునో రాఁడో అనుతలపు-ఈ యాలోచనల వీచికలలో రుక్మిణీదేవి తలమునకలుగ మునిఁగి తేలెను. ఈ తల్లడపాటంతయు చింతనము లోనికే వచ్చును. పరిపక్వమైన భక్తి అనుచింత నముగా పరిణమించి జ్ఞానముగా పర్యవసించును. భక్తులు ఈ జ్ఞాన దీపముచేతనే భగవంతుని చూడగల్గుచున్నారు. రుక్మిణి కూడ కృష్ణుని చూడఁగల్గెను. రుక్మిణి చూచుటలో ఇతర భక్తులు చూచుటలో కంటె ఒక వైలక్షణ్యమున్నది. అది ఏమో పరిశీలింతము.

మ. "కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘ సంకాశ దే
హు నగారాతి గజేంద్రహస్త నిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘన భూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్."

(ఆం. మ. భాగ. 10 పూర్వ. 1747)

రుక్మిణీదేవి ముద్దరాలు. ఆమె రెప్పలార్పని చూపులతో కృష్ణుని చూడ లేదు. కృష్ణుని వాస్తవమగు రూపము వేయిసూర్యులకంటె ఎక్కువ తీక్షణమై దుర్నిరీక్ష్యమైనది. అట్టి రూపమును తదేక నిష్ఠతో చూడగల చేవ ముద్దరాలగు రుక్మిణీదేవికి లేదు. సర్వాంగసుందరమగు ఆ మూర్తిని దర్శించుచు, వెనుకకు మరలుచు మరల దర్శించుచు రుక్మిణి తన సిగ్గును ప్రకటము గావించుకొనెను. మఱియు నామె శ్రీకృష్ణుని దర్శించునపుడు పైనొక అంగము క్రిందనొక అంగము మఱల పైనొక అంగము క్రిందనొక అంగము ఈవిధముగా విషమపరిశీలనము గావించెను. చివర కామె చూపులు కలయఁదిరిగి సమగ్రపరిశీలనము గావించెను. ఈపద్యమందు బాహిరముగా వర్ణించినది శ్రీకృష్ణుని మూర్తిని కాని అంతరముగా ప్రదర్శించినది భక్తురాలగు రుక్మిణి మూర్తిని. ఇదియే చమత్కారము.



# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 8. పోతన చిత్రించిన భక్తులు

### 1. బాలభక్తుఁడు-ప్రహ్లాదుఁడు

భాగవత గ్రంథములో పోతనామాత్యుఁడు

"తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్ముండు హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!"
( ఆం. మ. భా. 7-167 )

అను ఈ తొమ్మిది భక్తి మార్గములను ప్రపంచించి తన్మార్గముల ఉదాహరణ ప్రాయముగా ఆయా భక్తశిఖామణులను వర్ణించి యున్నాఁడు. వానిలో సంకీర్తన భక్తికి బాలభక్తుఁడగు ప్రహ్లాదుని స్వీకరించి ఆతని అతిసౌకుమార్యవయోలాలిత్యమును భక్తి మకరందనిష్యందములో మెదిపి సారస్వతపిపాసువులకు రసాయనముగా అందించి నాఁడు.

ప్రహ్లాదుఁడు పంచవర్షవయస్కుఁడు. బాలుఁడు. అంతన కానిలేఁడు. కాని వాని జన్మాంతరాయాతమహనీయభక్తివాసనావైశిష్ట్యము మాత్రము వర్ణనాతీతము. నిరంతరముకుందచరణారవిందవరివస్యాపాటవుఁడై తినుట, త్రాగుట, చూచుట, వినుట, చనుట, మాటాడుట మొదలగు సకలజీవవ్యాపారసరణులు హరి పరముగనే

కావించుచు వేదవేదాంగాది సకలశాస్త్రసారభూతమైన తురీయపురుషార్థమును తాను మూర్తీభూత మొనర్చి జగత్తునకు ప్రదర్శించెను. తానన్నది ఏమియు లేదనియు తానొక చక్కెరబొమ్మ వంటి వాఁడు కాగా సకలజగన్నిర్మాణసంరక్షణనిర్మూలన పరాయణుఁడగు నారాయణుఁడు పయఃపారావారమై తా నా పయోధి గాంభీర్యమును కొలుచుటకు ప్రయత్నించి అందుఁజొరబడి తనకింక కర్తవ్యాంతరనిష్ఠాపరిజ్ఞానలేశము లేక అందేకమై తన అస్తిత్వమును గోల్పోయి కేవలము పరబ్రహ్మముగనే శేషించుట ప్రహ్లాద గాథ యందలి పరమార్థము దీనికి సోపానము నిరంతర హరినామ సంకీర్తనము. విషయోన్ముఖముగా ప్రసరించు నింద్రియ వ్యాపారములన్నింటిని పరమేశ్వరోన్ముఖముగా ప్రసరింపఁ జేయుటను అసిధారావ్రతముగా నభ్యసించుట యిందులకు శాస్త్రనిర్దిష్టమైన మార్గము.

అయస్కాంతము సమీపించినంతనే ఇనుము స్వీయవ్యక్తిత్వమును గోల్పోయి దానిచే నాకృష్టమై తదైక్యభావమును భజించుట వలెనే భక్తుఁడు నిరంతరభగవదారాధన వ్యాపారపరవశత్వమును అభ్యసించినచో అతని హృదయము లోహశకలమై భగవంతుఁడనెడి అయస్కాంతముచేత ఆకర్షింపఁబడి తదైక్య సిద్ధిని పొందుననని ప్రహ్లాదుఁడు నిరూపించెను. ఈ భక్తి వైభవమును ప్రతిపద రసోచంచితముగా నిర్వహించుటలో పోతనామాత్యుఁడు కృతకృత్యుఁడై సారస్వతేయుల నిత్య ప్రశంసలకు పాత్రుఁడగుట ఆంధ్రుల అదృష్టము.

## 2. బాలభక్తుఁడు - ధ్రువుఁడు :

"జాతః కూర్మః స ఏకః పృథుభువన భరాయార్పితం తేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్వి చక్రమ్
సంజాత వ్యర్థ పక్షాః పరహిత కరణే నోపరిష్టాన్న చాధో
బ్రహ్మాండోదుమ్బరాన్తర్మశకవ దపరే జన్తవో జాతనష్టాః"

(భర్తృ. సుభా. పరోపకారపద్ధతి. - 68)

అని యీ విశ్వప్రపంచమునందు అత్యున్నతస్థాన మలంకరించి గ్రహనక్షత్రతారా

మండలము నంతను పశువుల వలె తన చుట్టును త్రిప్పుకొనుచున్న ధన్యజన్ముఁడగు ధ్రువుఁడు బాలభక్తులలో ప్రహ్లాదాదుల సరసన నుండదగిన మహనీయుఁడు. ప్రహ్లాదుని వలె ఇతఁడును పంచాబ్దపరిమిత వయస్కుఁడు. మహారాజగు నుత్తాన పాదుని పట్టమహిషియందు జన్మించినాఁడు. సామ్రాజ్యపట్టాభిషిక్తుఁ డగుట కర్హుఁడై యుండియు కామాంధకారముచే కన్నులు మూసికొని పోయిన చక్రవర్తి దయకు పాత్రురాలగు సురుచి కౌటిల్యముచే వంచితుఁడైనాఁడు. తన సపత్నీసోదరుఁడగు ఉత్తముని వలె తానును తండ్రి యొడి నధిష్ఠింప నుబలాటపడినాఁడు. హృదయ విదారకముగా నత్యంతనికృష్టవాగ్బాణములచే విద్ధమనస్కుఁడైనాఁడు. పరమదారుణ పరాభవానలజ్వాలాభస్మీకృతస్వాంతుఁడై తనకీ భూమండలము మీద ఆదరమను పదార్థము లేదని నిశ్చయించుకొనినాఁడు. పరమదురహంకారపాశబద్ధచేతస్కయగు సురుచిచేతనే తండ్రి యెదుటనే ప్రాపింపగా దంపబడిన హతకరుణాకటాక్షమునకై తపస్సమాధి నిమగ్నుఁడవై తద్వరప్రసాదముచే నాకడుపున నుద్భవించి అప్పుడు నీ మనోరథము నెరవేర్చుకొను మని హేలగా, హేళనగా, హేరాళముగా చేసిన ధిక్కారతిరస్కారచీత్కారములకు వగచినాఁడు. కన్నతల్లియగు సునీతి చూపు నిష్ఫలప్రేమ తనమనోరథమును సఫలీకృతము కావింపలేదని నిశ్చయించుకొనినాఁడు. పరిహాసమునకైనను, పరిభావమునకైనను సవతి తల్లి నిర్దేశించిన తపోదీక్ష నవలంబించుటయే తన సమస్యకు పరిష్కార మార్గ మాదేశింపగలదని నిర్ణయించుకొనినాఁడు. తపోదీక్షావలంబనములో ఎదురుకాగల సమస్యలను గూర్చిన సాధక బాధకములను గూర్చి సంకల్ప వికల్పములు చేసికొనుచు కాలయాపన మొనర్పలేదు. హరిభక్తి బీజము హృదయక్షేత్రమున నాటుకొన్నదే మొదలుగా అది పెరిగి పెద్దదై అందించిన ఫలము నాస్వాదించుట ఎప్పుడా ఎప్పుడా అని అశాంతరంగముతో నదవదయైనాఁడు. మర్యాదకు తల్లి కీ విషయము నివెదించి తదాశీర్వచనమే ఊతకోలగా గ్రహించినాఁడు. భావి కష్టనష్టములనుగాని, ఫలాఫలములనుగాని, సాధ్యాసాధ్యములనుగాని చింతింప లేదు. హరి చరణారవింద సంలగ్నమనోద్విరేఫుఁడై అడవి కేగుచుండెను. అహా పురాకృతవాసనాబలసముత్కర్ష మెంత దుర్ధర్షమైనదో కదా !

తానంతపఁటకు చక్రవర్తి తనూజుఁడననియు, భావిసామ్రాజ్యపరిపాలనా వసరము తన భుజస్కంధములపైననే మోపఁగలరనియు భావించినాఁడు. తాత్కా-

సంతుష్టనిజాంతరంగుఁడగు నా బ్రహ్మమానసపుత్త్రుఁడు తదచంచలనిశ్చయావేశమునకు, నిర్మలభక్తివైభవమునకు, భగవత్ప్రసాదపాత్రీభవన శ్రద్ధావేశమునకును ముగ్ధుఁడై హస్తమస్తకసంయోగపూర్వకముగా నాబాలకుని భవిష్యద్భక్తియాత్రకు మార్గము సిద్ధపరచి యమునాతోయావగాహనపూర్వకముగా మధువనప్రవేశ మొనర్ప నాదేశించి మధుసూదన నామాంకితమగు శ్రీమదష్టాక్షరీమహామంత్రపునశ్చరణనైరంతర్యముచే నారాయణాంతర్యామును వశీకరింపఁగొను భద్రమార్గమర్మ ముపదేశించి, ఆ మహామంత్రము నయోచితముగా ననుగ్రహించి తత్సాధనపద్ధతిని నిర్దేశించి నిర్గమించెను. "గచ్ఛన్తి పుణ్యాని పురాకృతాని" (భర్తృ 99) అను సూక్తికి లక్ష్యభూతుఁడగు ధ్రువుఁడిట్లు దానంతటఁదాను నేమి చేయవలెనో యెరుగకపోవు నవస్థనుండి తేరుకొని ఏమి చేయవలెనో ఎట్లు చేయవలెనో తెలిసికొను నవస్థకు చేరుకొనెను.

ఇట్లాతఁడు అఖండితభక్తినిధానుఁడై, పరమభాగవతశిఖామణియై నిరంతర జగత్కల్యాణకార్యకలాప నిమగ్నమతియై, జ్ఞానశక్త్యవతారమై, ఆశానిరాశాబహిర్భూతుఁడై, భక్తిసాధనాప్రకారప్రచారకళానిష్ణాతుఁడైనాఁడు. అనుకొనకుండ మార్గమధ్యమున దారసిల్లిన నారదభట్టారకుని అమూల్యమహోపదేశసుధాసారమును సముచితముగా జీర్ణింపఁజేసికొన్న ధ్రువుని మనస్సును పొరపాటున నేనియు సంసారభోగలాంపట్యాదికిఁగా ప్రసరింపనీర ఆ వయస్సులో నూహించుటకేనియు నలవికాని విధముగా ఏకాదశేంద్రియ నిగ్రహపూర్వకముగా భగవదారాధనపరిపాటీనిబద్ధుఁడైనాఁడు. [illegible] సుపర్వాఖర్వాకారమై పరమపవిత్రయోజనముగా అక్షుద్రదీక్షాదక్షుఁడై సాధనాపథమున పురోగమింపఁదొడంగెను. "శ్రేయాంసి బహువిఘ్నాని", అను సూక్తి [illegible] రీతిని ఆ బాలభక్తుని అచంచలతపోదీక్షావైచక్షణ్యమునకు మహేంద్రాది పతిపక్షులచేత నిక్షేపింపఁబడిన విక్షేపములు అసంఖ్యాకములుగా తటస్థించినవి. రంభాద్యప్సరోనృత్యగాన కళాప్రావీణ్యమునకు ఆకర్షితుఁడు కాలేదు. పుష్కలావర్తకాది జీమూతపఙ్క్తి[illegible]కంటకపాషాణాంగారాదివర్షప్రదములచే భయభ్రాంతుఁడు కాలేదు. మహేంద్రప్రహితభూతప్రేతపిశాచయక్షరాక్షస[illegible]కోట్యసహ్యారావముల వికృతప్రవర్తనములకు వెఱపు చెందలేదు. ఏకదీక్షతో తపోనిశ్చలసమాధినియమితబాహ్యాభ్యంతరప్రవృత్తియై స్థాణువువలె మేరుగిరీంద్రము చందమున, హిమవన్నగము పగిది కలహాప్రాప్తకమలాసనసంభవుల నడుమ నావిర్భ

వించిన జ్యోతిర్మయస్తంభమువలె అవిచలితప్రచండనిశ్చయాభిరాముండై నిలిచినాఁడు. అతఁడు లోకోత్తరధ్యానప్రపంచనిర్మాతయై తేజరిల్లుటగని తమ ప్రయత్నము లేవియు ప్రత్యూహవ్యూహనిర్మితికి సమములు కావని యెఱింగి ఇంద్రాదిదేవతలు కమలసంభవ పురస్సరులై కమలనాభదివ్యదర్శనమునొంది తమ గోడు వెళ్ళబోసికొనిరి. ఆతని కెవరి పదవిపైన నభిలాషలేదు సరికదా ఆతఁడింత వఱకు నవలంబించిన తపశ్చర్యా తీవ్రతచే నార్జించుకొన్న యోగ్యతకు సమకూర్పదగిన స్థానమే లేకపోయినది. ఇఁక నతని కొఱకు నూతనస్థానమును సృష్టింప వలసి యున్నది సుమాయని ఓదార్చి వారిని పంపివైచి శ్రీమన్నారాయణభగవానుఁడు మధువనమున కరిగినాఁడు. తపోలక్ష్మీమూర్తస్ఫూర్తియగు తాను సాక్షాత్కరించినను సవికల్పముకాని సమాధి నభ్యసించిన ధ్రువుని నిజకరవిందద్వికచారవిందపత్రస్పర్శమాత్రముచే ప్రబోధించి నాఁడు. బహిరుద్గతప్రజ్ఞాప్రపంచుఁడగు ధ్రువుఁడు చిరశ్రమోపార్జితహరిసాక్షాత్కార విభవప్రసన్నమతియై అనధిగతవేదవిద్యుఁడైనను వేదమయుఁడగు విష్ణుభగవానుని దివ్యసంస్పర్శనప్రాప్తి తేజరిల్లినంతనే వ్యాఖ్యానపద్మవేదవిద్యావినీతుఁడైన వాని పోల్కి సకలోపనిషత్సారమూలమగు స్తవరాజముచే నారసని మెప్పించినాఁడు. అతనిచే గ్రహనక్షత్రతారాసహితవిపులభచక్రమునకు ఊర్ధ్వముఖముగా కేంద్రస్థానీయమై ఆ జ్యోతిర్మండలమునెల్ల సముచిత పరిధిలో ఆకర్షణవికర్షణ ప్రక్రియల కగ్గము చేయుచు దృశ్యమానసమస్తవిశ్వనాటకప్రయోగమునకు తానొక ప్రయోక్తగా నియమియుఁడయ్యెను. కాని అది తత్క్షణమే అనుభవములోనికి వచ్చు ఫలము మాత్రము కాక పోయినది. తాను తొలుత లౌకికమైన పితృకసమాకారతిమాత్రమునే ఉద్దేశించుటచే లౌకికరాజ్యాధికారనిర్వహణవ్యవసాయము కొంత కాలము పాటు మీఁదవేసి కొనక తప్పదని ఆదిష్టుఁడై ఆవిష్ణువుచే ఖేదమోదాతీతమగు నౌక మహోన్నతస్థితిని వరముగా బడసి విజయలక్ష్మీకరగ్రహణవిద్యాలాభశోభితుఁడై నిజపత్తనప్రవేశ మొనర్చెను.

అది మొదలు ధ్రువుఁడు చిరకాలము కావించిన రాజ్యపరిపాలనములో చతుర్విధపురుషార్థములు రూపుగొన్నవై అహమహమికతో తదాజ్ఞాపరిపాలనమునకై ముందుకు చూసికొనివచ్చినవి. సిద్ధించిన అనుపమ సుఖశాంతిమయమహోదాత్త జీవన భాగ్యాతిరేకముతో ప్రజాబాహుళ్యము సర్వతృప్తమై నిరుపమలౌకికానందనిధానమైనది.

ధ్రువ పరిపాలనమే తనకు ధ్రువము కావలెనని లోక మంతయు లోచనస్రవత్ప్రహర్ష బాష్పసిక్తకపోలమై ఆరాటపడినది. తపోదీక్షావసరమున విఘ్నప్రకల్పనమున కుపక్రమించిన మఘవాదిగీర్వాణవల్లభులు కూడ తమ వల్లభుడు ధ్రువుడేయని పల్లమాలిన ప్రేమాభిమానములతో నాతనిని పరివేష్టించి యుండిరి. ఇది యంతయు నొక యెత్తు. మృగయార్థమై హిమగిర్యుపత్యకాప్రాంతమున కరిగిన సపత్ని సోదరుడగు నుత్తముడు గుహ్యకప్రయుక్తనారాచవిద్ధహృదయుడై మరణించినాడు. తద్విషాదవార్తాశ్రవణమాత్రప్రాప్తవైరాగ్యవాసనావినివేశితచిత్తయై తన్మాతృమూర్తి యగు సురుచి తత్కళేబరాన్వేషణార్థమై తత్ప్రాంతమునకే పయనించి దవాగ్నిదగ్ధయై పరలోకగతురాలైనది. వికలమనస్కత నా ధ్రువుడు బద్ధపరికరుడై యుద్ధమునకు సిద్ధపడి యక్షగుహ్యకలోకమును వికలప్రవికల మొనర్చుటతో సాక్షాత్కరించిన స్వాయంభువమనుమహారాజు కావించిన జ్ఞానబోధచే ప్రవిమలస్వాంతుడైనాడు. ఇవి అంతయు పరిగణింపగా సిద్ధించిన పరమపావనధ్రువాఖ్యానవిశేషము మోక్ష పురుషార్థబహుళమై భువనభవనదీపకళికాయమాన మయ్యెనని తోచును.

## 2 (ఎ) శాంత భక్తి - కుంతి :

మానవుడు ఇంద్రియోన్ముఖుడై ప్రాపంచికవ్యాపార పారాయణుడుగా ఉన్నంతవరకు అతనికి ఉద్వేగము తప్పదు. ప్రవృత్తిమార్గములో ఎంతటి నిగ్రహ సంపన్నునకును ఆగ్రహానుగ్రహడోలాయితస్వాంతముతో ఎవరియందో విగ్రహము నకు దిగవలసి వచ్చునదే యుండును. శాంతి అనునది లౌకికజీవనములో గగన కుసుమప్రాయము. నిరంతరము అశాంతిమయజీవనము సాగించుచు రవశాంతి ఘట్టముల రెంటినడిమి సూక్ష్మవిరామమును శాంతిగా భ్రమించుచుండును.

నిజముగ శాంతి మానవుని నిత్యమహాశలకగ్గమైన అక్షయపుమరంతసంసరణ గహ్వరమధ్యము నందు ఎంతగా వెతకినను కానరాదు. ఈ ప్రవృత్తి మార్గము నుండి విరమించి ఇంద్రియానందమహోద్వేగమునకు హేతుభూతమగు ఆశావలయమును ఛేదించి సంతతభగవన్నామసంకీర్తనసుధాసాగరములో తేలియాడుచు జన్మజన్మాంతరా యాతసర్వపాపపంకిలవాసనావిసరమును విసపిస విసరివైచి మరల లౌకికకర్మ

సంగ్రహదశకు రాకున్నప్పుడే శాంతియనునది సంభవించును. బాహ్య ప్రపం వ్యవహారములతో అడుగడుగున ఇడుములు గుడుచుచు క్షణక్షణపరాజయపరివేదన దోదూయమానమానసుడై ఒకప్రక్క తపించుచునే దానిపట్ల వైముఖ్యము గొనుటకు మాఱు వేరొక ప్రక్క అంతకన్న అశాంతినిశాంతమైన కర్మసంకటములను తలకె చుట్టుకొని అదే ప్రశాంతివిశేషమని తలంచు భ్రమజీవనము నుండియు నిష్ఫలమగు శ్రమజీవనము నుండియు అశ్రాంతమగు విశ్రాంతి గైకొని ప్రమజీవనములో అడ గిడుట ప్రారంభించినప్పుడు గాని శాంతిఘటిల్లదు.

కుంతి పసితనములో దుర్వాసునకు సేవ చేయుటకై తండ్రిచే నియుక్తయై తన్మహర్షిదత్త వరపరీక్షణవ్యాజసమాహూతభాస్కరసంప్రదత్త సంతానభాగ్యయగు నభాగ్యక్షణము మొదలుకొని అడుగడుగున నామె పడని నికృష్టమగు కష్టములేదు యౌవనములో పాండురాజు ధర్మపత్ని యగుట మాద్రీరూపమున సపత్నీసాహిత్యమ నకు నోచుకొనుట చిరసాంసారిక జీవితానంతరము కూడ అనపత్యురాలుగనే యుండి పోవుట పొంగిపొరలు యౌవనోద్వేగములో దారస్పర్శకు దూరమగు కిందమశాపమ నకు భర్త గురియగుట అటనుండి రాజ్యభోగపరిత్యాగపూర్వకముగ శతశృంగపర్వత పత్యకానివాసము నంగీకరించుట, భర్తృప్రేరితయై ధర్మాదిలింపత్రయసంప్ర జన్యమయిన గర్భధారణమునకు ఫలముగా ముగ్గురు బిడ్డలను గని వారి ముద్దుముచ్చ టలు తీరకముందే వైధవ్యమునకు గురియగుట, మాద్రీకృతసహగమనానంతరము తదపత్యభారనిర్వహణమును కూడ స్వీయాపత్యసంరక్షణముతోపాటు వహింపవలసి వచ్చుట తుదకెట్లో హస్తినాపురికి చేరుకొన్నది మొదలు దుర్యోధనాదిదుష్టచతుష్టయ కృతనిరంతరనికృష్టమాయోపాయదౌష్ట్యమునకు బలియగుచు సంతతానంతమహాపాయ భరితమగు దుర్జీవనము గడుపుట, లాక్షాగృహదహనము ఏకచక్రపుర భైక్షజీవనము, బకాసురవధప్రముఖభయంకరఘట్టసందర్శనము, కాంపిల్యపురప్రకటితమత్స్యయంత్ర నిక్షేపకపార్థద్రౌపదీపరికల్పితపంచపాండవపరిణయప్రసంగము, కపటద్యూతఘట్టము వనవాసము, తనకు విహితమగు త్రయోదశవర్షపరిమితరిపుస్థానసంవాసము, యుద్ధము, ఆత్మీయవియోగము ఈసమస్తదుర్ఘటనము లందును అనుస్యూతముగా జ్ఞప్తి వచ్చు కర్ణ ప్రసక్తి - ఇవి అన్నియు నామెలో సంసారము పట్ల తీవ్ర వైముఖ్యమునకు ఎన్నియో రాచబాటలు వేయగా పరమదురంతసాంసారికజీవన

సౌముఖ్యమెన్నఁడో సిద్ధించినది. కనుకనే ఆమె మట్టిలో సంచరించు కుమ్మరిపురుగు వలెను నీటిపై తేలియాడు తామరాకు వలెను దేనిని అంటక ముట్టక నిర్లిప్తముగా నుండుట అభ్యాస మొనర్చుకొన్నది. శ్రీకృష్ణుఁడు తనకు మేనల్లుఁడే అయినను తద్బాంధవజన్యమైన మమకారభావ మామెకేనాఁడును లేదు సరికదా మీఁదు మిక్కిలి అతఁడు సకలజగదాధారనిర్వహణప్రశస్తకర్మనిర్మలుఁడగు శ్రీమన్నారాయణుఁడే అనియు తత్పాదపంకజధ్యాననైరంతర్యము సాధించినచో తనకది అనిర్వచనీయమోక్ష సామ్రాజ్యభోగానుభవనైరంతర్యములో పర్యవసించి తీరునయు దృఢనిశ్చయము ఎన్నడో కలిగినది. ఈ భావనాపారవశ్యముచే నామె యలవరచుకొన్న అంతరంగ శుద్ధి ఆమె కఖండశాంతిని ప్రసాదించుటలో కృతకృత్య మయ్యెను. కృష్ణుని ఏకాంత భక్తిభావనావైవశ్యముతో

"శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!"

( ఆం. మ. భాగ. 1-199 )

అని నిశ్చలధ్యానసమాధిలో ప్రార్థించి భవలతలు త్రుంపుమనియే కోరుకొన్నది గాని ఐహికభుక్తికసౌఖ్యము గాని రాజ్యభోగాది లాంపట్యముగాని రిపునిర్దళనప్రాప్తతాత్కాలిక విజయోత్సాహముగాని - ఇట్టి దుఃఖమిశ్రితస్వల్పానందఖండముల నెన్నడు కోరుకొనదు. ఇట్లు కోరుకొనకుండుటకు కారణము ఆమె మనస్సు ప్రశాంతమగుటయే. అట్టి ప్రశాంతస్థితిలో భగవత్తత్త్వమును లెస్సఁగా నవగాహన మొనర్చుకొని లౌకికనానావిషయకతుచ్ఛపరప్రార్థనము పట్ల మనస్సును పరుగిడనీయఁగూడదని కఠిన నిశ్చయము చేసికొని తన్నుతాను సమీచీనముగా శిక్షించుకొన్న దగుటచేతనే ఆమెది అంతభక్తియై ప్రకాశించెను. ప్రారబ్ధానుసారముగా జీవితములో ననుభవింపవలసిన మోహగ్రస్తముల నెన్నింటినో అనుభవించిన తిక్తానుభూతి ఆమెలో అచంచలభక్తిజ్ఞాన వైరాగ్యదార్ఢ్యమును నిరూఢము గావించినది. అందువలన కుంతివంటి కష్ట పరంపరలకు గురియయ్యును నైశ్చల్యమును కోల్పోక చింతాసాగరమున నతిక్రమించిన

ఆ కుంతీదేవి ధన్యజీవితయై జగత్తున కంతకును సంసారవ్యసనప్రశమనసమాసాద్య స్థిరానందవైభవమును లక్ష్యముగాగొని తల్లక్ష్యసిద్ధికై పరమేశ్వరచరణారవిందనిరంతర స్మరణపరిణతి చూరగొనవలెనను శుభసందేశము నందించినది.

## 2. (బి) శాంతభక్తి - భీష్ముడు :

భీష్ముడు రాజోచితసకలశక్తిసామర్థ్యములు కలిగి అమేయ పితృభక్తి పారవశ్యముతో స్వసుఖత్యాగపూర్వకముగా రాజ్యమును, దాంపత్యధర్మమును తృణప్రాయముగా పరిత్యజించి ఎట్టి వ్యామోహమునకు లోబడక అధర్మమును నిర్జించుటకై గురుపాదుడగు భార్గవ రామునితోనే యుద్ధమొనర్చి విజయ లక్ష్మీ కటాక్షవీక్షణమునకు పాత్రుడయిన మహోదాత్తపురుషపుంగవుడు. ఆ సౌశీల సంపదకు సౌరభసమృద్ధి నాపాదించినది భక్తి. అది వాసుదేవచరణాగతిప్రేరితముగా నిత్యనిర్మలమై ఆతని హృదయకుహరము నావాసముగా చేసికొని వరిఢవిల్లెను.

భీష్ముడెంత ఉగ్రప్రతాపశోభితుడో అంత శాంతభక్తిపరాయణుడు. వేదవేదాంగాదిసకలశాస్త్రవిజ్ఞానసారవైభవ మంతయు అతనికి కరతలామలకము. ధర్మమేదో అధర్మమేదో సూక్ష్మభేదసహితముగ ఆతనికి తెలిసినట్లు సాధారణముగా నెవరికిని తెలియదని చెప్పవచ్చును. పొరపాటున కూడ అధర్మ మాచరింప రాదను నది అతని ధ్యేయము. వ్యక్తముగను అవ్యక్తముగను అవస్థాత్రయములో ఆతడాచరించు సకలకార్యకలాపములు నారాయణపరబ్రహ్మార్పణముగనే కొనసాగుచుండును. ఆతడెంత వృద్ధుడయినను అతని నెదుర్కొని నిలువరింపగల చేవ ఎట్టి యువకిశోరమునకును లేదు. వయస్సుతో పాటుగనే ఆతని బలమును పెరుగుచుండెను. ఒక్క దైహిక బలమే గాక మనోబలము, నైతికబలము, దైవబలము, ముకుంద పాదారవిందములందలి భక్తిబలము ఒకదానిని మించి ఒకటిగ అతనియందు మూర్తీభవించి యుండెను. బాల్యము నుండియు దేనిని చింతించుట జరుగునో వార్ధకము నందును అవసానము నందును తన్నిరంతరాభ్యాస బలపౌష్కల్యముచేత అదే ఉపస్థిత మగునని ఆర్యులు వచించు సూక్తిని తన ప్రవర్తనముచే ఋజువు చేయగలిగిన

అపారతపఃపరిపాకనిధి భీష్ముఁడు. కనుకనే మధ్యందినమార్తాండమండలప్రతీకా నిరుపమప్రతాపతేజోనిరవద్యుఁడై కురుసంగ్రామరంగమున అప్రతిహతముగా విజృంభించి పదిదినములు పాండవసైన్యసమూహము గుండెలలో స్రదించి తాఁజేసికొన్న నియమమునకు కట్టువడి శిఖండిముఖదర్శనపర్యవసానముగా అస్త్రసన్యాసము గావించి అంపశయ్య నవలంబించియు ధర్మమునే అంటిపెట్టుకొని ఉండి గోవిందచరణారవిందసంస్మరణప్రీతి నెమరకు ఉత్తరాయణపుణ్యకాలమునకై ప్రతీక్షించుచుండఁగా తన్నిష్టదైవము శ్రీకృష్ణభగవానుఁడు ధర్మరాజునకు తాను సకలధర్మోపదేశములఁ గావింప సమర్థుఁడై యుండియు భీష్మునిచేతనే చేయించుట యుక్తమని తలంచి ఆతనియొద్దకు సపరివారుఁడై రాఁగా ఆభీష్మపితామహుఁడు తన అవసానవేళలో కేవలము తన్ను ప్రోత్సహించుటకే భగవంతుఁడు పనిగట్టుకొని అచటకు వచ్చినట్లు భావించి ధర్మరాజునకు సకలవిధధర్మసిద్ధాంతములను విపులముగ బోధించి పిమ్మట తన ఇష్టదైవము హృషీకేశుని ముఖమునందు నిశ్చలమగు నిజదృష్టిని నిగిడ్చి అంతవఱకు ఎడతెగకుండ కొనసాగించిన ఆలాపములను కట్టిపెట్టి సకలేంద్రియవ్యాపారములఁ ఆ పరమపురుషుని మీఁదకు మళ్లించి కోరఁదగ్గ దేమియులేని అవస్థలో సకలవిధపురుషార్థఫలప్రదాతయగు ఇందిరాధినేతయందే సంపూర్ణశరణాగతి చిత్తగించి నిజహాప్రవిష్టశరపరంపరలవలనఁ గాని శరశయ్యా విశ్రమణము వలనఁ గాని ఉత్పన్నము కాఁదగు నెట్టి వేదనయు ఎఱుంగక అనంతనిరంతరశాంతిసంతోషసమాక్రాన్తాంతుఁడై శ్రీకృష్ణభగవత్స్వామిని యథార్థస్వరూపము నావిష్కరించురీతిని అఖండభక్తిసముద్రోత్థితవాక్పుష్పమకరందప్రసేకముచే గోవిందుని ముంచెత్తుచు అనంతరకాలిభక్తసత్తములకెల్లరకు పరమోపాదేయమైన భక్తిజ్ఞానవైరాగ్యమార్గమును నిర్దేశించుచు సత్పరంధాముని యందు పితృదత్తస్వచ్ఛందమరణవరపర్యవసానముగా పుణ్యాలియందు శ్రీకృష్ణపరబ్రహ్మైక్యము నొందెను.

## 3. సఖ్యభక్తి - అర్జునుఁడు :

ఇద్దరు మిత్రులు కలసి యున్నప్పుడు భౌతికముగా వారిలో నెట్టి భేదవ మున్నను అన్యోన్యప్రేమలోను పరస్పరహృదయావగాహనప్రవృత్తిలోను ఉపకారప్రత్యుపకారప్రవృత్తిమూర్వపరేచ్ఛాసముదాత్తసౌహార్దనిర్దుష్టవైఖరిలోను తుల్యత్వమే భాసి

క్షాత్ర చతుష్టయమును ప్రోత్సహించు పట్టున పక్షపాతధోరణి ప్రదర్శితము కాకపోయినను అర్జునునితో నెరపిన సంభాషణములో ఒక అపూర్వమగు నాత్మీయత అభివ్యక్తమగుట రసజ్ఞలోకమున కనుభవైకవేద్యమే. ఇట్లే రాయబారమునకై కురుసభకేగ నుద్యమించినపుడును అర్జునప్రసంగఘట్టమున విశిష్టత కానవచ్చును.

శ్రీకృష్ణుడు పాండవుల పక్షమున భీష్మద్రోణకృపాశ్వత్థామాదిమహారథాధిష్ఠితము కర్ణదుర్యోధనాదిదుష్టచతుష్టయాధిష్ఠితమునగు కౌరవసభాప్రాంగణమున ఉపాయచతుష్టయోపేతముగా ధర్మము నావిష్కరించుచు, నీచయాచనకు చేయి చాపక త కృష్ణుఁడు రథియై ఈకృష్ణుఁడు సారథియై పురోగమించునెడ రణరంగములో మమ్మెదుర్చు మొనగాఁడు నీపక్షమునందున్నచో యుద్ధమునకు సిద్ధపడుమని ప్రజ్ఞాచక్షువునకు మహోపదేశము చేసెను. ఇచ్చట అంతకుముందు అర్జునుఁడు తన్నడుగకపోయినను ఆతనికి సారథ్యము చేయుటకు తానునిశ్చయించుకొని తనఅఖిలాండకోటిబ్రహ్మాండ నాయకత్వమును కించపరచుకొనుటకు కూడ సంకోచింపని వాసుదేవుఁడు శ్వేతవాహనుని సఖ్యభక్తికి సదృశప్రయోజన సిద్ధిని సమకూర్చెను.

యుద్ధారంభమునకు కొంచెము ముందు చేసిన గీతోపదేశములో శ్రీకృష్ణుఁడు

శ్లో॥ సర్వ గుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి
తతో వక్ష్యామి తే హితమ్" [భ. గీత-18అ-64శ్లో]

"శ్లో మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యంతే
ప్రతిజానే ప్రియోఽసి మే" (భ గీత–18అ–65 శ్లో)

అని అర్జును నుద్దేశించి స్వయముగా వాచ్యము చేసి చెప్పెను. ఇది అర్జునుని సఖ్యభక్తికి శ్రీకృష్ణుఁ డిచ్చిన యోగ్యతాపత్రము. భీష్మవధఘట్టములో ఆయుధము పట్టనన్న అచ్యుతుఁడు చక్రధారి యగుట, ద్రోణవధసందర్భములో అశ్వత్థామను గూర్చిన

అప్రియవాక్కులు వక్కాణింపుమని యధిష్ఠిరునుద్బోధించుట, సైంధవవధఘట్టములో అస్తంగమిష్యమాణసూర్యభగవానునకు చక్రిమడ్డువేయుట, భగదత్తవధఘట్టములో తత్ప్రయుక్తదుర్వారమహాస్త్రసంఘాతము తప్పించుటకై రథమును కృంగదీయుట, కర్ణవధఘట్టములో భూమిలో కృంగిన స్యందనము నెత్తుకోనీయకయే తత్కృత ధర్మోపన్యాసమునకు ప్రత్యుపన్యాసమిచ్చి తన్మస్తకవిఖండనక్రియానిర్ణయమునకు పూర్ణముగా ప్రత్యర్థిని ప్రోత్సహించుట- ఇవన్నియు అర్జునునిసఖ్యభక్తివృక్షమునకు కాచిన ప్రత్యక్షఫలములు.

## సఖ్యభక్తి - కుచేలుఁడు :

కుచేలుఁడు అవంతీపుర నివాసి. "అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ హ్యవంతికాపురీ ద్వారావతీచైవ సప్తైతా మోక్షదాయికాః" అని మోక్షప్రదము లగు పురము లేడింటిలోను అవంతి యొకటి. అట్టిపురమున ముముక్షుజనమూర్ధన్యుఁడగు కుచేలుఁడు నివసించెను. అతని ప్రథమనామధేయము సుదాముఁడు. అతఁడు శ్రీకృష్ణునితో కలసి బాల్యమున సాందీపనిమహర్షియొద్ద శాస్త్రాధ్యయనము చేసెను.

ఇట్లు కుచేలుఁడు కృష్ణునకు అకరాలబాల్యసఖుఁడగుటయేగాక ఆ సహాధ్యాయిత్వమునందే ఆతని భగవత్తత్త్వమును లెస్సగా నవగాహన మొనర్చుకొని తన మనఃపీఠమున ఆతని దివ్యమంగళచిన్మూర్తిని సుప్రతిష్ఠిత మొనర్చుకొని నిరంతర తదేకధ్యాననిష్ఠానిర్నిద్రుఁడయ్యెను.

శ్రీమంతమగు కుటుంబమునకు చెందినవాఁడు కాకపోవుటచే సుదాముఁడు జీర్ణవస్త్రధారియై నాలుగు నాలని తిండికో తీరియు తీరని ఆకలి తీర్చికొనుటకు తగు శక్తి లేక కళా విశిష్టుఁడై మేధామాత్రగౌరవపాత్రుఁడై వన్నెకెక్కెను. అతని గుణశీలములకు, తెలివితేటలకు, చమత్కృసంధ్యలకు మెచ్చి కృష్ణుఁడు తరచుగా నాతని నాటపాటల కాహ్వానించుచు నతని చెలిమికి ప్రాముఖ్య మొసగుచుండెడివాఁడు. సుదాముని కుచేలత్వముగాంచి అతనికి కుచేలుఁడని సార్థకనామ మొసంగినవాఁడు కృష్ణుఁడే. ఆబాల్యావస్థనుండియు కృష్ణునిపై కాదరాభిమానములు మెండుగనే యుండె డివి. అతని దారిద్ర్యమునకు సానుభూతియొదవిన ఆర్ద్రహృదయముతో కృష్ణుఁ

కని ఎట్లైనను అనుగ్రహింపఁ దలపోసి ఆతఁడేకాంతమున నేమోతినుచుండగా లికాఁడా ఏమి తినుచుంటివి" ప్రేమతో ప్రశ్నించును దరిఁజేరిన కృష్ణునకు వేలుఁడు స్వీయదారిద్ర్య మహిమచే సంకుచితబుద్ధియై చెప్పినచో నాతనికి పెట్టవలసి ప్పునని తినుచున్నది యటుకులని దాచివైచి ఏమియు లేదనెను. అట్లే కానిమ్మని ష్ణుఁడు చిఱునవ్వు నవ్వుచు వెడలిపోయెను. జన్మాంతరకర్మవాసనా పరిలబ్ధ క్షణదారిద్ర్యపిశాచతాండవకేళిలో తాను నిర్వహింపవలసిన పాత్ర ప్రారబ్ధబలముచే రిహార్యముగా నుండ ఆ యనుభవమును సాక్షాద్భగవంతుఁడే యైనను కృష్ణుఁడు త్రమెట్లుతప్పింపగలఁడు? ఉగ్రానుగ్రహముతో గాని, యోగవిభూతిచే గాని మహా పషప్రసాదితవరప్రదానముచేగాని సంచితాగాములు నశించినట్లు ప్రారబ్ధము నశింపదు ! అందుచేతనే ఆతని నోటివెంట వచ్చిన ఆమాట ఆతనికి కంఠపాశమై ంతరప్రాప్తకుటుంబవైపుల్యము అతనికి వైక్లబ్యదాయకమై యెత్తుకొని భరింపలేక మకొనుటకు వీలులేక నెత్తిని మోపఁబడిన పెద్ద బొత్తరముగ దాపురించినది.

ఎంత మహాదారుణాస్థితానైచ్యము తన్నావరించినను చెదరక, బెదరక మగొంకులులేని ఆత్మస్థైర్యముతో కుచేలుఁడు యోగాపేక్ష లవలేశము హృదయ న తావీయక నిరంతరమురారిపాదారవిందసంలగ్నచేతస్కుఁడై హరినామసంకీర్తన నారసపానమత్తుఁడై ...కత్రివాకజూపమూరిమాతనిరాంతరంగుఁడై సంసారకా గమున అంటియు ముట్టక అందు ఈదుల నెడి జాతునతెఁ, తామరాకుపై నీటి బొట్టువలెను, బురదలో తిరుగాడు కుమ్మరి పురుగువలెను నిర్లిప్తనిర్మలనిష్కళంక ఁడై నిరామయుఁడుగను నిరంజనుఁడుగను నిర్వికారుఁడుగను నివసించెను. స్వయకు వామాక్షి అన్నపానములు లేక అలమటించు బహుసంతాన మింట నాల బాలగోలుగా విలపింపుచుండ భిక్షాటనముచే ఈడువచ్చిన మగవారెల్లరు ఆర్జించు ర్థము గగన కుసుమాయమానమై తదీయస్మరణము మరణముకన్న దారుణమగు వ్యాధను గురించు పెంపొందించునది కాఁగా ఆమహావిషాద విషధిలో మునిగితేలుచు ము నుయ్యి వెనుక గొయ్యిగా తోచు జీవనపుగోలములోపడి క్రిందు మీదులై ంగలేక క్రక్కలేక త్రొక్కట పడుచు పాపఫలముచే అనురుసువై వ్యసన పడు ను కుచేలుఁడు మాత్రము సవికార ప్రపంచ సామస్త్యమునకు సాక్షిమాత్రుఁడగు ప్రజ్ఞానిపిరె సముదంచిత ప్రజ్ఞాప్రాభవోదారుఁడై ఆదారిద్ర్యము తన్ను తాకునది

కాదనియు తాను సుఖదుఃఖములు రెంటికి అతీతుఁడనియు నిర్గుణావస్థలో నిమగ్నుఁడై యుండగలిగెను. బహుజన్మార్జితపుణ్యకర్మఫలమై ప్రాపించు సర్వంకష స్ప్రహణీయాద్భుతచిత్తప్రవృత్తిపరుఁడై చేజిక్కు తృణమునే మేరువుగా భావించుచు ద్వంద్వాతీతుఁడై జగత్తునందలి అణువణువులోను క్షణక్షణము ఈశ్వరసాక్షాత్కారభాగ్యవైభవమును మారగొనుచు బ్రహ్మానందభాగధేయుఁడై శోభిల్లెను.

కుచేలుఁడు వ్యక్తిగతముగ స్థితప్రజ్ఞుఁడే. శీతోష్ణములు, సుఖదుఃఖములు, క్షుత్పిపాసలు, జరాయౌవనములు, రోగభోగములు మున్నగు ద్వంద్వములు ఆతని దృష్టిలో భేదసహితములు కాక ఏకరూపముననే గోచరించిన గోచరింప వచ్చును. అతనికి ఈ జగత్తంతయు మాయాప్రకల్పితమై, మిధ్యాభూతమై తోపవచ్చును. కాని ఆతఁడొంటరివాఁడు కాడు కదా! ఒకవేళ ఒంటరివాఁడే అయినను అతనికి దేహేంద్రియమనోబుద్ధిప్రాణాదిసామగ్రి యున్నది కదా! దేహము వలన జరారోగములు, ఇంద్రియములవలన రాగద్వేషములు, మనస్సువలన సంకల్పవికల్పములు, బుద్ధి వలన నిశ్చయము, ప్రాణమువలన క్షుత్పిపాసలు అతనికైనను తప్పునవి కావు. వాని నాతఁడు సమదృష్టితో స్వీకరింపవచ్చును. ఆ శక్తి అందరికిని యుండదు ఆతనికి దారపుత్రాదిదీర్ఘసంసారలాంపట్యము వెన్నంటియున్నది. తాను భరించినట్లు, సహించినట్లు ఇతరులు సైరింపలేరు కదా! ఆతనికి బ్రహ్మపదార్థ మొకటియే తథ్యము. క్షుత్పిపాసాద్యఖిలజీవవ్యాపారములు మిధ్యలు. కాని ఇంటిలో నెల్లరకు బ్రహ్మము తథ్యమో మిథ్యయో తెలియదు గాని సంసారసుఖదుఃఖములు మాత్రము తథ్యములు. తన కక్కఱలేకపోయినను సంపదలు వారికి కావలెను. సంపదాపదలను సంపదలుగనే పరిగణించు యోగవిభూతి అతనికున్నది గాని అతని ఆలుబిడ్డలకు లేదు. అట్టియెడ గృహస్థాశ్రమస్థితుఁడై యున్నంతవఱకు వారి ఆలన పాలన చూడవలసిన బాధ్యత అతనికున్నదా? లేదా? తాను దైవనిష్ఠుఁడై ప్రారబ్ధానుసారముగా లభించిన దానిని భుజింతునని పౌరుషము పరిహరించి చేతులు కట్టుకొని కూర్చున్నచో అది పాపమును మూటకట్టుకొనుటయే.

"దైవం నిహత్యకురు పౌరుష మాత్మశక్త్యా" (హితో. ప్రస్తావికా – 32 శ్లో.) అని శాస్త్రములు ఘోషించు చున్నవి.

"దైవేన దేయమితి కాపురుషా వదంతి" (హితో. ప్రి. 32 శ్లో.) అని దైవపరులను కుత్సితులుగను, భీరులుగను శాస్త్రము వర్ణించినది. ఏ ఆశ్రమము నందున్నప్పుడు ఆయాశ్రమాచారములను నిష్కృష్టముగా నిర్వహింపనిచో వర్ణాశ్రమాచారవ్యవస్థ అవస్థలపాలు కాక తప్పదు.

"ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్టశాల్యోదనం
బొకచోఁ బొంత ధరించు నొకచో యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్"
(భర్తృ. సు. ఏనుగు లక్ష్మణకవి – ధైర్య – 78 ప)

అట్లట్లు ఏ సుఖదుఃఖములలో పడి కాలక్షేపము సాగించి ఆలుబిడ్డలను పోషించుట గృహస్థునకు విహితకృత్యముగాని వారిని ఆకట నకనకలాడు పొట్టలతో నడిపేదిపాలుఁ జేయుచు దినిపెంపలేక నట్టేట ముంచుట గృహస్థునకు కర్తవ్యము కాదు.

కుచేలుఁగట్టి భయంకర దారిద్ర్యమహావేశముతో పడవడ వణఁకుచుండ నటు పిల్లలు క్షుత్పిపాసాపన్నదుర్భరమహాక్రందనధ్వనులు వినలేక విలవిలలాడుచు అతని ధర్మపత్ని బాష్పాక్షి సుదీర్ఘప్రవాహాంతపసాపాంతస్వాంతయై భర్తను ప్రార్థించి బాల్యమునఁగనే అతని యుపమత్తసను అవసరకష్టములు కక్కినట్టు చెప్పి చెప్పి శ్రీకృష్ణునితో నాతనికి గల బాల్యస్నేహమును గుర్తు చేసి ద్వారకానగరమున కరుగు నట్లును, వాసుదేవుని సందర్శించి యుత్తని యనుగ్రహమునకు పాత్రుఁడగునట్లు ఒప్పించి "రిక్తహస్తేన నోపేయాద్రాజానం దైవతంగురుమ్" అను సూక్తిని స్మరించి కతిపయముష్టిప్రమాణపృథుకతండులములను పాత్రము మూటగట్టి మూపున వైచి పయనము గట్టించినది.

ఇట్లు సతిప్రోత్సాహముచే ద్వారకానగరమున కరుగుచున్న కుచేలుని మన స్సంతయు అటనుండి యేమో యాచించి తెచ్చుకొనవలెనను లౌకికప్రవృత్తికి గాక తనయిష్ట దైవమగు నందనందనుని సందర్శనముచే డెందము నానందతుందిలము గావింప కోవచ్చునను భక్తిభావసాంద్రతకే కట్టుబడి మార్గాయాసము సైచి ఎట్టకేలకు ద్వారక

కరిగి కరివరదుని సందర్శనమును కామితగా పొందెను. అఖండశ్రీసముల్లాసభాసురుఁడగు వైకుంఠవాసుఁడు ద్వారకావాసుఁడై చేరువనుండుటచే ఎట్లో యాతని చెంత కరిగిన అరుగవచ్చును గాని మూర్తీభూతసమస్తసంపదనుభూతియగు నాదేవదేవుఁడు తన్నాదరించునా? తమ బాల్య మిత్రుఁడు స్మరించునా? రాను చెప్పుకొనబోవు గోడు నాలించునా? అని ఎన్నెన్నో సందేహములతో సదమదమైన కుచేలుఁడు శ్రీకృష్ణభగవన్ముఖచంద్రమండలవ్యాప్తప్రసాదచంద్రికా పూరమును గాంచి నంతనే తన్ను తాను మరచిపోయి నిరంతరతదారాధనక్రియాసముపార్జితమహానందతుందిలమగు డెందమును ఆ ఇందిరాహృదయారవిందమిళిందునిపాదారవిందములకు కానుకగా సమర్పించి తాను స్తంభీభూతసమస్తభావుఁడయ్యెను. అఖండప్రేమ వెల్లువజిల్లు కనుగలువలతో కృష్ణుఁడు కుచేలుని దారిద్ర్యతప్తమనోదేహములకు అనూహ్యశైత్యసంపత్తి సమగ్రహించి అతనిని ఒక నిరుపేదగా గాక ఎవఁడో అనామకుఁడనిగా గాక తన బాల్యసఖునిగా, తనతో సమునిగా తన అత్యంతాదరణీయునిగా ఇప్పుడు తన ఇంటి కరుదెంచిన అతిథిగా పరిగణించెను. అందుచేతనే దైవసమానునిగా భావించి దైవములకెల్ల దైవమగు శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి అతని నాహ్వానించి ఆదరించి, ఉచితాసనాసీనుని గావించి, సకలపరిచర్యానుసంపన్నమగు నతిథిసేవతో సత్కరించి, అంతకు ముందాతని మనసులోనున్న సందేహ శల్యముల నన్నింటిని పెకలించి, ఆతని న్యూనతాభావమును దూరీకరించి, తమగురుకులవాసమునాటి సవిశేషప్రసంగములను సంస్మరించి తత్పాదోదకమును శిరస్సున ప్రోక్షించుకొని నిజభార్యాష్టకముతో నతని కనేకవిధ సపర్యలు చేయించి ఆతని నమితాశ్చర్యమహాంభోధి రాజోత్తాల మహాతరంగ పరంపరలలో ముంచి తేల్చెను.

కుచేలుఁడు ఈ అద్భుతసంఘటనమునకు విభ్రాంతి పడి వివశుఁడై విధివైపరీత్యముచే తనకు దారిద్ర్యమే ప్రాప్తింపకపోయినచో ఇప్పుడీ వాసుదేవభగవత్సందర్శనభాగ్యము లభింపకయే పోయెడిదని ఆ దారిద్ర్యమును శాపముగాగాక వరముగానే పరిగణించుకొనుచు వరదాభయహస్తభ్రాజిష్ణుఁడగు కృష్ణుని తానతివేలమహాభక్తిపారవశ్యముతో దర్శించి, తత్సందర్శనప్రాప్తబ్రహ్మానందసుధామాధుర్యముచే నోడలు మరచి కన్నులరమోడ్చి ఓష్ఠబహిర్నిర్గతానిర్గతవాక్ప్రసూన కళికాహారములతో శౌరిని శౌరముగా నలంకరించి తనపట్లనంతయనేదయ సఖ్యభావమును ప్రదర్శించిన సుదర్శ

నుని అనన్యసామాన్యసౌజన్యమును వేనోళ్ళకొనియాడుచు తానింటి నుండి బయలు దేరునప్పుడు భార్యచే మరిమరి బోధింపఁబడిన విషయమును లీలామాత్రముగనైనను స్మరింపక స్మరకోటిప్రతీకాశసౌందర్యనిధానుఁడగు మాధవుని దర్శనముచేతనే తన జన్మము ధన్యమైనట్లు భావించి ఆతని ఆతిథ్యము స్వీకరించి తాఁదెచ్చిన అటుకులను అడిగి మరి భుజించిన భగవానుని ఔదార్యమునకు విస్తుపోయి, ఏలవచ్చితివని ఆతఁడడుగకయు, ఇందులకేవచ్చితినని తాను చెప్పకయు సాగిన ఆ సమాగమము నిఃప్రశ్నముగను, నిరుత్తరముగను ముగిసి తిరుగు ప్రయాణము కట్టెనే గాని కుచేలుఁడు నిజ నిఃస్వతా నివేదనమున కుపక్రమింపనే లేకపోయెను.

ఇది సఖ్య భక్తిలో పర్యవసించు భగవద్భాగవతసంబంధమందలి విశిష్టత.

అఖండప్రభావసమేతుఁడై అసంఖ్యాక బ్రహ్మాండ సముదాయము నవలీలగా పాలించు భగవంతుఁడు లీలామానుషవిగ్రహధారుఁడై పుడమికవతరించినప్పుడు భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగము, ఉపాసన ఇట్లేదో యొక నిమిత్తమును పురస్కరించుకొని ఆతనితో సంబంధము పెట్టుకొని చెంతచేరగలిగిన వ్యక్తి, వ్యక్తిగతముగా నతనికెన్నిసమస్యలున్నను ఆయా సమస్యలను చక్కబెట్టుకొనుటకే మొదట నాతని యొద్ద కేగుట కుద్దేశించినను, అతనియొద్ద కేగిన తరువాత తదనిర్వచనీయమహోదాత్త మహిమ ముందు తన పూర్వప్రతిజ్ఞ ఏమియు నిలబడదు. సముద్రములో పడవైచిన ఉప్పు సముద్రముగనే పరిణమించినట్లు భగవంతుని చెంతకేగిన భక్తుఁడు తన ప్రత్యేక వ్యక్తిత్వమును కోల్పోయి భగవంతుఁడుగనే శేషించుట తటస్థించును. కనుక మొదట తానేమికోరికోరవలెనని వెళ్ళెనో ఆకోరికకు సంబంధించిన స్మృతి యుండదు. ఒకవేళ పునఃపునరభ్యాసవశమున గుర్తుతెచ్చుకొన్నను ఆ మహామహోమయదివ్యచైతన్య పిండము నెదుట ఉదరంభరిత్వస్ఫోరక మగు తన అల్పత్వమును భక్తుఁడు ప్రదర్శించుకొనుటకు సిగ్గుపడి ఆప్రసంగమును తేజాలఁడు.

శ్రీకృష్ణ భగవత్సాన్నిధ్యమున కరిగిన కుచేలుని స్థితి యిట్టిదే అయినది. ఆతఁడెంత బాల్య సఖుఁడైనను తనయొద్ద స్వేచ్ఛగా వ్యవహరించుటకు కుచేలున కెంత చనవిచ్చినను. మూర్తీభూత సకలసంపత్స్వరూపమగు నఖండైశ్వర్యము తాండవించుచున్న మహామహుఁడగు నా శ్రీకృష్ణభగవానుఁడు తన మహోన్నతత్వమును

ప్రదర్శింపక చేచాచి అడిగి మరీ కుచేలుని అటుకులు తినునంతటి సామాన్యస్థితికి దిగి వచ్చినను కుచేలుఁడు మాత్రము ఆతని యెదుట తనదైన్యమును ప్రదర్శించుటకు గాని కష్టములనుండి తన్ను గట్టెక్కింపుమని యాచించుటకు గాని తలపడలేదు.

"యాఞ్ఞాభంగ భయేన గద్గదగళత్రుట్యద్విలీనాక్షరం
కోదేహీతి వదేత్స్వదగ్ధ జఠరస్యార్థే మనస్వీపుమాన్"
(భర్తృ. వైరాగ్య. 21 శ్లో)

అను సూక్తిని సార్థకము చేసిన ఉదాత్త పురుషపుంగవుఁడు కుచేలుఁడు.

భక్తుఁడెంత మనస్వియో భగవంతుఁడంతకంటెను మనస్వియగును కదా.! భక్తుఁడు తన గౌరవమును కాపాడుకొనుటకు పాటుపడుచుండ, భగవంతుఁడు కూడ నాభక్తుని గౌరవమును నిలబెట్టుటకే ప్రయత్నించును. సూక్ష్మముగా విచారించినచో ఇచ్చట భక్తుని స్వార్థము, భగవంతుని పరార్థమును గోచరింపక మానవు ఉపాధి యున్నంతవఱకు ఆపాటి స్వార్థమెట్లో ఉండక తప్పదు. కూడను. స్వార్థము పర పీడనములో పర్యవసించు నప్పుడే స్వార్థమనిపించుకొనును గాని అట్టిది లేనప్పుడు అది కేవలము మనస్వితగనే మాననీయ మగును. కనుకనే అది భగవంతునకు కూడ ఆదరణీయమై అనుగ్రహ పరిధి నధివసించును.

కుచేలుఁడు లోకదృష్టిలో కుచేలుఁడైనను తన దృష్టిలో మాత్రము సుదాముఁడే. ఇది సర్వాంతర్యామియగు కృష్ణునకు తెలియకుండునా? అందుచేతనే వచ్చిన కారణ మడిగి అతిథిని నొప్పించుట కిచ్చగింపక గోవిందుఁడు ధర్మము చాటున కప్పిపుచ్చిన కుచేలుని కర్మమును మర్మముగానే యుండనిచ్చి ఆతని నూరక పోనిచ్చి స్వీయావాసమున కేగులోపల తనయంతవానినిగా చేసివెచెను.

ఉ. "నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళ సంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁబడి మణిత్వముఁ గాంచు సమంచిత ప్రభం
బౌరుష వృత్తు లిట్లధమ మధ్యము నుత్తముఁ గొల్చు వారికిన్"
(భర్తృ నీతి. ఏనుగు లక్ష్మణకవి - 58 ప.)

అన్నట్లు ఉత్తముల నాశ్రయించిన వారుత్తములగుటలో సందియమేమున్నది ? ఇట్టి యెడ ఉత్తముల లోనికెల్ల మహోత్తముఁడగు యదూత్తంసు నాశ్రయించిన కుచేలుఁడు మహోత్తమస్థితిని పొందుటలో వింతలేదు కదా!

సఖ్యభక్తి - సుగ్రీవుఁడు :

భగవంతుని తనతో సమానుఁడుగా భావించుకొనుసంతటి అపూర్వస్నేహాస్ఫూర్తి ఎచ్చటనోగాని యుండదు. అట్టి భాగ్యము అర్జునునకు, సుగ్రీవునకు, కుచేలునకును లభించినది. వారిలో అర్జునుఁడు నరనారాయణులలో నరుఁడగుటచే నారాయణుని కెట్లును సఖుఁడే. ఇఁక కుచేలుఁడు శ్రీకృష్ణునకు సాందీపనిమహర్షి యొద్ద విద్యాభ్యాసము చేయుదినములలో సహాధ్యాయుఁడగుటచే అసఖ్య మనివార్యము.

కాని సుగ్రీవునిది మాత్రము అట్టి సన్నివేశము కాదు. రామసుగ్రీవులం ఋష్యమూకాద్రిపై కలిసికొనునంతవఱకు ఒకరినిగూర్చి ఒకరికి తెలియదు. కయ్యమునకు, నెయ్యమునకు, వియ్యమునకు సమత్వము వలయుననెడి సూక్తిలో పేరివునకు నెయ్యమునకు వైవికముగా నట్టి సమత్వము తారసిల్లుట విచిత్రమనక తప్పదు వీరిలో శ్రీరాముఁడు రావణునిచేతను, సుగ్రీవుఁడు వాలిచేతను హృతభార్యులగుటయు ఇఱువురకు రాజ్యము లేకపోవుటయు, ఇరువురు గిరివిపినాదిదుర్గమప్రాంతసంచారులగుటయు, ఇరువురు పరసాహాయ్యమునకై ప్రతీక్షించుటయు వీరిలో గల సామ్యములు.

ఇది కేవలము లౌకిక దృష్టి మాత్రమే. శ్రీరాముఁ డెంత హృతభార్యుఁడై విలాపము నటింపమన్నను ఈ నటన మాతనియందు విలాసమాత్రముగనే పర్యవసించును గాని యదార్థ విలాప మెన్నటికిని కాదు. ఏలయన రాముఁడు సర్వజ్ఞుఁడయ్యును రావణవధప్రయోజననిమిత్తముగా కించిద్‌జ్ఞత్వమును నటించుచు మానవీయములగు సుఖదుఃఖాదులను సహింపమన్నట్లు కనబడుచుండెను. వాలి హృతరాజ్యుఁడగు సుగ్రీవుఁడు తద్రాజ్యచ్యుతిచే అఖండమగు నశాంతికి గురియై మఱల నెప్పుడెట్లు తనరాజ్యము తనచేతికి వచ్చునాయని పరితపించుచుండెను. కాఁగా రాముఁడు రాజ్యాభిషేకవార్తాశ్రవణసందర్భమున ఎంతటి సమ్మోదసంతృప్తులతోనుండెనో పట్టభంగవనగమనాదిసందర్భములందు కూడ అట్టి సమ్మోదసంతృప్తులతోనే ఉండనేర్చిన స్థిత

ప్రజ్ఞాడు. అతనికి దాక పోతులతో గూడిన పంచేంద్రియసుఖములపట్ల ఏనాడును ఏ మాత్రము ప్రీతిలేదు సరికదా అది స్వర్గతృష్ణాప్రియమను నిశ్చయజ్ఞానము సమృద్ధి గాకల మహామహుడు. సుగ్రీవుడిందులకు సంపూర్ణముగా వ్యతిరేకి. అతనికి ప్రాకృతప్రపంచము నందలి యింద్రియభోగానుభవప్రీతి అపారముగా ఉల్లసిల్లుటయే గాక తదుపస్థితిచే సుఖము, తన్నిరోధానముచే దుఃఖము కలిగి ఆయనుభూతులు రెండును యథార్థములను భ్రమయు కలదు. రామసాహాయ్యము ఆతనికి అనివార్యము అపరిహార్యము కాగా; సుగ్రీవసాహాయ్యము రామునకు లోకవిడంబనార్థము మాత్రమే. వాలిముందు సుగ్రీవుడు గాలిముందు దూది పింజ. కాని రావణుని ముందు రాముడు తగరుముందు పర్వతము.

ఇన్ని వైలక్షణ్యములు వీరిరువురిని వేరుచేయుచున్నను రాముడు ముందు ముందుగా సుగ్రీవునకు సకలాభీష్టసంసిద్ధి సమకూర్చి పిమ్మట ఆతని సాయ మపేక్షించెను. తాను ముందుగా నాతనికి సాయము చేసినచో సమయమున కాతడు మోము వాటువైచికొని ఒకవేళ మోసము చేయునేమో యని సామాన్యమానవులకు తోచుట సహజము. అట్లుగాక తన్మనోరథమును అతనికి పూర్తిగా ఇచ్చివైచుటలోనే రాముని మానవాతీతశక్తి గోచరించుచున్నది.

కాగా సుగ్రీవుడు రామచంద్రుని దైవముగా భావించెనేగాని మిత్రముగా భావింపలేదు. ఒకవేళ అంతో ఇంతో ఆతనికి రామునిపట్ల సందేహమున్నచో అది యంతయు సప్తతాళభంజనానంతరము మూలముట్టుగా తుడిచిపెట్టుకొని పోయినది. పిమ్మట ఆతనికి రాముని పట్లనేర్పడినది ఆంజనేయునివలె దైవభావమేగాని స్నేహభావము కాదు. కాని రాముడు సుగ్రీవుని ఆతనిని భక్తుడుగను, దాసుడుగను భావింపక సఖుడుగనే పరిగణించెను. మానవలోకములో ఒకరాజు సాధనసామగ్రి యెంతగా లేని అవస్థలో నున్నప్పుడు సర్వవిధముల ఉన్నతస్థితి యందున్న వానిచేత పరిత్యక్తుడగుట తటస్థించినను ఉత్తమవాడు సప్తప్రకృతిసంపన్నుడగు వేరొక రాజుని సాహాయ్యమభ్యర్థించి ఎట్లు గౌరవించునో ఆనాటకమును తానాడి చూపవలెనను సంకల్పమే స్నే పరిగణనమునకు మూలకారణము.

రాముడు చేరదీసి సుగ్రీవుని తనతో సమానునిగా పరిగణించెనన్న

మాటయేగాని సుగ్రీవునకు మాత్రము రాముని పట్ల అంతరాంతరములలో సామ్యభావము కన్న భక్తిభావమే మిన్న. అయినను గడ్డిపరక నభిమంత్రించి బ్రహ్మాస్త్రముగా ప్రయోగించి కదలలేని కదలిని అడుగుల కదకు నడిపింపఁగల ప్రభువు సముదయుఁడగు రాముఁడు విడంబనమునకైనను సుగ్రీవుని సాయమపేక్షించి తత్ప్రతిహతకపిపరివారముతో సీతాన్వేషణ కార్యక్రమమును గట్టెక్కించుకోఁజూచుట మానవ జాతికి యుద్ధతంత్రమును గూర్చి అమూల్యమగు నుపదేశము గావించుటకుగాక మరియేటికి?

ఒకవేళ తనపనితో లంకెపెట్టుకున్నచో సుగ్రీవుఁడు తన్ను నిర్లక్ష్యము చేయునేమోయని రాముఁడు శంకించువాఁడగుచో రావణసంహారపూర్వకముగా నిజకళత్రమగు సీతాదేవి చేజిక్కుదాఁక సుగ్రీవుని సందిగ్ధస్థితిలోనే ఉంచెడివాఁడు. కాని అట్టి జంకుగొంకు లేవియు పెట్టుకొనక పరిస్థితులేవియు పరిపక్వముకాక మునుపే సుగ్రీవునకు వాలి సంహారపూర్వకముగా కిష్కింధారాజ్యపట్టాభిషేకము నిస్సంశయముగా నిర్వర్తించి తన అప్రతిహతశక్తివైశిష్ట్యమును రుజువుజేసి ప్రదర్శించెను. ఆపిమ్మట సుగ్రీవుఁడు చిరదుఃఖానుభవానంతరప్రాప్తరాజ్యరమాలోలుఁడై కొంత అలసత్వము చూపినట్లు కనబడినను దానికి కారణము వర్షకాలం. శత్రుసంహరణక్రీడకై ఉపక్రమించి విజృంభించుటకు నిరంతరవర్షధారాపంకిలమైనమార్గము లనుకూలింపవు. కనుకనే అతఁడు మదిరాపానరమణీపరిరంభణాదిసుఖసంసర్గచ్యుతకర్తవ్యస్మృతుఁడై తాత్కాలిక రామాగ్రహపాత్రుఁడయ్యెను. ఏమైనను రాజ్యము, పరివారము, విత్తము, సాచివ్యము మొదలగు నే సంపదలులేని రాముని ముందు అవి అన్నియు గల సుగ్రీవుఁడు అల్పుఁడుగనే కానవచ్చుటలేదా? అయినను ఒకరాజు వేరొక రాజు సాయము నర్థించి తన పబ్బము గడుపుకొనుటకు చేయుట సములమధ్య నెలకొన్న లోకసహజమైన సఖ్యముగనే గోచరించును. దానికి రాముఁడేమియు సందేహింపలేదు గనుక సుగ్రీవకృతరామసంబంధము సఖ్యభక్తిగనే పరిగణింపఁబడినది. రామాజ్ఞను లక్ష్మణుఁడు సక్రోధవీక్షణస్ఫులింగప్రసారముతో ధీరధీరముగా తెలిపినంతనే భయప్రకంపితదేహసర్వస్వుఁడై సుగ్రీవుఁడు భీరభీరముగా తదాజ్ఞా పరిపాలనమునకంజలి బంధించి పుడమి నెల్లెడల పుడమి కూతునన్వేషింప లక్షోపలక్షలుగా కపియోధులను పంపి దక్షిణప్రాంతమునకు అంగదాదులతో ఆంజనేయుని పంపెను. పని అంతయు ఒక కొలికికి వచ్చిన పిదప యుద్ధము చేతగాని రావణుఁడు దారికి రాడని తనయొద్దనున్న

కపిసేననంతను రామార్పణము గావించి సమరసన్నాహములకు రామకృతసేతుబంధనముతో నాందీ వాచకము పలికెను.

అటుపిమ్మట సముద్రోల్లంఘనము, లంకాప్రవేశము, అంగదదౌత్యము, రావణసౌన్యావేక్షణము, రక్షఃప్రహితశుకసారణనిర్బంధము, శరణాగతవిభీషణసందర్శనము, శత్రుమయసముపపన్నరాజ్యాంగశాస్త్రచర్చాబాహుళ్యము ఒకదానివెంబడిగా నొకటి ఈ సంఘటనలన్నియు జరిగిన పిదప లంకాసౌధగవాక్షదృష్టసురజిల్లబ్ధాగ్రగృహస్ఫూర్తియే తానొక్కమారాతనిపై లంఘించుటలో సుగ్రీవుని సఖ్యభక్తి ప్రస్ఫుటమగుచున్నది. మహాశక్తిమంతుఁడగు రామభూపాలుఁడు అనదవలె నేలపై నిలిచియుండ అధర్మాభిరతిచే హీనశక్తికుఁడై తృణప్రాయుఁడగు రావణాసురుఁడు సౌధోపరిస్థితుఁడై యుండుట నాతఁడు సహింపలేకపోయెను. ఎందుకును కొఱగాని ఒక రక్కసుఁడు సాపరాధుఁడయ్యును మహావైభవప్రదర్శనములో పర్యవసించు రీతిగా మేడపైనుండుటను సహింపలేక సుగ్రీవుఁడు కనీసము మర్యాదకైనను రామున కెఱుకపరుపక ఒక్కక్షణములో ఉప్పరమున కెగసి దెప్పరమగు బలిమికలిమితో రావణునిపై కెగఁబడి అతనిని ముప్పుతిప్పలు పెట్టి మూడుచెరువులు నీరు త్రాగించి కాయము మీది గాయములతో వెనుదిరిగి వచ్చి రామునకు రావణుని హీన సత్వతను స్వానుభవముతో ఎఱిగించెను. ఇది మొదలు రావణసంహారము, వైదేహీవహ్నిప్రవేశము, రామకృతసీతాస్వీకారము, విభీషణపాలకోపక్రమణము అన్నియు సక్రమముగా జరిగి అయోధ్యకు మఱలునందాక రామసుగ్రీవుల నడుమ విలసిల్లిన సఖ్యభక్తి, అయోధ్యలో స్వపట్టాభిషేకానంతరము తనకు సాయపడిన సుగ్రీవునకు రాముఁడు చేసిన సత్కారములో కూడ ఒకరాజు సాటిరాజునకు చేయు గౌరవముగనే తోఁచి కేసఖ్యభక్తిని ప్రదీపింపఁజేయుటకే తోడ్పడినది.

## 1. మధురభక్తి - గోపికలు :

జీవితములో మాధుర్యమనునది జీవుఁడీశ్వరునితో రమించునపుడే సిద్ధించును. అనఁగా ఆత్మానుసంధానమునందే అఖండానంద పారవశ్యము లభించుననునది సిద్ధాంతము. ఆ యానందస్థితినే మాధుర్యమని తజ్ఞులు పేర్కొందురు.

ఇది లోకోత్తరసంస్కారశోభితకాలవాలమగు హృదయముగల ధన్యజీవుల కెవరికో ఎక్కడనో ఎప్పుడో లభించునదిగాని సాధారణమానవానీకమున కందుబాటులో నుండు సంఘటన నెంతమాత్రమును కాదు. ఈ విషయమును భగవానుఁడే

"మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే !
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ (భగ. 7 - 3)

అని ప్రవచించి యున్నాఁడు.

కనుక అట్టి ఆనందమును పొందఁజాలకోని లౌకిక జనులు కొద్దిమంది కావ్యప్రపంచము నాశ్రయించి రసానందముతో బ్రహ్మానందసబ్రహ్మచారియగు నాకానాక అనిర్వచనీయస్థితి ననుభవించి కొంతవఱకు తృప్తిపడఁగా అట్టి అభంగుర సంస్కారసంభారములేని ప్రాకృతమానవు లెల్లరు కేవలసాంసారికజీవితాహ్లాదమును మాత్రమే అనఁగా మానవేతరప్రాణిసాధారణము కూడ నయిన ఇంద్రియజన్యమగు జాంతవతృప్తి ని మాత్రమే పొంది అదియే ఆనందమని భ్రమించు చుందురు. కర్మేం ద్రియములలో ఉపస్థకు ఆనంద మే లక్షణముగా నిర్వచింపఁబడుట శాస్త్రీయమైన ముద్రతో కూడిన అనుభవ మగుట వేత్తలెఱుగనిది కాదు

ఈ లౌకికాలౌకికానందద్వయమును సమన్వయపరమనట్టిదే కృష్ణగోపికారాస కేళీఘట్టము. ఇది జీవబ్రహ్మైక్యానుసంధానసమాధరీసంకేతవిలసితమైన మహోదాత్త సన్నివేశము. రాసక్రీడలనునవి ఈ అఖండానందామృతాస్వాదనవైభవములో పరకోటి కెక్కిన పతాకసన్నివేశము. కాఁగా బృందావనవిహారము, గోపికావస్త్రాపహరణము మొదలగు ఘట్టములన్నియు ఆదిశోగా పయనించిన దివ్యానుభూతి కళాఖండములు. ఇందలి ప్రతి సన్నివేశమందును చెప్పనలవి అధ్యాత్మికవిభూతి ఘుమఘుమలాడుచు గుబాళించు చుండును.

యమునాతీరమున మోక్షవాసనలు గుప్పించు సువిశాలతులసీవనములో అర్ధరాత్రమున బాలకృష్ణుఁడు గగనాంగణప్రవర్షితసాంద్రచంద్రికాసుధారసవృష్టులలో తొప్పతోఁగుచు ప్రకృతిమాత యొడలెల్ల పులకించునట్లు అతిమనోహరమురళీగాన మాధుర్యము ప్రపంచమునకు పంచిపెట్టుచుండ పవనతరంగడోలికానీయమానతన్మధుర

స్వరవీచికలు భర్తృ సాహచర్యమున ఏకాంతశయ్యావినోదితస్వాంతలగు గోపకాంతలకు తురీయపురుషార్థభేరీనినాదము శ్రవణకుహరములతో ప్రతిధ్వనించినట్లు కాఁగా వారెల్ల రా సాంసారికజీవనపంకసంకలితభ్రాంతికి స్వస్తి చెప్పి యొడలెఱుఁగని తొకొత్తరపారవశ్యవైభవములో భర్తలు, అత్తలు, అఁడుబిడ్డలు, తోడికోడండ్రు ఎవరే మందురో యని గాని తెరచిన తలుపులు మూయపలెనని గాని శ్వసూకరాదిక్షుద్రజంతుసంతానముచే దధిక్షీరనవనీతశ్రీమనభాండములు కొల్లవోవునని గాని తలపక తలపులెల్ల జలజాక్షచరణజలజాతమూలముననే సోలు మంద కాళిందీతటినీ సమిద్ధతులసీ కాంతారసీమాసమాలోకనవ్యగ్రమతులై ఏతెంచి అతనితో సయ్యాటలకు సిద్ధపడ నందనందనుఁడు గృహిణీలలామలగు మీరిట్లు గృహపరిత్యాగపూర్వకముగా పరపురుషుఁడగు నన్ను డాయబూనుట కన్న పాడితప్పిన పని ఏమైన నుండునా?

క. "ధ్యానాకర్ణనదర్శన
 గానంబుల నాతలంపు గలిగినఁ చాలున్
 బూనెదరు కృతార్థత్వము
 మానవతుల్ చనుఁడు మరలి మందిరములకున్"

(ఆం. మ. భాగ. 10-1-981)

అని లోకదృష్టితో మరలింపఁ జూచెను. ఇది వారి భక్తిపారవశ్యమెంత గాంభీర్యముగను, అనివార్యముగను నున్నదో తెలిసికొనుటకు చేసిన పరీక్ష. అయినను వారు తద్గతచింతాలోలమానసవ్యాపారలీల నేమాత్రము జాఱవిడువక

మ. "అకటా! నమ్మితి మేము క్రూరుఁడని నిన్నర్థింబె మాయిండ్లలో
 సకలవ్యాప్తుల డించి నీపదసరోజాతంబు లర్చింపఁ జి
 క్కక యేతెంచితి మీశుఁడాడ్యుఁడు ముముక్షాసక్తులం గావవో
 లికిఁ గావందగుఁ గావనే విడువమేలే కాంతలన్ భ్రాంతలన్"

( ఆం. మ. భాగ. 10. 1-985 )

అనీ వేడుకొని

ఆ. "నిన్నుఁగాని పలుకనేరవు మాజిహ్వ
లొల్ల సనుసఁ బలుక నోపవీవు
మానసంబు లేల మఱపి దొంగిలితివి
యేమి సేయువార మింకఁ గృష్ణ!" (ఆం. మ. భాగ. 10. 1-988)

అని ఆత్మనివేదనపూర్వకముగ ఆర్తాలాపముగా ఆర్తత్రాణపరాయణునకు విన్నవించుకొనిరి.

ఇది వారి అతివేలభక్తిసమున్నిద్రభగవచ్ఛృంగారలీలాలాలిత్యమునకు మచ్చు చునక. భగవద్వియోగమును సహింపలేక వారెంత పరితపించిరో వారిహృదయము నావిష్కరించుచు పోతనగారు చెప్పిన ఈక్రింది పద్యము నిరూపించుచున్నది.

"నీ వడవిన్ బవల్ దిరుగ నీరుచిరాలకలాలితాస్యము
న్నేవిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నిను గన్నుల నిండుగఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్పలడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై"
(ఆం. మ. భాగ. 10. 1-1049)

గోపికల శృంగారము భక్తితో నెట్లు ముద్రితమై యున్నదో ఈక్రింది పద్యము అద్దముతో వలె మనకు ప్రస్ఫుటీకరించును.

సీ. "ఈ చరణంబులే యిందునిభానన, సనకాది మునియోగసరణిఁ బొప్పు
నీ పాదతలములే నెలనాగ! శ్రీవధూ, సీమంత వీథులఁ జెన్ను మిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన!, హాళిఁ బ్రాచూలి పట్టుఁగొమ్మ
ఏ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ!, ముక్తికాంతా మనోమోహనంబు

ఆ. "ఏ యడుగుల రజమె యింతి! బ్రహ్మాది
దివిజవరులు మౌళి దిశలఁ దాల్తు
రనుచుఁ గొందఱబల లజ్జాఘుఁదేగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి." (ఆం. మ. భాగ. 10. 1-1029)

లోకుల కామక్రోధములు లౌకిక విషయముల నాశ్రయించునవియై ప్రవర్తించుట హేతువుగా బంధములై పునర్భవహేతువున త్రోపువడఁ జేసినట్లు భక్తులకామక్రోధములు భగవత్పరములై వ్యక్తముగనో అవ్యక్తముగనో తచ్చరణారవిందయుగళీసమాలంబన పూర్వకముగా విజృంభించుటచే ఆ భావములే భవలతాలవిత్రములై మోక్షసామ్రాజ్య ప్రాప్త్యంతరసంచారయోగ్యత ననుసంధించును. కనుక భావ మేదైనను దాని కాలంబముగా భగవంతుని స్వీకరించి సముత్కటసముజ్జృంభణముతో వెల్లివిరియింపఁ జేసినచో అది భక్తియే కానక్కఱలేదు, ఈర్ష్యారోషకామాదినికృష్టభావములు కూడ పరమపదసాధనములుగనే పరిణమించునని భక్తాగ్రగణ్యులు నిశ్చయమైన నిర్ణయముతో వక్కాణించిరి.

గోపికలప్రేమ యిచ్చట భగవత్పరముగ ప్రసరించి మధురభక్తియై రహిల్లినది. వెంకటను పట్టు పెనఁగొనుకొను నవదంపలవాంఛతో కూడుకొనిన శృంగారము అంగమై భక్తి అంగి యగుచో మధురభక్తి యగునని రూపగోస్వామి యను నాలంకారికుఁడు

“వక్ష్యమాణై ర్విభావాద్యైః స్వాద్యతాం మధురా రతిః
నీతా భక్తి రసః ప్రోక్తో మధురాఖ్యో మనీషిభిః”

అని తన “ఉజ్జ్వలనీలమణి” తో నిబంధించెను. ఇట్టి గోపికలమధురరతి పైకి కామముగా కనఁబడినను అది మోక్షకామమునకు సంబంధించినదే గాని నీచప్రాపంచిక భోగభాగ్యమునకు సంబంధించినదికాదు. ఇట్లే నిత్యవ్యవహారములో కానవచ్చు నేభావ మైనను భగవత్పరముగనే ప్రసరింపఁ జేయుట అభ్యసించినచో కొన్నిజన్మలప్రాగాత సాధనాఫలముగా భగవదైక్యము సిద్ధించును. కనుకనే వివేకవిజ్ఞానవిలసితమగు భక్తి భావస్ఫూర్తిగల మహనీయులు తమ నిత్యకృత్యమందలి ప్రతి స్వల్ప చర్యను భగవంతునకే నివేదించుకొందురు. రవీంద్ర కవీంద్రుఁడు కూడ గీతాంజలిలో

"This is my prayer to thee my lord...
Give me the strength to surrender my
strength to thy will with love.
Give me the strength to make my love
fruitful in service."

( గీతాంజలి — రవీంద్రనాథ్ ఠాగూర్ - 34 గీతం )

"Let only that little be left of me whereby I may
name thee my all."

( గీతాంజలి — 36 గీతం )

అని తన భావప్రపంచమును భగవంతునికే నివేదించుకొనెను. ఈ సంపూర్ణశరణాగతిస్వభావము, ఆత్మార్పణనిశ్చయము, గోపికలలో ఆమూలాగ్రము గూడు కట్టుకొనియుండి తమ భర్తలు తప్ప మరియెవ్వరికి తమ్మర్పించుకొనని వారై యుండియు శ్రీకృష్ణుని పట్ల అంతటి పరమోదాత్త రాగరజ్జు ప్రబంధతను సంతరించుకొనుటచేతనే మధుర భక్తిలోవారు ప్రథమోదాహరణీయులైరి.

## 5. వైరభక్తి - హిరణ్యాక్షహిరణ్యకశిపులు, రావణకుంభకర్ణులు, శిశుపాలదంతవక్త్రులు.

భగవంతునితో సంబంధము పెట్టుకొనుటలో భావమేది యైనను కావచ్చును గాని దాని దృఢదీక్షానైశ్చల్యము ఆక్షేపణ కతీతముగా ఉండవలసియుండును. భగవంతుఁడు ఎచ్చటనోలేఁడు.

"సర్వస్య చాహం హృదిసన్నివిష్టః" ( భగ. 15 అ. 15శ్లో )

అని తానే స్వయముగా వచించినట్లు సమస్తప్రాణికోటి హృదయగుహావిహారముననే విహరించుచుండును. శరీరము కన్న ఇంద్రియములు, ఇంద్రియములకన్న మనస్సు, మనస్సు కన్న బుద్ధి, బుద్ధి కన్న నున్నతస్థితిలో ఆత్మ నెలకొని యుండు నీక్రమములో బుద్ధి ఆత్మవంకకు ప్రసరింపక మనసు వంకకును, మనసు ఇంద్రియముల వంకకును,

ఇంద్రియములు విషయముల పంకకును ప్రసరించి ఆత్మరహస్యము నవగతము చేసికొనుటలో సామగ్రులగు నివి యన్నియు బహిర్ముఖప్రసరణవ్యాపారపారీణములై పరమార్థమునకు దూరమగుచున్నవి. ఇట్లెన్ని జన్మములు నిరర్థకముగా సమసిపోయినను సమకూడ వలసిన సముచితజ్ఞానసముదాత్తవృత్తము సమకూడకుండగనే సంసారము సంతతప్రవర్ధమానమై అపవర్గసముపార్జనము విపరీతస్థితికి చేరుకొనుచున్నవి. ఇది అపమార్గము. జీవుఁడు విషయభోగసముపార్జనవ్యగ్రతతో ప్రదర్శించు నైశిత్యము పరమాత్మదర్శనవినిశ్చయములో ప్రదర్శించినచో తురీయపురుషార్థము కరతలామలకమగును. అది భక్తిజ్ఞానవైరాగ్యములకు విరుద్ధమైన వైరభావమైనను ఫలప్రదమే యగు ననుటలో సందియమున కావంతయు సందులేదు.

ఈవైరము దితికశ్యప సంతతియగు హిరణ్యకశిపుహిరణ్యాక్షులకు, అటు పిమ్మట రావణకుంభకర్ణులకు, ఆపైన శిశుపాలదంతవక్త్రులకును జన్మాంతరాగతమై శల్యాగతమై యుండెను,

వీరిట్లు భగవంతునిపై పగఁబూనుటకు ప్రబలమైన వేరొక కారణము గలదు. అదియు దైవనిర్ణయమే. నిరంతరహరిచరణారవిందపరమపూజాధురంధరులగు వైకుంఠద్వారపాలకులు జయవిజయులు శ్రీమన్నారాయణసంతతసందర్శనప్రాప్తమహానందసుధాసాగరసాంయాత్రికులై తత్పరదైవమునకు ప్రసాది వైపరీత్యము కలనైనను కలిగింప తలపోతలేని అతినిశ్చలనిష్ఠతో విధినిర్వహణ మొనర్చు తరి నిరంతరపరమవిజ్ఞానవీథీవిహారమాణమానసులును శ్రీమద్వాసుదేవపరబ్రహ్మమునకేకాంతభక్తులును, గృహీతబాలరూపులును, అంగుష్ఠమాత్రదేహులును, యుక్తాయుక్తవివేచనారహితముగా హరిసందర్శనసాంతత్యమునకు కృతాంగీకారులునగు సనకసనందనాదిమహర్షిసత్తములు వైకుంఠవాసుని దర్శనమునకు రాగా హరి రమాసమాకలితశయ్యాసంక్రాంతుఁడై ఏకాంతవాసము చిత్తగింప నుండెననియు తద్దర్శనమున కిది తఱికాదనియు దౌవారికులు నివారణమొనర్ప, అలిగి భూలోకమున జన్మింపుఁడని శాపమిచ్చిరి. శాపకర్తలు, శాపభోక్తలు కూడ పరమవైష్ణవులే. ముకుందోపాసనాముకుళీభూతకరోపస్థితిలో వాదిప్రతివాదు లిరువురును ఒకరికొకరు తీసిపోవువారు కారు. శప్తులైన పిమ్మట జయవిజయులదీనాలాపములు అభ్యంతరమందిరగతగోవిందహృదయారవిందమును కందిం

పఁజేయ ఈసంపద ఏమియో సంతర్పింతుఁగాక యని ఆనందకందమగు నానందనం దనపరబ్రహ్మము వైకుంఠమందిరాభిముఖమునకు విసవిస వేంచేసెను. విషయము నిమిషములో నవగతము చేసికొని వైరమున నన్మతిప్రియమునగాని, స్నేహమున భవసప్తకమునగాని వెండియునన్ను చేరవచ్చును. మీకిందేది అభిలషితమని ప్రశ్నింప హరివియోగము దీర్ఘకాలమనుభవింప నొల్లక వైరమున వర్తిల్లు ముప్పుట్టుకకే మెచ్చుపడి ఏవంవిధ రక్షోజన్మ నవధరించిరి.

ఈ మూడుజంటలను పరిమార్చి మరల తనవెంట కొనిపోవుటకు నారాయణుఁడు నాలుగవతారములు ధరింపవలసి వచ్చెను. హిరణ్యాక్షుఁడు పద్మసంభవప్రదత్తవరగర్వాతిరేకమున విజృంభించి జగత్త్రయకకాలప్రళయము ననుసంధించుచుండ ధర్మదేవత వాని చేతిలో మర్మాఘాతమునకు గురియై మరణావస్థ సమీపించి యుండ తద్ధర్మమున కాలంబనయుక్తులై జగత్కల్యాణసముపార్జనవ్యసన రసికులగు మహర్షిదేవర్షిప్రభృతులు తద్రక్షోనిర్మూలనమంగళకర్మమెప్పుడు ప్రసక్త మగునా యని తహతహపడుచుందురు. హిరణ్యాక్షునకు అవశ్యంభావియగు దైవయోగముచే పద్మనాభునిపట్లను, తద్భక్తులపట్లను, తత్ప్రీతిపాత్రములగు యజ్ఞయాగాదిక్రతుకలాపములపట్లను దురతిక్రమణీయ వైరబంధము క్షణక్షణప్రవర్ధమానమై బలము పుంజుకొను కొలది విశ్వమునకు విలయము అనుభవగోచర మగుచుండెను. హరినెట్లయినను అన్వేషించి మట్టుపెట్టవలెనను హిరణ్యాక్షుని దీక్షను విరమింపఁజేయు నదను కనిపెట్టి కమలాక్షుఁడు శ్వేతవరాహరూపధారియై ఎదుర్కొనెను. తన పేరు విన్నంతనే సకలప్రాణిసమూహము గడగడవడఁకి పారిపోవుచుండుటయు, సముద్రుఁడు, హిమవంతుఁడు, మేరువు, వరుణుఁడు మున్నగాగల అతులితబలవైభవప్రాభవోద్దాముల యంతికమున కేగి తొడచఱచినను వానితోడి కయ్యమునకు కాలుచాచుట వివేకము కాదని యజ్ఞవరాహస్వరూపమునక్రీడింపు నా మహాత్ముని చెంతకే పోయినచో నీ కోరిక నెరవేర్చి తీరునని యుపదేశింప నాతఁడు నట్టి యసాధారణరూపరేఖావైభవము నారసి తప్పక యితఁడు హరియగునని తలపోసి "హరికావుననే యూరనని మట్టుపెట్టవలెన"ని గట్టి నిశ్చయమునకు వచ్చి ఇన్నాళ్ళకు తన కోరిక నెరవేరనున్నది గదా యని అమితానందమహోదధి నీదులాడుచు ఆ యజ్ఞపోత్రితో ఘోరాహవక్రీడావినోదమును గుస్తరింప సమకట్టెను. ఇది యాతని వైరభక్తికి ప్రత్యక్ష సాక్ష్యము. కొంతసేపు

వానితో రణవినోదము చిత్తగించి తద్రక్షోవీరసంహారకార్యభాగమున విలంబము కావించుట విశ్వమునకే విషాదయోగహేతు వగునని నింగినుండి నిలింపులు హెచ్చరింప హెచ్చరిల్లినకచ్చతో విచ్చలవిడిగ విజృంభించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రప్రహార నిమిత ముగా నతనిని మృత్యుదేవతావదనగహ్వరమున కుపహారమొనర్చెను. ఇట్లు మొదటిజంటలో నొకఁడు తాననుభవింపవలసిన పాపములో మూడవవంతు అనుభవించి అంతమేరకు శుద్ధచిత్తుఁ డయ్యెను.

హిరణ్యాక్షుని అన్న హిరణ్యకశిపుఁడు. ఇతఁడు అతని కంటె తామసిక తపోవిభూతిలోను, బ్రహ్మదత్త నిరవద్యవరప్రభావములోను, జగన్నిర్మూలనదీక్షాప్రదర్శిత మహాదౌర్జన్యములోను గొప్పదిట్ట. విశ్వచక్రభ్రమణమునకు కేంద్రబిందువగు ధర్మమును సమూలముగా నిర్మూలించి దుష్టప్రయోగచాతురీవిభవముతో లోకమునకు వ్యాకులత్వము నాపాదించుటలోను, సాధుబాధాకరఘోరలీలావిజృంభణప్రతిజ్ఞాపాలనైక నిష్ఠలోను అతని కతఁడేసాటి. సరాసరి స్వర్గమున కేగి పురందరుని పదభ్రష్టు నొనర్చి సుధర్మాసింహాసనాక్రమణపురాశయముతో విక్రమించి యమ వైశ్వానరముఖ సర్వదిగధీశనికసంపద్ధరాక్రమణక్రూరదురంతనిర్దయదురాభ్యాసప్రతిష్ఠాసమారోహుఁడై భగవత్సృష్టికి బలప్రదమగు యజ్ఞకర్మమును ఒకవైపునుండి నిర్మూలించుచునే వేరొక వైపు నుండి తనకు ప్రీతికరముగా హవిర్దాన మొసఁగించుమనదిగా మహర్షిపరిషత్తులను బలాత్కరించి ధర్మదేవతకు తీరని అపచారము గావించుటతోపాటు నిరపరాధులగు మహాపురుషుల నెందరెందరినో నిష్కారణముగా దారుణక్రూరహింసావేదనావ్యథితుల గావించి ఏక్షణములో ఎవరి ప్రాణములకు నీరుతోడునో తెలియని దురవస్థ దాపురింపఁ జేసి విశ్వప్రజాకంటకుఁడుగా పేరు పడసి పరమనిష్ఠురనిరంకుశత్వముతో ప్రవర్తించి తన పతనమునకు తానే దారితీసికొనెను. దేవతలను, మహర్షులను సంరక్షించుటకు ఎక్కడ కలదైనను కానరాని ఆ పరమఘోరదుష్కాలమున హిరణ్యకశిపుఁడు పెక్కుమారులు వైకుంఠముపై దండెత్తి విష్ణుమూర్తితో సరాసరి పోరాడుటకు తొందరపడెనుగా ఆ వాసుదేవుని జాడయైనను కానరాలేదు. "నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః" (భగ. 7-25 శ్లో) అని చెప్పుకొన్న విష్ణుభగవానుఁడు పరమతపోవిశేషాధురంధరులకే కనుమరుగై యుండువాఁడు. ఇంద్రియదాసుఁడు, జగత్కంటకుఁడు, పురుషార్థహీనుఁడు నగు నచరితాత్మున కెట్లు దర్శనమిచ్చును? అంతతో విష్ణు వను

వాంఛ తేడను నిశ్చయమునకు వచ్చిన వీటోడి యగు వీఁడు మరింత విచ్చల విడిగా విహరించుచు విశ్వమునకే విహ్వాలభావము ననుసంధించెను. దేవతలు దీనులై ప్రార్థింప కరుణించిన కరివరదుండు స్వరూపసాక్షాత్కారము నుజ్జగించి పరమభక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుని బాధించుటతో వాని పతనము చేరువగును. అంతవఱకు మీరు ఓపిక పట్టి యుండుఁడని ఒక శబ్దము మాత్రము ఆకసము నుండి పుట్టెంచెను. ఆపిమ్మట హరిద్వేషియగు వీనికి జనించిన ప్రహ్లాదుఁడు హరిభక్తుఁడై వహించిన అతని నిరంతర హరిస్మరణపరాయణత్వ మసురేంద్రునిలో క్షణక్షణప్రవర్ధమానక్రోధకార్పణ్యదౌర్జన్యదౌష్ట్యావేశము రేకెత్తుటకు తోడ్పడి ఆ బాలభక్తుని పెట్టిన ప్రబలహింసలే అతని ధ్వంసమునకు కారణసామగ్రిగా బలపడెను.

సర్వము హరిమయమని ప్రహ్లాదుఁడు కావించిన సాత్త్వికసంభాషణము హిరణ్యకశిపునిలో ఆసురీసంపత్తి నంతకంతకు అధికము కావించుటలో పర్యవసించుట విజ్ఞులకు కాకపోయినను సామాన్యులకు వింతగా కాన్పింప వచ్చును. ఒకేలక్షణము ఒకరిలో సంయమనము ఒకరిలో విశృంఖలత్వమును పోదిచేసి ఒకని అభ్యుదయమునకు, వేరొకరి వినాశనమునకు ఏకకాలమందే హేతువగుట ఇచ్చటి విశేషము. ఇట్లు పరికింప అభ్యుదయవినాశనములు కర్మములో కాక, కర్మాచరణ మందలి ఆశయములో వేరొని ఉండునని విశదపడకపోదు. ప్రహ్లాదుఁడు హరిని తనకు రక్షకునిగా వరించెను. ఆ హరికే హిరణ్యకశిపుఁడు శిక్షకుం డైనట్లు ప్రవర్తించి చేజేతుల మెడ కురి బిగించుకొనెను. ఇచ్చట ప్రహ్లాదుం డాడిన మాటలు అతని జగద్గురు స్థానమును స్థాపించుచున్నవి. దిక్కులను గెలుచుట, దిక్పాలకులను శిక్షించుట, అప్సరసలను బందీలుగాఁబట్టి క్రీడాసామగ్రులుగా వాడుకొనుట విశ్వములో తన కెదురు లేదని విఱ్ఱవీగుట ఇవన్నియు అజ్ఞానమూలకములు. ఏలయన ఇది బహిర్ముఖ ప్రవృత్తి. ఇందు సుఖము లేదు. మనస్సున కెల్లప్పుడు అంకోశనము విస్తరించు చుండును. బాహ్యశక్తులను నిర్జించి నంత మాత్రముతో జీవనము పావనము కాదు. జన్మకు చారితార్థ్యము లభింపదు. అసలు నిర్జింపవలసిన శత్రువులు బయటలేరు. వారు లోపలనే యుండిరి. కామక్రోధాదితద్వైరిషట్కమును నిర్జించి మనస్సును బహిః ప్రకృతి నుండి విరోధింపగలిగినచో అతనికి ప్రపంచములో ఎదురేలేదు. ఈ బోధ ప్రహ్లాదుఁడు చేసినను హిరణ్యకశిపుఁడు వినలేదు. హిరణ్యకశిపుఁడు సంసార

సామాన్యునకు ప్రతీక. ప్రహ్లాదుఁడు ఉదాత్తసంస్కారమునకు చిహ్నము. ఇదియే భాగవత మావిష్కరించు నవప్రతిమానజ్ఞానపారమ్యము. హిరణ్యకశిపుఁడు బాహ్యమును పట్టి వ్రేలాడుచు పతనము కాఁగా ప్రహ్లాదుఁడు ఆత్మశోధనము గావించుకొని అభ్యున్నతి సాధించెను. ప్రహ్లాదుని మనస్సులో నెల్లప్పుడు నెలకొని యున్నవాఁడు హరియే. అతనిది సాక్షాద్భక్తి. హిరణ్యకశిపుని మనస్సులో నెల్లప్పుడును నెలకొని యున్నవాఁడు కూడ హరియే. కాని ఎట్లు? హరిని నిర్మూలింప వలెనను పరమ దృఢమైననిష్ఠతో నేలవిడిచి సాము చేసెను. ప్రహ్లాదుని యందున్నది హరిభక్తి. హిరణ్యకశిపుని యందున్నది హరివైరము. వైరముతో నైనను అతని మనసు నందు మాత్రము హరిని స్మరించుట విడువలేదు. ఈ హేతువుచే అతఁడు హరికి ప్రతిపక్షమగు దుర్వాదమును పట్టుకొని వ్రేలాడుచు ఎచ్చటను నారాయణుఁడు లేఁడను నిర్ణయమును ప్రకటించుచుండ అతని అసాధ్యవరములకు పరిహారముగా హరి విచిత్రమగు నృసింహరూపమును ధరించి అణువణువున వ్యాపించి అవ్యక్తుఁడై అణఁగిమణఁగి యుండెను. ఈ అవస్థలో "స్తంభమున హరిని చూపుమవా" అని తండ్రి అడుగ కొడుకట్లే యని పలుకుచునే అతని దయ యున్నచో అతఁ డా స్తంభమున దర్శన మిచ్చునని ప్రవచించెను. కర్తృత్వరహితముగా కర్మము నాచరించుట యను విశిష్టలక్షణ మిందు ఇమిడి యున్నది. హరి ఉపస్థితి నంగీకరించని అసురేంద్రుఁడు స్తంభమును తిరస్కారభావముతో ప్రక్క చఱుపుచుండగా అందుండి నృహరి రూపమున హరి సకలజగద్భయంకరవికటాకారుఁడై ఆవిర్భవించి కొంత తడవు వినోదముగా రక్షసుని తోడి ఆహవక్రీడను చిత్తగించి చివరి కొక్క త్రుటిలో నాని స్వీయనఖాయుధములతో విదారించి అతని వైరభక్తికి నిమిత్తమగు తద్దానవదేహము నుండి విముక్తిని గావించెను.

ఆ జయవిజయులే రెండవ జన్మములో రావణకుంభకర్ణులుగా కైకసీవిశ్రవస్సులకు జనించిరి. అందు రావణుఁడు జగత్కంటకసార్వభౌముఁడు. అతని యొద్ద చెడ్డ యెంత యున్నదో మంచియు నంతయే యున్నది. అఖండశివపూజాధురంధరుఁడు. వేదవేదాంగాదిసకలశాస్త్రతత్త్వవేత్త. అకుంఠితసౌందర్యారాధకుఁడు, అయినను అనుపమభోగలాలసుఁడై తద్భోగజీవితమునకు ధర్మము కన్న అధర్మమునే ఆలంబనముగాఁ జేసికొని తన జీవితపతనమును తానే కోరి తెచ్చుకొనెను. "కలకంఠ

గంటి కన్నులఁ జొలికిన సిరియింత నుండఁబోలదు" ని (సుమతీ శతకం - 87 ప.) చెప్పిన భద్రభూపాలుని వాక్కునకు సాక్షాల్లక్ష్యభూతుఁడు రావణుఁడు. అతఁడు స్వర్గాది సమస్తలోకములపై దండెత్తి తన్నేతృశిఖామణుల ననవరతపీడానిపీడ్యమానమానసుల గావించి, తత్రత్యనారీవారమును వారనిర్వాపణదుఃఖపరంపరలకు గురిచేసి; బందీలుగా కొనిపోయి, లంకాపురమున నిల్పి, బలాత్కరించి, తన్మానధనము నపహరించి అపరిమితపాపధనమును మూటకట్టుకొనెను. పరనారీ సంభోగము పరమాయుర్ధాయ విత్తభంజకమని సత్పురుషులు ఎంతో చెప్పినను పరిగణనము లేని మూర్ఖపరిపాలన మతితో తృణప్రాయముగా తిరస్కరించి నిజపాతిత్యసౌధమునకు పునాదులు వేసికొని ఆపదలో పరలోకగమించుటయే తన జీవితమునకు ధ్యేయము గావించుకొనెను. సమర్థత గల వేదవతి, రంభ, పుంజికస్థల మున్నగు స్త్రీలు వారివారి శాపప్రభావములతో సుష్ఠుగా నచ్చిన సాగించియే యున్నారు. అయినను "కామాతురాణాం నభయం నలజ్జా" అను సూక్తి ఎంతటి ఏలపోవుమ? వాఁడింకను పరస్త్రీవ్యామోహ వాగురానిబద్ధబుద్ధి యగు మనసే లెక్కకలిపిగాని ఇక్కట్లు పెట్టునను తలపు తగిలింపకొని అధోగమనవ్యవసాయ చాతుర్యముచే సహాయుఁ డయ్యెను.

కుటిలబుద్ధితో నిష్కారణముగా రామునిపై కయ్యమునకు గాలుదువ్వి ఖరదూష ణాద్యపారదానవబలమును రణమునకు బలిపెట్టుకొన్న శూర్పణఖ వికృతరూపిణి అయ్యె బుద్ధి తెచ్చుకొనక రావణునితో కలయఁడి ఇతనికి గల దుష్కామరూపమైన బలహీనతను పచ్చగట్టి, సీతాపహరణదుష్కర్మకు ప్రోత్సహించి రాక్షసజాతినిర్మూలనమునకు బీజము వేసెను. అయినను మారీచాదిరక్షోవృద్ధులు రామునితో కయ్యమునకు కాలు దువ్వుట నిప్పుతో చెలగాట మాడుట, కాలసర్ప దంష్ట్రాంకురములతో క్రీడించుట, గుహాసుప్తం కేసరిప్రగహ్వరము చెరచి తదభ్యంతరమున మస్తకమును ప్రవేశపెట్టుట, ప్రళయ సముద్యమానంబుపూరమహోద్ధతికి ఎదురు నిలుచుట, పుష్కరావర్తకాదికాలజీమూత వర్షితనిర్ఘాతపాతమునకు రొమ్మొడ్డుట అని ఎంతగనో బోధించి విసిగి వేసారిరి గాని, వాఁడు పట్టిన కుందేటికి మూడేకాళ్ళను వాదమును విడువఁడాయెను. చివరికి సీతాప హరణము గావించి లంకలో చేర్చుకొనెను. సీతను రావణుఁ డపహరించిన క్షణము నందే రావణుఁడు చచ్చెనని బ్రహ్మపుత్రుఁడు ప్రకటించెను. సాధుహింస కన్న స్వవంశ వినాశనమునకు దగ్గరదారి లేదు.

ఇట్లు రావణకృతసీతాపహరణవార్త మహర్షిమండలములో రావణజీవితము నకు దినములు నిండెనను నూరట పొందిక చేసెను. అఖండశివపూజాధురంధరుఁ డగుటచే రావణుని సంహరించుట శివసహకారము లేనిదే పొసగదు. అది పూరించు టకే ఆంజనేయావతారము. ఆంజనేయస్వామి ఏకాదశరుద్రులందలి అజైకపాద రుద్రుని అంశతో నావిర్భవించెను. అహంకారి ఎప్పుడును ఉద్రేకముతో కుతకుత లాడునేగాని భావిఫలము నూహింపఁడు. తపస్సునకు తమస్సుతోడైనచో వినాశనము దాని వెన్నంటియే ఉండును. అతఁడు తామసికతపోదీక్ష నవలంబించి శివుని అతి మాత్రముగా మెప్పింపవలెనని ఆడంబరమునకుఁబోయి స్వశిరోనిర్దళనపూర్వకముగా శివ ప్రీతికై హోమము గావించుచు తానేది సాధింప దలంచెనో దానికి తానే విఘాతము కల్పించుకొనెను. తనకున్నవి పదితలలే ఆవల రుద్రులు పదునొకండ్రు. వారిని తృప్తి పరుపబోయి కావించిన హోమ విధిలో పదునొకండవవాఁడగు నజైకపాద రుద్రుని కోపమునకు గురియై తన యవతారముగా నాంజనేయస్వామి రఘుస్వామి కందించిన సహకారహస్తముతో తన మస్తముల పదింటిని మహీమండలికి నైవేద్యము కావించుకోవలసిన వాఁడయ్యెను. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అను పెద్దల సూక్తి వ్యర్థము కాదుకదా !

కొండపంటి పుండరీకాక్షుని తిగరు వంటె తాను డీకొనఁ బూనుట కన్న అవివేక మెందుండును ? చదువని శాస్త్రమేలేని మహావిపశ్చిదగ్రగణ్యుఁడయ్యును రావణుఁడు శాస్త్రానుసారప్రవృత్తి నవలంబింపక స్వసంస్కారోచితపురుషవ్యాపారపరా ధీనుఁడై "దైవంనిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా" (హితో. ప్రస్తా. 82 శ్లో.) అను విహితవాక్య నందలి శాస్త్రీయపురుషకా రాధీనతను ధిక్కరించి దారుణమైన పాపమునకు పాల్పడి తత్పాపఫలరూపమగు మహాదుఃఖసాగరమున శాశ్వతముగా మునిగి పోయెను.

రాముఁడు విష్ణ్వవతారమని సోదరుఁడగు విభీషణుఁడు, తల్లియగు కైకసి, భార్యయగు మందోదరి, కూటవిద్యావిశారదుఁడగు మారీచుఁడు ఎంతగనో బోధించిరి. తిరస్కరించుటకు తన కెమియు ఆధారము లేకపోయినను ఊరక ధిక్కారము గావించెను. పైగా వాఁడొక మానవుఁడు. మానవునకు మనము భయపడుటా అని ప్రగల్భము లాడి ఆ మాటపులతోను ఏ కొంచెపాటి అంతస్తును లేక రాజ్యభ్రష్టుఁడై, పితృకృత

బహిష్కారమునకు గుఱియై, చేత చిల్లి గవ్వయును లేక వికారియై, జడలు ధరించి ఆనాకారియై, బైరాగులవలె కందమూలాహారియై, దారియు గొంకయులేని అడవులలో పడతిని కోల్పోయి ఎక్కడ నున్నదో తెలియక కంటికి మంటికి నేకధారగా విలపించు దీనమానవుఁడు నన్నేమి చేయజాలునని తోరముగా వీరములాడి లేనిపోని దారుణమగు కారాకూరమునకు బయిసిమాలి దోసిలి యొగ్గెను.

వానరము నరానుగ్రహముతో వారాన్నిధిని పారను ముట్టుట సాధ్యమగు పనియేనా ? నాగపాశమును గరుత్మత్సాహాయ్యముతో విడిపించుకొనుట మనుష్య మాత్రునకు శక్యమా? మూర్ఛమునింగి సూర్యోదయ వేళకు దీర్ఘ నిద్ర చెందుటకు సిద్ధముగా నుండి సుమార మందలి చంద్రాద్రి యవ్వలి ఓషధిపర్వతమును తెప్పించు కొని చికిత్సించుకొనుట మానిసి యధీనములోని పనియా? ఇవన్నియు రాముఁడు మానవుఁడు కాఁడు మాధవుఁడు సుమా యని స్థాపించుచున్నను దుర్దమ తమోలక్షణ మైన మూర్ఖతావినివేశితమహాభినివేశముతో ఇట్టే కొట్టిపారవైచి నశ్వరమగు స్వశక్తిపై ఆధారపడిన రావణుని అపారశాస్త్రపాండిలీశౌండీర్య మేమయ్యెనో కదా? "ప్రాయ స్సమాపన్న విపత్తికాలే ధియోపి పుంసాం మలినా భవన్తి" (హితో. మి.లా. 30 శ్లో.) అను నార్యోక్తి కద్దేమున్నది?

అసాధ్యమగు పనులను సుసాధ్యము చేయుట సాత్త్విక తపోయోగముచే కరతలామలక మగును. అది దేవతలకు నిత్యకృత్యము. వారు సత్త్వప్రధానులు. నిష్కారణ లోకహింసకు వారు పాల్పడరు. అందుచే వారికి ఎవరి మనోవేదనా జన్యమైన శాపము తగులను. ఇఁక రక్కసులన్ననో వారికన్న మ్రిక్కఁడు లెక్కఁడ దాపురింతురు? వారి కాజన్మ సిద్ధమగు తమస్సు వారి తపస్సునకు స్వవినాశ బీజ మును గర్భీకరించి పెట్టును. అది తెలిసికొనలేక మనమెంతో అత్యుగ్రతపస్సం పన్నులము గదా? మన కేమి తక్కువ యని మిడిసిపడి కచుంగడు చేసు నడపడితో పుడమి కిడుమలు గడించిపెట్టి కడకు తామా ఇడుమలకే ఆహుతియై నామరూపము లేక నశింతురు ఆట్లు నశింప చేయు తెలివి దేవతలది కాగా నశించు తెలివిమాలిన తనము రాక్షసులదగును. "ద్వావిమౌ పురుషౌమూర్ఖౌ దుర్యోధన దశాననౌ" అను నభియుక్తోక్తికి రావణుఁ డంతటి వేదవేత్త గురి యగుట కన్న శోచనీయ మేముం డును? ఆ మూర్ఖత్వముచేతనే అతఁడు పదే పదే పంపఁబడిన రాయబారములను

శిరస్కరించి సంధి కొదంబడక బుద్ధిమాలినయుద్ధమునకు సిద్ధపడి తానునమ్మకొన్న ఇంద్రజిత్తు చిత్తయిన పిమ్మట కూడ ఆహవమే అభిలషణీయ మని తనతలకు తానే గొఱివి పెట్టుకొన్న అసమీక్ష్యకారి నెవడు మాత్ర మేమి యుద్ధరింప గలఁడు? "రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ," అని ప్రఖ్యాతి గాంచిన అజగద్భయంకరమహాసంగ్రామరంగములో తుదకు అమోఘరామబాణాగ్ని కాతఁ డింధనమై దేహబంధమును సిగనాడి తన అనుపస్థితిచే విశ్వమునకు అనశ్వర మగు కల్యాణము ననుసంధించెను

ఇఁక కుంభకర్ణుఁడు "అతనికంటె మనుఁడు అచంట మల్లన్న" అనునట్లు రావణునికంటె మించిన జగత్కంటకుఁడు కావలసిన వాఁడే గాని దైవసంకల్పబలాధిక్యముచే ఆతఁడు కోరుకొనఁదలచిన నిర్దయను నిద్దురగా తడఁబడి తడకు నిద్రకే అంకితమై అది దీర్ఘనిద్రలో పర్యవసించు నట్లు పరికల్పించుకొనెను. ఆతని బల మపారము. ఆతఁడు ఒక్కనాడు గైకొను నాహారము లంకలోని రాక్షసు లందరకు నేడాదిపాటు కడుపునింపు ప్రమాణము కలది. మదిరారుధిరమాంసాదినిషిద్ధపదార్థ సమాస్వాదనవైవశ్యమతో మదించిన మహాదేహ మాతనికి కొండంత అండ.

ఇంతటి భయంకరుఁడయ్యును ఆతఁడు కూడ నీతిమాలిన రావణునకు నీతి చెప్పకపోలేదు. సీతను తెచ్చిననాఁడు నన్నడిగి తెచ్చితివా? నేడు నీ అనాలోచిత రణవ్యాపారమునకు నా సహకారము నభ్యర్థించు చుంటివని అన్న,, తని వెగ్గలముగా నిగ్గదీసెను. జరిగిన నష్టమేదో జరిగినది గాని ఇఁకనైనను పరిశిష్టగతకపరివారముతో సుఖింపఁదలచికొన్నచో తక్షణమే జానకీదేవిని జానకీజాని కప్పగించి బ్రతికి బట్ట కట్టుమని హితోపదేశము గావించెను. కాని "ముమూర్షు ర్యో భవతి నసఖలు జీవతి" (మృచ్ఛకటికమ్ - 1. 83 శ్లో) అను సూక్తికి ఉదాహరణీయుఁడు కాదలంచిన రావణుని కీనీతు లేవియు నెత్తికెక్కలేదు. ఇఁక చేయునది లేక కుంభకర్ణుఁడు రాజ వగు నీ ఉప్పు పులుసు తిని కండలు పెంచు కొంటిని గనుక భండనములో నీకు అండగా నిలుచుట కన్న రెండవ ధర్మము నాకే ముండునని రణభూమి కరిగి అసాధారణపౌరుషవ్యాపారము నెరపి కపిసేనలపాలిటి ప్రళయరుద్రుడై చివరికి తనపాలిటి ప్రళయరుద్రుఁడగు రాముని చేతిలో ఖండిత మస్తకుఁడై భూమిని శాశ్వతముగా విడనాడెను.

ఈ శ్వేతవరాహకల్పములో రావణకుంభకర్ణు లిరువురు రాముని చేతిలో హతులైరి. కాని గత కల్పములో రావణుఁడు రాముని చేతిలోను కుంభకర్ణుఁడు లక్ష్మణుని చేతిలోను నిహతులగుట తటస్థించెను.

ఇట్లు జయవిజయుల రెండవజన్మ మగు రావణకుంభకర్ణులు వైరభక్తిచే శ్రీహరి సాన్నిధ్యమునకే చేరువైరి.

ఇఁక మూడవజంట శిశుపాలదంతవక్త్రులు. జన్మములు గడచుచున్న కొలఁది వారికి విష్ణుభగవానుని పట్ల గల వైరము కొంచెము తగ్గుచున్న సూచన ఈ మూడవ జన్మములో గోచరించును. శిశుపాలుఁడు కేవలము కృష్ణుని పట్ల నామమాత్రవిరోధముతో క్రోధించి దూషించుట, రుక్మిజరాసంధాదులపక్షము వహించి కొంచెము కటువుగా ప్రవర్తించుట తప్ప హిరణ్యకశిపుదశగ్రీవాదులవలె ధర్మనిర్మూలన పరాయణత్వములోను జగత్కంటకత్వములోను కాకలు దీరిన వాఁడై వారిలో పాటియైనవాఁడు మాత్రము కాఁడు. ఇఁక దంతవక్త్రుని పాత్ర అత్యంతము నామమాత్రమే.

శిశుపాలుని పుట్టుకలోనే చతుర్బాహుత్వాదివికృతలక్షణములు కొన్ని గోచరించుటయు, "ఎవరెత్తుకొనగా ఈవికారములు తొలగి ఆకారము సుభగ మగునో వారిచేతిలో వీని మరణము సిద్ధించును" నని ఆకాశవాణి జోస్యము చెప్పుట తటస్థించినది. ఇది ఎందుకు తటస్థింపవలసి వచ్చినది?

వారి తొలిరూపము విష్ణుద్వారపాలకు లగు జయవిజయులు. హరిపారిపార్శ్వకులు కూడ హరివలెనె చతుర్భుజులు శంఖచక్రధరులు, ఆజానులంబివనమాలికాలంకృతవక్షస్కులు నైయుందురు. ఇఁక అల్పకాలముకో వీరు నరలోకమును వీడి వైకుంఠమున కేగి ఏరూపము ధరింతురో ఆరూపమిప్పుడే సూచితమైన దన్నమాట. సనకసనందనాదిభాగవతతిరస్కారరూపమైన పాపము చాల వఱకు నశించి నామమాత్ర మగు నేదో కొంత అవశేషించి ఏతజ్జన్మప్రారబ్ధముగా పరిణమించినదే గాని అంతకన్న నిది ఎక్కువ పాపమూలకము కాదని సూచించుటకో యన నట్టి యాకార మతనికి ఆజన్మసిద్ధమై సహజముగా అట్టి రూపము గల వైకుంఠవాసుఁడగు వాసుదేవుని చేతిలోనే అతని రూపము క్రమపడుట తటస్థించినది. ఇది అతనికి కొంత వఱకు స్వస్వ

హాపానుసంధానమే యని చెప్పనగును: అయినను వైరభక్తి తప్పదు గనుకను
ానితోనే అతనికి ముక్తి చేకూరవలసిన దైవసంకల్ప మున్నది గనుకను అతనికి
ష్ణుద్వేష మీషన్మాత్రము సంక్రమించి యుండెను. అదియు నతనిని దూషించుట,
ారుల ఎదుట అవమానపరచుట, ఆదూషణములోను వ్యాజస్తుతి తొంగి చూచుట
ట్టివే వైరభక్తి లీలలు.

ఆకాశవాణి వాక్కు విన్న అతని తల్లి సాత్వతి శిశువును చూడవచ్చిన వారి
ెల్లరకు ఎత్తుకొనుట కిచ్చుచుండెడిది. అట్టే అభ్యాసములో కృష్ణుని చేతి కిచ్చినప్పు
తని వికృతి తొలగి పోవుటతో అతని యంతము కృష్ణుని చేతిలోనే ఉన్నదని యూహి
ాగా నానె వంద తప్పుల వఱకు క్షమింప వలసినదిగా కోరి యుండెను. ఆ ప్రకా
మె అతఁడు అపరాధపరంపరల కొడి గట్టుటయు, అచ్యుతుఁడు వానిని లెక్కపెట్టు
ొనుటయు సాగుచుండెను. ఇట్లు సాగిన లెక్క ధర్మజరాజసూయయాగసందర్భము
ాటికి ముగిసి పోయినది. అగ్రతాంబూలప్రదానసందర్భమున శిశుపాలుఁ డరపిం
ాతుఁ వభిశంసించుచు ఏదో గొల్లవాఁడని, వెన్నదొంగయని, గోపికావస్త్రాపహర్త
యని, జరాసంధుని చేతిలో నోడి పెక్కుమారులు పారిపోయిన వాఁడని, తన కీయ
ిలపెట్టిన రుక్మిణి నపహరించి రాక్షసవివాహము చేసికొన్నవాఁడని ఇట్టివే కొన్ని ఉపా
ంభవాక్యములు పలికెను. కృష్ణుని పట్ల సాపరాధులైన కంసాదులతో పోల్చినచో
ఈ అపరాధము లసలెన్న తగ్గివేకావు. ఏదోనిమిత్తము చూపి అతనికి మోక్ష మీయ
వలెననియే కృష్ణుని సంకల్ప మగుటయు, అతఁడు నందు కొఱకే జాతకౌతూహలుఁడై
ఎదురు చూచుచుండుటయు తటస్థించి అతని తల్లి కిచ్చిన వాగ్దానము నాఁటితో నిండి
పోవుటచే యుధిష్ఠిరయాగసభాభ్యంతరమున తత్కృతాపరాధశత ముద్దాటించి స్వీయా
మోఘచక్రప్రయోగముచే అతని శిరశ్ఛేదము గావించి తదుద్గతదివ్యతేజమును సకల
సభ్యసమక్షమున తనలో లీనము గావించుకొనెను. ఇది ఎల్లరకు మహాశ్చర్యకారణమై
జన్మప్రభృతినిరంతరపాపకార్యనిర్వహణపరాయణత్వమే స్వభావముగా గల వాని కింత
ఉచ్చస్థితి నొసంగుట ఏమి భావ్యముగా నున్నదని విజ్ఞులు కూడ విస్తుపోయిరి.
ధర్మజుఁ డీవిషయమున నారదుని ప్రశ్నించి దద్దత్తప్రత్యుత్తరముచే మనస్సమాధానము
గావించుకొనెను.

ఇట్లే దంతవక్త్రునకు కూడ వైష్ణవశాపసంప్రాప్తదేహబంధము నుండి

విముక్తి ప్రసాదించి తన్నతో లీనము చేసికొని తన ఆర్తత్రాణ పరాయణత్వమును రుజువు చేసికొనెను.

ఇట్లు వైరభక్తితో పెనవైచుకొన్న మూడుజన్మములు ముగిసి హరిద్వారికులు నిజస్థానమునకు వెండియు వేంచేసిరి. మానవ కాలమానముతో చూచినచో ఇది లక్షలాదిసంవత్సరముల కాలపరిమితికి విస్తరించినట్లు గోచరించునే గాని వైకుంఠ కాలమానముతో చూచినచో ఒకక్షణమాత్రముగనే గోచరించును. ఆక్షణము కూడ విష్ణు వియోగమును సహింపలేక జయవిజయు లంతగా దిగులు పడి తమ అభాగ్యమును గూర్చి ఆక్రోశించిరి. మానవేతరము లగు ఊర్ధ్వలోకము లందలి మాధుర్య మంతటి దన్నమాట. అందులోను

"యద్గత్వా ననివర్తన్తే
తద్ధామ పరమం మమ॥" (భగవద్గీత - 15 అ. 6 శ్లో.)

అని భగవానుఁడు చాటుకొన్న వైకుంఠ మండలి అతిలోకమహనీయవితతమాధురీ సంగత మైన వైశిష్ట్యకలన మంత అనిర్వచనీయమైన దన్నమాట.

## 6. దాస్యభక్తి : కుబ్జావిభీషణాంజనేయకుంజరేంద్రులు

భగవంతుని ప్రభుస్థానమునందుంచి భక్తుఁడు అతనికి దాసుఁడై తన్నిరవద్యసేవాసామర్థ్యముతో తన్మనోనురంజన మొనర్చి తదనుగ్రహముతో గట్టెక్కుట దాస్యభక్తి యందలి పరమార్థము.

ఈ సంప్రదాయములో భక్తుఁడు నానాశాస్త్రపరిశీలనప్రాప్త పాండితీమండితుఁడైనను, అనధిగతవిద్యాగంధుఁడైనను ఒకటే. ఇచ్చట భగవంతుఁడు సర్వశ్రేయోదాయకుఁడనియు, తానాతనిని ఆశ్రయించి తన సకల శక్తులు కేంద్రీకరించి అతనిని కొలుచుకొన్నచో అతఁడు తన్నుద్ధరించుననియు నమ్మట ప్రధానము.

అసలేభక్తి సంప్రదాయమునకైనను, అమాటకు వచ్చినచో జీవితమందలి ఏరంగము నందైనను రాణింపవలెనన్నచో ప్రథమతో గ్రాహ్యమైనది నమ్మకమే అను మాటను విస్మరింపరాదు. విశ్వాసములేనివారిని విశ్వేశ్వరుఁడు కూడ ఉద్ధరింప లేఁడు.

మానవుఁడు కర్మాచరణమున కుపక్రమించుటకు గాని, వివిధ జీవిత రంగములలో అభ్యున్నతి సాధించుటకు గాని, పురుషార్థపరుఁ డను యశో వైలక్షణ్యమును సంతరించుటకు గాని సర్వేశ్వరునిచే అతని యధీనమందుంచఁబడిన సామగ్రి దేహేంద్రియమనోబుద్ధులు. ఇవి ఏవియు అపరిమితఫలప్రదములు కావు. పరిమితశక్తిసంపన్నము లైన ఇట్టి సామగ్రితో దైనందినజీవికాసముపార్జనమాత్ర ప్రయోజనమును సిద్ధింపఁజేసికొనుటయే అంతంత మాత్రము. పైఁగా ఇవన్నియు కాలగమనములో అనారోగ్యచిహ్నకృశీభూతములై వార్ధకాదిదుర్లక్షణకంపితప్రకంపితములై వినాశోన్ముఖముగా పయనించునవే గాని క్షణక్షణసముద్దీప్తసమధికోత్సాహనైరంతర్యముతో నెసలారునవి కావు. వీని నన్నిటిని కొంతలో కొంత క్షేమస్థైర్యాభిరామములుగా తీర్చిదిద్దుకోవలె నన్నచో శ్రీరామరక్షగా నుపయోగపడునది భగవచ్ఛరణాగతియే.

ఈ విశేషమును శాస్త్రాధ్యయనముతో నిర్ణయించి గాని, జన్మాంతరసమాగతశుభవాసనాపౌష్కల్యముతో నిర్ణయించి గాని జీవితారంభ దశలో కొంతకాలము స్వశక్తిపై నాధారపడి ఏవేవో లౌకికభోగభాగ్యసంపత్ప్రకరములకై ప్రాకులాడినను అచిరకాలముతోనే అందలి అస్థైర్యమును, అచారితార్థ్యమును, అప్రయోజకత్వమును గుర్తించి ఇఁక స్వసంక్షేమసముపార్జనమునకై భగవత్పాదారవిందనిరంతరాశ్రయణరూపనిర్ణయమే శరణ్యమని నిగ్రహోపాత్తనైర్మల్యకల్యాణకల్యమైన మనోవిభూతితో నిశ్చయించి అంతటి నుండియు తద్దిశాప్రస్థానమునకు నడుము కట్టును. ఇట్టి నిర్ణయముతో భగవదనుగ్రహపాత్రులైన మహనీయులు కుబ్జావిభీషణాంజనేయకుంజరేంద్రాదులు పెక్కురు గలరు.

వీరిలో కుబ్జ స్త్రీ. విభీషణుఁడు రాక్షసుఁడు. ఆంజనేయుఁడు శాఖామృగ సార్వభౌముఁడు. కుంజరేంద్రుఁడు చతుష్పాత్తు.

కుబ్జ :

ఈమె మథురానగరమున ఒక పుష్పలావికగా జీవితమును కొనసాగించు కొనుచు కర్ణపరంపరాసమాయాతవాసుదేవభగవదనంతలీలావైభవాతివేలహేలాలాలిత్యము

నవగాలము చేసికొని భౌతికముగా నేపని చేయుచున్నను మనస్సులో మాత్రము నిరంతర హరిచరణపరిచర్యాపరిణతికి పాల్పడెను.

పాప పూనె నలుగురిలో తిరుగుటకు కూడ ధైర్యముగా రాఁ గలిగిన స్థితి గలది కాదు. శారీరకముగా ఆమె బహువికృతస్వరూపిణి. దానికి తోడు తానట్టి వికృతాకారముతో జనలోచనజ్వరకారిణి అయినట్లు కూడ తెలిసికొని తనలో తానె అపరిమితసంతాపవేదనానాగరకల్లోలముంలో మునిగితేలుచు ఉక్కిరి బిక్కిరి యగు చుండెడిది. ఆమె మనస్విత అనిర్వచనీయమైనది కనుక సాధారణపుస్త్రీలావికోచిత ముగా నెవరితోను ఎట్టి సరసప్రసంగములకు దిగెడిది కాదు. ఎల్లప్పుడు అవిదిత స్వీయజన్మాంతరపాపసంక్రాంతిచే తన కీజన్మము నందిట్టి అసుభగస్వరూపము సిద్ధించి నది గదా యని లోలోన కుమిలి ఏడ్చుచు మూరిపముగా నెవ్వరితోను ముచ్చట లాడక ముప్పముడిగి యుండెడిది.

అట్టి స్థితిలో ధనుర్యాగసందర్శనమునకై ప్రధానాతిథిగ కంసునిచే ఆహ్వా నింపఁబడి శ్రీకృష్ణభగవానుఁడు మధురానగరమునకు వేంచేయుచున్నాఁడని ఒక శుభ వార్త జనకోలాహలసమానీతమై ఆమె శ్రవో వివరమున ప్రవేశించెను. వెనువెంటనే ఆమె మనస్సాగరములో ఒక వినూత్నమహోల్లాసవీచిక తాలోత్తాలముగా సముత్థిత మయ్యెను. అది మాత్రము పైకి పొక్కనీయకుండ ఎప్పటి వలెనే తన పనిలో తాను నిమగ్నమైనట్టు కనబడుచు "ఆహా! అతివేలసౌందర్యరాశి యగు వాసుదేవుఁడు ఈ మధురానగరములో ఎప్పుడు ప్రవేశించి నిజపదకంజయుగస్పర్శచే పీతన్నగరలక్ష్మి లతాంతను అణువణువున పులకింపఁ జేయునో కదా! మునిజనమానస్సరసీరుహభ్రమర సార్వభౌముఁడగు యాదవకులచక్రవర్తి హలకులిశాంకుశచక్రాదిభాగ్యచిహ్నచిహ్నిత స్వీయచరణనిక్షేపముచే ఈమధురానగరము నెప్పుడు పావనము చేయునో కదా! అమందమందహాసచంద్రికాసుందర మగు ముఖచంద్రబింబముతో గోవిందుఁ డెప్పుడు మధురానగరప్రజానయనచకోరములకు పరమోత్సవకారి యగునోగదా!" అని యిట్లు పరిపరివిధముల గోపికాహృదయమహోత్తుంగశిలోచ్చయనిరంతరవిహారహారి యగు శౌరివారణేంద్రుఁ డెప్పుడు ధీరధీరముగా మధురాపుటభేదనవీధీవిహారలీల కుపక్రమిం చునా యని ఆముకుందుని రాకకై ఎదురు తెన్నులు గాంచుచు వీథులలో యత్నించి

గోపసంక్రాంతమైన కలకలము చెలరేగినప్పుడెల్ల జలజదళాక్షుని ఆగమన శుభా సంభవించెనేమో యని అత్యాతురమేదురాంతరంగముతో ఎదురు చూచుచు విషయాంతరమైన అంతరంగమును ఆ యనంతశయనుని సుఖవాసమునకు గావించుచు భక్తిబంధురతీవ్రాభినివేశముతో చీమచిటుక్కుమన్న శ్రీమహిళా రుని చిన్మయదర్శనభాగ్యరేఖయే ఆమతిల్లెనని అశాంతసమాలోకనవ్యగ్రచేతస్క నన్నంతలో ఆమె పూర్వపుణ్యములు పండి హఠాత్తుగా అబ్జాక్షుఁడు సంసార కు సామజసార్వభౌముఁడై కంసాధిష్ఠితమధురాపురోపకంఠమున మధుర రణవిన్యాసవిహారక్రీడావినోదియై విచ్చేసెను.

ఎప్పటి నుండియో ఆపుండరీకాక్షుని ఆగమనమునకు తహతహలాడుచున్న రంగముతో కుబ్జ ఎదురు చూచుచున్నను ఆసమయమునకు మాత్రము నిజ కరవక్రతావిపాకవిశేష మంతకంతకు స్మృతి పథమున గోచరింప అతి భయ దేహమందేహవిజృంభణదందహ్యమానహృదయపర్యాకులయై కించుదనముతో కొని పోయెను. కాని భక్తజనహృదయకాసారరాజహంస యగు నాకంస మె అనాది సంసారమును ధ్వంసము కావింప కృత నిశ్చయుఁడై అనుగ్రహ పరవీక్షణవిభావరీశ్వరప్రభాబాహుళ్యముతో ఆమె మనఃకుముదవనమును శతధా గా వికసింపఁజేయుచు తదంతికమున కేతెంచెను. అట్లయాచితముగా సమీప న సరోజాక్షుని సాన్నిహిత్యముచే సంభ్రమాశ్చర్యసమ్మోదవీచికావితానోత్థ పొంగెత్తిన హృదయసాగరము ఆమెను పరమపారవశ్యలీలావైభవమునకు చతుర్దశభువనభవనస్తంభాయమానుఁడగు అంబోజాక్షునకు పరమనిరర్థక యగు నేను ఏమికానుక ఇచ్చి ప్రత్యుత్థానము గావింపఁగలనా యనీ కల పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో భక్త్యుపహితమైన ఏలఘు ఉపాయనముగా నొసగినచో ఆ అణువునే బ్రహ్మాండముగా స్వీకరించి ఆ దభాండోదరుఁడు పరమబ్రహ్మానందలీలాపారవశ్యమును భక్తసమూహ్యము గావించునట అని వారును వారును అనుకొనుచున్న మాటలను జ్ఞప్తికి తెచ్చుకొని పూలచెండును సభక్తికముగా, ఆసర్వేశ్వరునకు సమర్పించి భయలజ్జావినమ్ర మై తత్పాదమూలనిక్షిప్తనిజేక్షణయై నిలచెను. అదృష్టదేవతాదరహాసోపస్కృత కనప్రసార మెవరిపై ఎప్పుడు వెల్లివిరియునో ఎవ్వరు చెప్పగలరు? సకల

ప్రీతిహృదంతరప్రత్యగాత్మ యగు నాపరాత్పరుఁడు ఆమె నయవినయభయలజ్జాసంభ్రమాదిక కృతావయవభావలహరీమహోల్బణమును గుర్తించి సానుగ్రహకరపల్లవప్రసారముతో నామె ననుగ్రహించి తద్రూపవికృతికి నిష్కృతి ప్రసాదించి అలోకసామాన్య సౌందర్యలక్ష్మీవిభవసంపన్నురాలినిగా తీర్చిదిద్దెను.

"స మే భక్తః ప్రణశ్యతి" (గీత - 9 - 31 శ్లో) అను భగవద్వాక్యము పట్ల అక్షరశః ఇట్లు సార్థకమైనది.

## విభీషణుఁడు :

ప్రహ్లాదుఁడు హిరణ్యకశిపుని పుత్త్రుఁడుగను, విభీషణుఁడు రావణుని తమ్ముఁడుగను రాక్షసజాతిలో తప్పపుట్టిరి. రాక్షసులకు విష్ణువుతో జాతివైరము బలముగా నుండగా వీరిరువురకు నద్ధ సఖ్యమేర్పడుట విశ్వమున గోచరింప వింతలకే వింత. నాఁటి ప్రహ్లాదుని యునికి హిరణ్యకశిపున కెంత కంటకముగ నుండెనో నేఁటి విభీషణుని యునికియు రావణున కంత కంటకముగ నుండెను. తత్త్వజ్ఞుల ఉనికి అతత్త్వజ్ఞుల మనికికి సమస్యగా పరిణమించుట సహజమే కదా!

ప్రపత్తి సిద్ధాంతమునకు వైష్ణవభక్తిసంప్రదాయమున ప్రాణప్రతిష్ఠ చేసిన ఘనత విభీషణునిది. లంక మొత్తములో ఇంటింట రాక్షసులు వేదాధ్యయనాగ్నిహోత్రసమారాధనాదివిహితకర్మములు గోచరించి వారి అభ్యున్నతికి సూచకములుగా నున్నను "యథారాజా తథా ప్రజాః" అన్నట్లు రావణుని అధర్మముతో పరస్త్రీపరపీడనాదిదుష్కృత్యములతో పాటు హరిద్వేషదావానలసంధుక్షణము కూడ వారి పతనమునకు సద్యోహేతువులైనవి. వారి నడుమ విభీషణుఁడు గంజాయితోటలో మొలచిన తులసిమొక్కయై మోక్షవాసనలు గుబాళింపఁజేయుచు, నమ్మి ఆశ్రయించినచో రాక్షసజాతి కంతకును అసదృశమైన రక్షణము ననుసంధింపఁగలిగి యుండెను.

ఈశ్వరుని నమ్మి చెడినవాఁడు లేఁడను సూక్తికి విభీషణుని జీవితము ప్రత్యక్షనిదర్శనము. తమోదూషితమైన రక్షోవంశములో సత్త్వసంపన్నుఁడగు విభీషణుఁడు జన్మించుట ఆ జాతి కెంత అదృష్టమో అతనిహితోపదేశము లాలింప

కుండుట రావణాసురుని కంతటి దురదృష్టము. నిరంతరపరాంగనాపరిక్లేశపరాయణుఁడగు రావణుఁ డెప్పుడు సీతాపహరణ మొనర్చెనో అప్పుడే అతని అధ్యాయము పూర్తియైనదని గుర్తించి విభీషణుఁడు అది లంక కంతకును చేటగునని ఎంతచెప్పినను వినిపించుకొనక ఇతఁడేవేవో కారులు పేలి పరదారాపహరణము దానవజాతికి స్వధర్మము, సుధర్మము అని తన్ను తాను మభ్యపెట్టుకోఁజూచెను. కాని ఇంతలో శరధిబంధనపూర్వకముగా దాశరథి లంకాసమీపగతుఁడగుట తెలిసికొని వేడిపుట్టిన రాక్షసరాజు మంత్రిపురోహితాదిసుహృన్మండలము నాహ్వానించి సభ దీరి కర్తవ్యమును గూర్చి చర్చింప దొడంగెను. "అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః" (రామా. అరణ్య. 37 స 2శ్లో.) అన్నట్లు అందఱు తమశక్తిసామర్థ్యముల పరిమితి ఎంతో లోలోన తమకు తెలిసియు పైకి బింకము చూపి మేకపోతు గాంభీర్యముతో ఇంతవార మంతవార మగు మేముండగా నీవొక్క మానవుని గెలుచుట ఏమి లెక్కయని ప్రియవాక్కులతో రాజును యుద్ధమునకు ప్రోత్సహించుచుండగా హితవాక్కులతో విభీషణుఁ డొక్కఁడు మాత్రము వారి నెల్లరను ప్రతిఘటించి రామబాణమహత్త్వప్రతిపాదనపురస్సరముగా అలనాటి సీతాపహరణదుష్కృత్యమును ఉపసంహరించుకొని శ్రీరామశరణాగతి ఆచరించుట ఒకటియే బ్రతుకును బాగుపరచుకొనుటకు మార్గమని ఉపదేశించెను. హాసరూపమైన కోరలతోను, పంచాంగుళీ రూపమైన శిరః పంచకముతోను సీతాదేవి ఒక కాలసర్ప మనియు ఆ కాటు నుండి తప్పించుకొనుటకు రాముని శరణు చొచ్చుట కన్న మార్గాంతరము లేదనియు, ఇప్పుడు వీరము లాడిన రాక్షసు లందఱు రామనిశాతశరాగ్రభిన్నశరీరులై క్షణములో యమపురి కేగిన పిదప విచారించి లాభము లేదనియు కఠోర మగు సత్యమును నాతికఠోర మగు భాషలో పొదిగి ఆ సభా మధ్యమున నావిష్కరింపగా చేటుకాలము దాపురించిన రావణుఁడా మాటలను పెడచెవిని పెట్టి విభీషణునకు భ్రాతృద్రోహము, రాజద్రోహము అంటగట్టి చరణాఘాతపూర్వకముగా పరమపరాభవము పాలు చేసి నీదిక్కున్న చోటుకు పొమ్మని తరిమి కొట్టెను. విభీషణునకు నాఁడే కాక జన్మప్రభృతి రాముఁడే దిక్కు. జన్మాంతరాయాతభక్తివాసనాపరిపాకవిశేషముతో పండబారిన ఆతని హృదయము అవివేకి, అహంకారి, ఆత్మద్రోహి అగు నగ్రజుని అనుచిత చర్యచే నొందదారి అదూర భవిష్యత్తులో సంభవింపబోవు రక్షోన్వయ సమూల వినాశనమునకు వగచుచు రాక్షసరాజ్యమును విడిచిపెట్టెను.

గృహారామక్షేత్రాదిసంపదలు, దారాపత్యాదికుటుంబవ్యవహారములు అభిజన పరిత్యాగాదిదుఃఖావహసన్నివేశములు - ఇవి ఏవియు విభీషణుని అంతరంగమును బంధింపజాలక పోయెను. అతని మనస్సంతయు రామరామేతిశబ్దనవనీతభూషితమై తల్లి, తండ్రి, గురువు, దాత, దైవము అన్నియు రాముఁడే అను భావము మనస్సు నంతకంతకు రామసాన్నిధ్యమునకై త్వరపెట్ట పంకిలవేశంతనివాసము నేవగించుకొను రాజహంస వలె తద్రక్షస్సాన్నిహిత్యమును అసహ్యించుకొని మోక్షప్రదాత యగు రాముని నాశ్రయించుటలో క్షణ మాలసించినను యుగముగా భావించుకొని తల్లి ఒడినుండి విడి వడిన బిడ్డ మరల తల్లిని జేరుటకు కలవరించి పలవరించు వెరపున తచ్చరణ రజోలేశ విభూషితమస్తకత్వము తనకెప్పుడు సంప్రాప్తించునా అని తహతహలాడుచు సకల సాంసారికసంపద్బాహుళ్యమును నరకముగా పరిగణించి ఇంద్రియములతోను, మనస్సు తోను, బుద్ధితోను, రామాశ్రయమునే అపరిహార్యముగా అభిలషించుచు ధర్మాదిపురు షార్థచతుష్టయము పరంధాముఁడగు రామునితోనే ముడిపడి యున్నదని గుర్తించి హారామా! నీవు తప్ప నా కీలోకములో దిక్కు వేరు లేదని ఆక్రందించుచు, ఆక్రో శించుచు, ఆరాటపడుచు ఆకాశగమనమున రఘురామస్కంధావారమును సమీపించి తన ఇష్టదైవ మగు రాముని శరణు జొచ్చెను.

పరమశరణాగతిపూర్వక మైన విభీషణుని ఈ చర్య దాస్యభక్తికి తలమాని కము వంటిది. దైవము పరీక్షించియు, తాను దాసుఁడననియు భావించి తత్సేవయే జీవితమునకు పరమావధిగా పరిగణించి తదనంతరఫలమాశించి ఒక్క తలఁపు తల యొగ్గక భగవత్సాన్నిధ్యమును మించిన ప్రాప్యవస్తువరేణ్యము వేరొండు లేదను దృఢ నిశ్చయముతో అగతికుఁడై భోగాభిలాషను శాశ్వతముగా తెరపించివైచి భగవదాజ్ఞాను పాలనమే పరమ కర్తవ్యముగా స్వీకరించి అతులితవిశ్వాసకఠోరతకు పెట్టని కోటగా నమపడిన మనస్సునకు భగవద్దాస్యము సొగిరముగా సమకూర్చి అపశ్చాత్ప్రసారిత దృగ్దేశుఁడై క్లేశములకు లేశమేసియు వెరవక పురోగమించిన విభీషణుని భక్తిబంధుర శీలమాధుర్యము తదనంతరభక్తుల కెల్లను శిరోధార్యము.

## ఆంజనేయుఁడు :

అశేష భక్తలోకమునకు ఆరాధ్యమూర్తి యగు ఆంజనేయస్వామి పెక్కు-

మూర్తులతో లోకమున ప్రసిద్ధుఁడై యుండెను. వానితో దాసాంజనేయస్వామి అని కూడ ఒక మూర్తి భేదము కలదు. వీరాంజనేయ, భక్తాంజనేయ, సల్త్వాంజనేయ ప్రభృత్యనేకమూర్తి భేదములు, ప్రసన్నాంజనేయ, శ్రీ ఆంజనేయ, పంచముఖాంజనేయ మున్నగు మహామంత్ర విశిష్టములైన విశిష్టాకృతి భేదములు ఎన్నియో కలవు.

అయన్నిటిలోను దాసాంజనేయస్వామి ఆంజనేయుని నిజతత్త్వావిష్కార సమర్థమైనది.

నంది, గరుత్మంతుఁడు, శేషుఁడు మున్నగు భక్త గణములో ఆంజనేయస్వామి ఒకఁడు. నంది కైలాసవాసుఁడగు పరమేశ్వరునకు వాహనసేవ ఒనర్చుచు తన జన్మము సార్థక పరచుకొనెను. ఇట్లతఁడు దాస్యభక్తికి ప్రతీకగా నిలచిన మహనీయుఁడయ్యెను. గరుత్మంతుఁడు వైకుంఠవాసుఁడగు విష్ణుభగవానునకు వాహనసేవ ఒనర్చుటలోను, శేషుఁడు ఆ వాసుదేవునకే పర్యంకసేవ పరికల్పించుటలోను తమ జీవితముల కెనలేని సార్థక్యము నాపాదించుకొనిరి. వీరందరు దాస్య భక్తులే.

ఇట్లే ఆంజనేయస్వామియు శ్రీరామునకు దాసుఁడై తన్నిరంతరచరణపరిచర్యాసమాచరణముచే నిజపావనజీవనసస్యమును సమృద్ధిగా పండించుకొనెను. అట్టి దాస్యాచరణముచే హనుమంతుఁడు రామదాసు అని బిరుదు పట్టమును పొందెను.

భగవంతునకు భక్తుఁడు దాస్యము చేయుట సర్వత్ర దృశ్యమానముగ విశేషమనుటలో సందేహము లేదు. కాని భక్తానుగ్రహపారీణమైన అనుపమకృపాపరిపాకముచే భగవంతుఁడే భక్తునకు దాస్యము చేసిన ఘట్టములు కూడ ఇతిహాసప్రసిద్ధములై గోచరించుట కద్దు. శ్రీకృష్ణుఁ డిట్టి అసాధారణస్థితికి ఉదాహరణీయుఁ డయ్యెను.

యుద్ధాలను నివృత్తికరించుకొని రాజుల నడుమ దూత కృత్యము నిర్వర్తించిన రాజకీయవేత్తలు చరిత్రలో పెక్కుమంది గలరు. నలుఁడు, ఆంజనేయుఁడు, అంగదుఁడు, సాత్యకి, శ్రీకృష్ణుఁడు, సంజయుఁడు మున్నగాగల పెక్కుమంది దూతలు గోచరించుచున్నను ఆంజనేయస్వామికి రామదూత అనియు, శ్రీకృష్ణునకు

పాండవదూత అనియు బిరుదనామములుగా నేర్పడుట వింత యగు సంఘటనముగాఁ దోచును. అందులోను హనుమంతుఁడు రామభక్తుఁడే అగుటచేతను ఆరామునకే దూతకృత్యము నిర్వర్తించుటచేతను అతనికి రామదూత అని పేరు వచ్చినను విస్తారము లేదు. కాని శ్రీకృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడు. ఆతని భక్తులు పాండవులు. ఆ పాండవులు దూత కృత్యము నెఱపి పాండవదూత అనిపించుకొనుట అమేయానుగ్రహవైభవాతిరేకమునకు సాకిరి కాక తప్పదు. ఆతఁ డెవరినో ప్రేరేపించి అతనిలో తన శక్తి ప్రవేశపెట్టి అతనిచేత దౌత్యము నడిపింప వచ్చును. కాని స్వయముగా నాతఁడే అందుకు పూనుకొనుట చూడ ఇది అంతయు ఆతని దయ గాక మరి యేమి ?

"శ్రీరామదూతం శిరసానమామి", అని భక్తులు భక్తగణములో నెల పరమభక్తాగ్రేసరుఁ డగు నాంజనేయుని కొలుచు చుందురు. "బుద్ధిమతాం వరిష్ఠమ్" అని హనుమంతుఁడు అత్యంత సునిశితశేముషీధౌరంధర్యమునకు సజీవోదాహరణముగా పేర్కొనఁబడి తాను స్వయముగా సేవకుఁ డయ్యును అసంఖ్యాకు లగు సేవకులకు సేవ్యుఁడై విరాజిల్లెను. సామర్థ్యములో అతఁడేమైన సామాన్యుఁడా అనుకొన్న గోష్పదీకృతవారాశియు, మశకీకృతరాక్షసుఁడును, అక్షపాప్రాణాపహర్తయు, లంకా భయంకరుఁడును, "న రాక్షససహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్" (రామా సు. 42 సర్గ. 10 శ్లో॥) అని స్వయముగా ప్రకటించుకొన్న ప్రతిభ పీర పరాక్రమశాలియును ఆయి రామాయణమహామాలా మణిగా జగదేక ప్రసిద్ధుఁడైన మహామహుఁడు. సాక్షాత్ఫాలాక్షునిచే "విభీషణాయ రామేణ ప్రోక్తోమంత్రం చ యత్పురా" అని పార్వతీదేవి కుపదేశింపఁ బడిన హనుమత్కవచమహామంత్రరాజమునకు అధిష్ఠానదైవమై విలసిల్లిన అసాధారణమహిమసంపన్నుఁ డగు మహనీయుఁడు.

అంతటి వైశిష్ట్యము సంతరించుకొన్న ఈ హనుమంతుఁడు తనకు పరదైవముగా సేవ్యమూర్తియై సాక్షాత్కరించిన శ్రీరామచంద్రభగవానునకు పెక్కువిధము లగు సేవలు చేయుటే గాక నిరంతరము తచ్చరణాంబురుహాంతికమున ముకుళీకృతకరకమలుఁడై దాపన్మాత్రముతోను తృప్తి చెందక తచ్చరణసంవాహనకేళీలాలసుఁడై తత్పదకుశేశయరజస్సమలంకృతమస్తకుఁడై ఆనందసుధావారాశితరంగతరంగితాంతరంగుఁ డయ్యెను.

శీతాంశుశేఖరునకు వాటిల్లిన ఈ చిక్కును శ్రీవల్లభుఁ డిట్లు విడదీసి సంతసే: సదాశివుఁడు ముదబ్ధిసాంయాత్రికుఁడై అసాధ్యు లగు నీ ముగ్గుర రక్కసులను మట్టుపెట్టవలె నన్నచో అసాధారణప్రయత్నమునే ఆశ్రయింపక తప్ప దని పరమశివుడు భూమిని రథముగను, చతుర్వేదములను హయచతుష్టయములుగను, సూర్యచంద్రులను తద్రథచక్రములుగను, బ్రహ్మదేవుని సారథిగను, మేరుపర్వతమును విల్లుగను, సముద్రమును అమ్ములపొదిగను, శేషుని నారిగను, శేషశయనుఁ డగు శ్రీమన్మహావిష్ణుని బాణముగను గావించుకొని తాను రథియై ఇట్లు అప్రతిరథసమరసన్నాహదోహలుఁడై త్రిపురాసురులపై దండెత్తి అతికఠోరహుంకారమిశ్రితాట్టహాసమహాఘోరసంరావనిర్భిన్నబ్రహ్మాండభాండుఁడై త్రిపురాసురులను, తత్పరివారమును తత్పురత్రయమును క్షణార్ధమున భస్మీపటలము గావించి జగద్విపన్నివారణప్రవణుఁ డయ్యెను.

అప్పుడు శివుఁడు మహానందకందళితహృదయారవిందుఁడై నందనందను నవలోకించి గోవిందుఁడా! ఈ సందర్భమున నీవు కావించిన సేవ వర్ణనాతీతము. నీ ఋణమును నే నెట్లు తీర్చుకొందును? కనుక భావియుగవర్తిష్యమాణరావణసంహారఘట్టమున నీవు రాముఁడవై జనించినపుడు, నేను ఆంజనేయుఁడనై ఆవిర్భవించి, నీకు దాస్యము చేసి కొందునని వాగ్దానము గావించెను.

ఏతదకుంఠితవాగ్దానఫలముగా నావిర్భవించిన వానరసార్వభౌముఁ డగు పావని పావనసేవ చేసికొనఁ బూనుచు రామకార్యపరిపూర్తికి స్వీయసమస్తశక్తిసంతానము నొసఁగి ఆ ఋణము దక్క జగన్నుతిపాత్రుఁ డయ్యెను.

ఇట్లు భగవంతునకు దాస్యము చేసికొనుటకే అవతరించిన పవమాననందనుఁడు తన యవతారమునకు మూలపురుషుఁ డగు పరమేశ్వరుఁ డెల్లప్పుడు శ్రీరామనామజపానుసంధానమానసుఁడై యుండుటచే తద్వాసనావాసితాంతఃకరణుఁ డగు హనుమంతుఁడు కూడ జనకతనయాప్రాణేశ్వరపాదారవిందపరివస్యాపరాయత్తచిత్తుఁడై రామనామామృతనిరంతరాస్వాదమోదమానమానసుఁడై ప్రతిఫలవాంఛారహితముగా స్వీయమహిష్ఠయదేవతాదాస్యక్రియాసమున్మేషమున కుపక్రమించి పుట్టింప, పెంప, త్రుంప తగ పరదైవ మగు రాముఁడే ఉద్ధాముఁ డనియు తాను నిమిత్తమాత్రమే

అనియు నిశ్చయించి ఫలాఫలపరిసంగభంగీసమాలింగితము కాని అంతరంగముతో స్వహిత కర్మాచరణమునకు పూనుకొని సాగరలంఘనాద్యసాధారణమహాకార్యనిర్వహణధౌరేయ మగు నమేయనిశ్చయముతో లంకాప్రవేశము తన్నగరలక్ష్మీవిమర్దనము, పురాంతఃపురాలోకనము, అశోకవనాన్వేషణము, వైదేహీసందర్శనము, రామసందేశశ్రావణము, సీతాసందేశశ్రవణము, రామాంగుళీయకప్రదానము, సీతాశిరోరత్నప్రతిగ్రహణము, అశోకవనభంజనము, అక్షాద్యసద్యఃకరక్షోవక్షోవిదారణప్రవిదారణవిజయలక్ష్మీకరగ్రహణము, రావణతిరస్కారము, విభీషణపురస్కారము, లంకాదహనము ఇత్యాది లోకస్తుత్య కృత్య నిర్వహణము అవలీలగా నాచరించి [illegible]వర్ధమాన రామానుగ్రహశుభావలోకనమందారమాలాసమలంకృతవక్షస్కుడయ్యెను.

ఆంజనేయుడు నిత్యబ్రహ్మచారి యగుటచే ఆతని చర్య లొక్క శృంగారము దక్క తక్కిన రసము లన్నింటికి నాస్పదములై విద్వన్మనోజ్ఞము లగుచు కంధి సముత్తరణమున వీరరసము, జానకీ సందర్శనమున కరుణ రసము, అంతరాయతిరస్కరణక్రియాసామర్థ్యప్రదర్శనమున అద్భుతరసము, ప్రహరింపబోయి నిత్యజాగరుకుడును, సమయోచితరాజతంత్రకుశలుండును అగు తన వివిధ చర్యలచే పరిహరణపాత్రులగు రక్కసుల ప్రముక్కడితనము నావిష్కరించు పట్టున హాస్యరసమును, ఉద్యానవనసమరకేళీవిలాసవిహారవైయాత్యమునను చిత్రవిచిత్రచంక్రమణలీలాసమాస్ఫాలితరక్తస్రవదమోపద్రవనిగుంభనమునను రౌద్రభయానకబీభత్సరసములును, అనవరతశ్రీరామనామస్మరణలీలాపారవశ్యమును చిత్రగించు పట్టున శాంతరసమును - ఇట్లు ఆ మహామహుని జీవితము సర్వరసోపస్కారశోభితమై, రసజ్ఞహృదయసమాకర్షణప్రశస్తమై ఘనమహనీయ మగుచు.

సీతాపహరణానంతరము లక్ష్మణసహితుడైన రాముడు తదన్వేషణాయత్తుడై అఖిలప్రదేశములను అవలోకించుచు దారిలో ఋష్యమూకాద్రికి వచ్చి వాలి పరాభవభీతుడగు సుగ్రీవునిచే వారెవరో చూడ వలసినదిగా పంపబడి నప్పుడు భిక్షువేషములో వారిని సమీపించిన హనుమంతుని వాక్చాతుర్యాదివిశేషములను, తదనుగతవ్యాకరణాద్యంగసహితనానానిగమవిద్యాసారమును శ్రీరాముడే స్వయముగా మెచ్చుకొనుటలో ఆంజనేయుని అనితరసాధ్యవిద్యాపరిశ్రమాధిక్యము ప్రపంచమునకు ప్రత్యక్ష.

ప్రైతది. ఆ విషయముగా ప్రత్యేకపూర్వాలోకనములోనే భగవద్దైవముచే ప్రత్యక్షముగా ప్రశంసింపఁబడిన పరమేశ్వరావతారస్వరూపుఁడగు వానరకులోత్తంసుని అతిలోకమనీషామాతిశయము, సర్వథా, సర్వదా విద్వత్ప్రశంసార్హమైనది. పిదప సీతాన్వేషణ ఘట్టములో శత్రుదర్శితసాగరలంఘనసమున్నతప్రతాపసామర్థ్యసమున్మేషము నరులకు, వానరులకు మాత్రమే గాక సురలకు సురాధిపులకు కూడ పరమ ప్రశంసాపాత్రమై రామకార్యనిర్వహణసన్నివేశమునఁ అతని విజ్ఞతిరస్కారదగ్ధపుణ్యప్రాబల్యములు వేత్తృజనవందనీయము లైనవి. పిమ్మట లంకాప్రవేశము, లంకిణి నెదుర్కొనుట మొదలుకొని లంకాదాహపర్యంతము ఘటిల్లిన అఖిలసంఘటనములలోను హనుమంతుని చర్యలు హనుమంతునకు దప్ప అన్యులకు సాధ్యములు కావను విషయము విశదీకరించుచునే యున్నవి.

సీత జాడ చూచి రమ్మనెనే గాని రావణునితో తదాస్థానమున బలప్రదర్శనము చేసి రమ్మని రాముఁడు చెప్పలేదు. కాని హనుమంతుఁడు రామాదేశమున కంటె అతిరిక్తముగ వనభంగాదిచర్యలు పెక్కులు గావించెను. అన్నియు చేసి వెనుదిరిగి సీతా సందేశము రామునకు వినిపించునపుడు రావణునెదుర్కొనుమని నేను చెప్పితినా అని రాముఁ డాంజనేయుని ప్రశ్నింపలేదు. ఎందుకనఁగా ఆంజనేయుని పరేంగితావగాహిత్వము, దౌత్యనిర్వహణ ప్రతిభాపరిపాకము, సమయోచితప్రజ్ఞాప్రదర్శితపాటవము, వివిధశాస్త్రసమాలోకనపాండితీప్రకర్షము మున్నగున వన్నియు వ్యక్తమగుచున్నవి. జరుగబోవు రామరావణసంగ్రామమును దృష్టియందుంచుకొని రామశత్రువగు రావణుని బలమెంత యున్నదో, ఏమి చూచుకొని అతఁడు సీతాపహరణరూపమైన అకార్యమున కొడిగట్టెనో తెలిసికొనుట దూత కర్తవ్యము. దూత లక్షణమునే దాన్ని మించి యున్నది హనుమంతుఁడు నిర్వహించిన ఈ అదనపు కార్యభారములో అతని దాస్యభక్తి అతిలోకసుందరముగా ఆవిష్కృతమైనది. స్వప్రాణహానియందైన జంకుగొంకులను లేవీయక స్థానబలములేని శత్రురాజ్యములో అతఁడింత అసహాయుఁడై విజృంభించుటకు రామభక్తియే ప్రేరకము, స్ఫూరకము, కారకము.

పిమ్మట సేతునిర్మాణానంతరము ససైన్యుఁడై రాముఁడు లంకను ప్రవేశించిన పిదప యుద్ధమునను సర్వసన్నద్ధుఁడై యున్న తరి విభీషణుఁడు ఆకాశ

గమనమున రామశరణార్థియై సుగ్రీవస్కంధావారమును ప్రవేశించినప్పుడు [illegible] నితో కూడ ఎల్లరును వాని కాశ్రయ మిచ్చుట కొప్పుకొనక [illegible] రాముని హెచ్చరింప

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే" (రామా. యుద్ధ. 18 [illegible])

"శరణం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ" (రామా. యుద్ధ. 18 [illegible])

అని పరంధాముఁడగు రాముఁడు భక్తజనమనోభిరాముఁడై [illegible] నిశ్చయము ప్రకటించు పట్టున దాస్యభక్తుఁడగు ఆంజనేయుఁడు [illegible] భక్తుఁడగు విభీషణున కాశ్రయ మిచ్చుట సర్వోచితమని [illegible] తన సారప్రజ్ఞను ప్రదర్శించుకొనెను. అది మొదలు రావణవధపర్యంత [illegible] ఓషధిపర్వతాహరణము, కాలనేమి సంహారము, [illegible] గల సకల సాహసకార్యజాతములందును, హనుమత్ప్రజ్ఞావిశేషగాంభీర్యాది గుణసంపత్తి తద్విమల దాస్యభక్తిని గర్భీకరించు [illegible] మగు చున్నది.

## గజేంద్రుఁడు :

మోక్ష మనునది మానవునకే చెందిన సొత్తు [illegible] కద్దు. కాని ఏ ప్రాణి యైనను ఉత్తమసంస్కారపరిపాకభావమున్న భక్తితత్పరుఁడై యీశ్వరప్రపత్తిని పొంద గలిగినచో [illegible] యోగ్య మగునని పురాణేతిహాసకావ్యనాటకాదులు నిరూపించు చున్నవి. [illegible] నిష్కళంక భక్తిపరిపాకముతో శివసేవ చేసికొన్న నాలుగు [illegible] తిన్నఁడు మొదలగువారు మోక్షము నొందినట్లు శ్రీకాళహస్తి మాహాత్మ్యము [illegible] మిచ్చు చున్నది. వీరిలో సాలిపురుగు స్వేదజము, [illegible] సరీసృపము. సామజము జరాయుజము, మృగము. [illegible] యైనను నాగరకుఁడు కాఁడు. మరి సుకుమారసంస్కారము [illegible] ఆటవికుఁడు. ఈ సన్నివేశము నుద్దేశించియే

శా. "ఏ వేదంబుఁ బఠించె లూత? భుజగం బే శాస్త్రముల్ చూచె? దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి చెంచేమంత్ర మూహించె? బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా? కావు! మీపాదసం
సేవా సక్తియె కాక జంతు తతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!"

(శ్రీకాళ. శ. 13ప.)

అని ధూర్జటి మహాకవి యీ ఆపంచలభక్తి ప్రాశస్త్యమును ప్రశంసించుచు ప్రాకృత ప్రపంచమును ప్రశ్నించుచున్నాఁడు. కనుక బోధావిర్భావనిదానములు చదువులు కావనియు భగవత్పాదసంసేవాసక్తియే యనియు స్థాపితమైనది.

ఈ విషయమునే భాగవతము కూడ గజేంద్రుని మూలమున ఋజువు చేయుచున్నది. గజేంద్రుఁడు చతుష్పాత్తు. దశలక్షకోటికరిణీనాథుఁడై స్వేచ్ఛా సంచారసముల్లాసియై దుష్ప్రవేశము అగు కాంతారసంతానములను నిజోపస్థితిచే మన్నించుచుండెను. అట్టి ఆ మాతంగమహాన్వయసమ్రాట్టున కొకప్పుడు దప్పి గొప్పగా దొప్పడి ముప్పు ముంచుకొని వచ్చెను. ప్రాణిలోకమున ఆకలి దప్పులు లేని దెవరు? ఇది యొక విశేషమా? కాని ఏసన్నివేశమును పురస్కరించుకొని సర్వేశ్వరుని సంకల్పము కల్యాణోన్ముఖముగా ప్రసరించునో ఎవరి కెరుక? కరేణుకాప్రాణేశ్వరునకు మోహజనకమైన దాహ మొదవి నంతనే నిజప్రాణేశ్వరీయూథముచే ననుగమ్యమానుఁడై విశాలవిపినవీథీవితానమును జలసంపాదనవ్యగ్రమతియై పర్యటించెను. సుదీర్ఘప్రయాణప్రయాసానంతర మొకచోట వికసత్పంకేరుహమకరందాస్వాదనమత్తమధుకరఝుంకారకోలాహలసంక్షోభమహనీయమైన సువిశాల కాసారము నేత్రానంద ప్రదాయకముగా సాక్షాత్కరించెను. అది కనినంతనే చిరకాలజలవాంఛ తరచర తీర్చుకో నార పైన యువకాల మొదవ నయుమ ప్రహ్లాదభాసురస్వాంతుఁడై నిజకాంత లతనిని వెంబడివచ్చి హ్రదము చొరఁగ తానును అందు ప్రవేశించి తుండాకృష్టజలప్రసారిత సుధాంభోమగ్నుఁడై సమ్మదోద్దండక్రీడల హాయిగా మెలఁగు సోత్సాహావసరమున అప్రతర్కితముగా కరిపాదము మకరముఖగ్రస్త మయ్యెను. ఒక్కసారిగా ఆనంద స్రవంతిప్రవాహవేగమునకు పెక్కులు కట్టుకొని వచ్చిన వర్వత మడ్డుపడినట్లయ్యెను. అయినను సముద్దండవేదండప్రకాండ మగుటచే ఒక్క యుదుటున మొసలిని జల

మధ్యమునకు త్రోసి వైచెను. కాని లిప్తకాలములో మకరంనది ద్విగుణీకృతతరబాహ్యాభ్యంత గమన ప్రచండమై మరల వచ్చి యథాపూర్వముగా తత్పాదము నిజదంష్ట్రాగ్ర నిక్షిప్త మొనర్చుచు సలిలాధః ప్రదేశమున కాకర్షించుటయు వికర్షణక్రియాలోలం బగు శుండాలము కరాఘాతదంతసంఘట్టనప్రముఖసమరక్రీడావిన్యాసవైవిధ్యముచే గ్రాహ ఘాతవిఘాత మొనర్చుటకు ఎంతగానో ప్రయత్నముఁ జేసి విఫల మయ్యెను.

ఇట్లు కరి మకరి సంగ్రామము వెయ్యేండ్లు ఘోరముగా సాగెను. పిదప పోరాటములో నీరాటమునకు బలము హెచ్చుటయు వనాటమునకు అంతకంతకు తగ్గుటయు తటస్థింపగా తాను స్వప్రయత్నముతోనే పురోగమింపఁ జాలినచో సుదీర్ఘమగు కలహానంతర మత్యగౌరవమైన ఓటమి నంగీకరింపక తప్పదని నిశ్చయించి కరేణుకావల్లభుండు సురవరేణ్యుం డగు పురుషోత్తము నచంచలభక్తియుక్తుండై నానావిధప్రార్థన సమదీనవచోనివేదితాత్మ సంతాపుండై వరివస్యానిపుణుం డయ్యెను. అయినను తన్ను రక్షింప నెవ్వరును ముందుకు రాకునికి వివేకులగు లోకు లెల్లప్పుడు ఉత్తమ లోకమ నగు వైకుంఠమని ధ్యానించుట వ్యర్థమేనా అను సందేహము కూడ కలిగి అసలు వాని నింతగా ప్రశంసింతు రగు పరమేశ్వరుని యునికినే శంకించి

క. "కలఁ డందురు దీనుల యెడఁ
గలఁ డందురు పరమ యోగి గణముల పాలం
గలఁ డందురన్ని దిశలను
గలఁడు గలం డనెడువాఁడు గలఁడో లేఁడో" (ఆం. మ. భాగ. 8 స్కం. 82

అని సందేహాందోళాయితస్వాంతుడై అంతులేని వేదనతో ఇంతింత యనరాని ఆశాం చిక్కి క్షణక్షణమునకు ధాతుక్షైణ్యమునకు గురి యగు చున్న తనదేహములో మందమం నియు బలస్థైర్యములు లేకపోవుట గుర్తించి తన అప్పటి యథార్థస్థితి నావిష్కరించు

శా. "లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!"
(ఆం. మ. భాగ. 8-

గ్రాహ అకుంఠితమకరదంష్ట్రాగ్రనిపీడితచేతస్కుఁ డయ్యెను. ఇఁక నిట్టియవస్థలో వేదవేదాంగాదిసకలశాస్త్రప్రతిపాదితమైన దివ్యశక్తి ఏమైన నున్నచో అది కదలి వచ్చి తన్ను రక్షింప వలసినదే కాని, లేనిచో తనకు మకరి చేతిలో మరణము తప్పు తక్కిన అభ్యుదయసంప్రాప్తికై కలలు గనుట పగటి కలలే కాఁగలవని పరమనిరాశాపరిపూరితహృదంతరుఁడై చిరోపాత్తశ్రీమత్ప్రపత్తిసహేంద్రియమనోబుద్ధియై దిగంతములందు నిజనీరసావలోకనలతావితానమును ప్రసరింపఁ జేయుచు మహాయాసక్లేశనిశ్శ్వాసము ప్రేక్షితాపేక్షాకార్పణ్యముచే దిగంతకాంతారవీథులను పరిమ్లాన మొనర్చుచుండ ఆ శివమానసుని ఆక్రందన ధ్వని "అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దాపల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలోత్పలపర్యంకరమావినోది" యను నాపన్న ప్రసన్నునకు కర్ణగోచరమై అభ్యర్ణరమావైనతేయవిష్వక్సేనాదిపరివారమునకు గాని, జయవిజయాదినిజపారిపార్శ్వకులకు గాని మాట వరుసకైనను ఏమియు తెల్పకయే శంఖచక్రాదిపరికరసంపత్తిని గ్రహింపక వివాదప్రోత్థితశ్రీకుచోపరిచేలాంచలం బైనను విడకయే, ఆకర్షికాంతరధమ్మిల్లము చక్కనొత్తకయే బ్రహ్మాండభాండములకేనో అనూహ్యమహావిపత్పరంపర సంఘటిల్లిన చాడ్పున గజప్రాణావనోత్సాహియై వైకుంఠనగరద్వారనిర్గమనపూర్వకముగా గగనాభోగపథప్రవర్తి యయి యుత్కారాసారనక్రప్రకల్ప్యోగ్రరుక్షోభకు సరియైన కరిపరిత్యాగ దుండెనో తత్కాసారతీరమున కనుచు పంపగా ఆపద్భారకుఁ డగు నాగారి నతపాయుని యను నరవిందా మహాదేవియు నాతని వెనుక తద్వైకుంఠనగరీశుద్ధాంతకాంతాసంతానము, తదంతికమున శంఖచక్రాది దివ్యాయుధనివహము వెనుకనే వైనతేయుఁడు, పిదప నారదుఁడు ఆ పిమ్మటనే విష్వక్సేనుఁడు తదనుసక్తులై అప్రాకృతలోక నివాసి సకలప్రజానీకము ఆబాలగోపాలము వెన్నంటఁ బోదొడంగెను. అది కని తత్తల్లోకాధివాసులు విస్మయావహస్వాంతులై ఎక్కడివా రక్కడనే సముత్థితులై ఓహో! వా! మనపురాకృతసుకృతవిశేషముచే కాంచగలుగు దర్శన మిచ్చుచున్నాఁడల్లదె విష్ణుభగవానుఁడు కనుగొనుఁడు, అనరసనే సరసిజ నివాసిని యగు ఇందిరామహాదేవి శ్రీవస్సుధాయమానమాధురీమయధ్వానగంభీరముగా మొరయు శంఖ మల్లదిగో మూర్జిత శిఖాశిఖాపటిష్ఠమై దర్శనీయమైన సుదర్శన మదిగో అని పరస్పర ప్రదర్శన పూర్వకముగా భక్తిమయాలాపసంతాపపరిపాక్రాంతరంగులై సంభాషించుకొనుచు నిటలప్రాప్తకరాంబుజద్వితయులై నమో నారాయణేతిమహామంత్రపునశ్చరణపురస్సరముగా హరిసంకీర్తన మాచరింపఁ దొడం

గిరి. అట్లు సకలలోకప్రభావుం డగు పరమేశ్వరుండు దివి నుండి భ
కవతరించి కాసారతీరమున అసారసంసారపీడాపరిపీడ్యమానమానసుం డగు వా
వల్లభునకు నిజాహంగప్రసారితకరుణావశోకనసుధాసుధారలచే ఉపశమనశ్శాంతి ప్ర
దించుచు జలాంతర్గతశింశుమారసార్వభౌము నుద్దేశించి చక్రప్రయోగ మొనర్చినంత
అపరిమితకోటిభానలజ్వాలాధగద్ధగాయితదిక్చక్ర మగు నాచక్రము ప్రతాపనిర్వక్రి
నక్రముపై విక్రమించి క్షణార్థములో తన్మస్తకమును ఖండించి కరిని కరుణారసము
నభిషేకించెను. వెంటనే మకరముఖాంతరాళము నుండి విడివడిన పాదముతో వేద
నిర్ముక్త మగు వేదండ మీవలకు వచ్చి తనపట్ల నపారకృపాపరిపాకమును వెడజ
వేదమూర్తి యగు వైకుంఠుని బొడగని అనిర్వచనీయభక్తిభారవినమ్రశిరస్కుం
మ్రొక్కు చుండ దయామనోహరుం డగు రమామనోహరుండు ధ్రువాంబరీషప్రహ్లా
ముచికుందాదిపరమవైష్ణవశిరోవిన్యస్త మగు హస్తముచే అప్రశస్త మగు హస్తిమస్త
మును స్పృశించి ప్రశస్తము గావించి సదయవీక్షణవిక్షేపవిశేషముచేతనే అత
చేతమునకు అనంతప్రశాంతి ననుగ్రహించి తన చక్రస్పర్శచే పురాదేవలదత్తశా
ప్రాప్తగ్రాహశరీరవిమోచనపూర్వకముగా నిజదేహము నొందిన హాహాహూగంధర
శేఖరునిచే నానావిధభక్తిమయగీతికాప్రశంసితుండై పరిసరప్రాంతసమావిష్టసురసం
ఘేంద్రాదులకు దరస్మితమంగళావలోకములచే పరిపూర్ణానుగ్రహము ప్రసాదిం
అంతర్హితుం డయ్యెను. ఇట్లు హర్యనుగ్రహమునకు పాత్రుం డగు ననేకపనేతృం డ
దాస్యభక్తి నవలంబించిన మహనీయులలో నగ్రేసరుండు.

## వాత్సల్యభక్తి :

భగవంతుండు జగజ్జనకుండు జగత్తునందలి సకలజీవరాసులు ఆత
బిడ్డలు. బిడ్డల పట్ల తల్లిదండ్రుల కుండునది వాత్సల్యము. ఇది శృంగారమునక
స్థాయి యగు రతికి రూపాంతరమే. రతి యనునది యిరువుర ప్రాణుల పర
నుండు ననుబంధమునకు చిహ్నము. ఇది యిరువుర సముల నడుమ నున్నచో
స్నేహమగును. గొప్పవారి పట్ల తక్కువవారి కున్నచో గౌరవ మగును. గురు
శిష్యుల నడుమ గాని, తల్లిబిడ్డల నడుమ గాని ఉన్నచో వాత్సల్య మగును. ఆ
మగల నడుమ నున్నచో ప్రణయ మగును. భగవంతుని పట్ల భాగవతున కున్నచో

భక్తియగును. పిదప వారనక విశ్వమానవసంఘము పట్ల నొక యుదాత్త చిత్తున కున్నదో ప్రేమ యగును. ఇన్ని రూపములు ధరించునది ఈ రతియే.

రతి యొక్క రూపాంతర మగు వాత్సల్యము ముఖ్యముగా తల్లిదండ్రులు బిడ్డలయందు కలిగి యుండును. గురువునకు శిష్యునియందును వాత్సల్యమే యుండును గాని అతని యొద్ద విద్యా స్వీకారమునకై ప్రవేశించు నప్పటికి శిష్యునకు కొంత వయస్సు వచ్చి ప్రాజ్ఞత ఏర్పడి యుండును కాని మాతృప్రదర్శనీయవాత్సల్యమునకు పాత్రి మగు బిడ్డ ఏమాత్రము వయస్సు లేనిదై తన ఆకలి దప్పులను గూర్చి గాని సుఖదుఃఖములను గూర్చి గాని ఏమియు తెలియని అమాయిక స్థితిలో నుండి సమస్తమునకు పరాధీనత్వమే శరణ్యముగా కలిగి యుండును. కనుక మాతృ వాత్సల్యము అనుపమానమై, అమూల్యమై, అపార్యమై యుండును.

లౌకికమైన ఈ వాత్సల్యమే ఇట్టి ఉన్నతిని సాధించి యుండ ఇంక భగవంతునే బిడ్డగాం బడసి పెంచు నా తల్లిదండ్రుల కుండు వాత్సల్యగరిమ ఇయత్త చే నిరూపింప సాధ్య మగునా? ఇట్టి భాగ్యము కౌసల్యాదశరథులకు, దేవకీవసుదేవులకు, నందయశోదలకు లభించినది.

## కౌ స ల్యా ద శ ర థు లు :

జన్మాంతరసంపాదితపుణ్యవిశేష మగణ్యముగా నుండిననే గాని భగవంతుని సేవింపకోవలెనను ప్రీతి యొట్టి వారికిని కలింపదు. ఎవరికైనను అనాదిసంసార సమాసాదితశిష్టశిష్టేతరవాసనావాసితమైన మనస్సుచే ప్రేరితము లగు నింద్రియములు రాగద్వేషవశీభూతములై, కృష్ణభక్తివైరాగ్యములై విషయలాంపట్యముతోనే సంతతము సదిమద మగుచుండును. ఎన్ని పురాణములు విన్నను, ఎంత మంది మహాపురుషుల ధర్మప్రవచనములను శ్రవణము చేసినను, నిత్యానిత్యముగా సాగు జనన మరణముల నెన్నిటిని చూచినను యౌవనము ఒకివేగతుల్య మనియు, జీవనము పటలాంతతోయతరల మనియు, భోగానందము కరి కర్ణాంత చపల మనియు ఎన్ని నీతులు విన్నను సామాన్యముగా ప్రాణి సంసారమున క్షుత్పిపాసానివృత్తి కిచ్చు ప్రాధాన్యము భగవచ్చరణసమాశ్రయమున కిచ్చుట గగనకుసుమ మనియే చెప్పవలసి వచ్చును.

అట్టి యెడ జన్మాంతరసముపార్జిత సమున్నతపుణ్యవిభూతిమహిమచే భగవానుఁడు రాముఁడై కౌసల్యాదశరథుల దాంపత్యమునకు ఫలముగ భూమాత చేసికొన్న యమూల్యసుకృతవిశేషమునకు మూర్తి స్ఫూర్తిగా రాముఁడై యవతరించెను. వసిష్ఠవిశ్వామిత్రాదిమహర్షివరేణ్యుల ప్రాకృతప్రజ్ఞాప్రాభవోదారులై రాముఁడు మాధవుఁడు గాని మానవుఁడు కాఁడని ఎంత బోధించినను అది కాదని ప్రత్యాఖ్యానము చేయకయు అట్టి భాగ్యము తమకు లభించినందుల కమితానందము నొందియు ఆతని పట్ల వారు ప్రదర్శించు అపరిమితానురాగమే వాత్సల్యభక్తికి ప్రథమోదాహరణముగా పరిగణింపఁ దగ్గది.

రాముఁడు సూర్యవంశమున జన్మించినను సూర్యుని నైజమగు ప్రతాప ప్రకాశములతో పాటు చంద్రుని నైజమగు సౌమ్యతాహ్లాదనములు కూడ నాతనియందు మూర్తీభవించి యుండుటచే పుడమిపై సూర్యవంశసంభవులలో ఎవరికిని రాని రామచంద్రుఁ డను పేరు ఆతనికే లభించినది. దశరథునకు పంచప్రాణవిశిష్టు లగు తక్కిన సర్వమానవులకంటె ఒక ప్రాణ మధికము. అది రాముఁడు. పుత్రవ్యామోహము సాధారణముగా గృహస్థుల కెల్లరకు నుండుట సహజమే అయ్యును, దశరథునకు రామునిపై నుండు ప్రేమ సామాన్యమైనది కాదు. మంచి గాని, చెడ్డ గాని కొన్ని హద్దులకు లోఁబడి యున్నప్పుడే యుద్దిష్ట ప్రయోజనము నెరవేర్చును. ఆగీత నతిక్రమించినచో మంచి కూడ చెడ్డలోనే పర్యవసించును. రాముఁడు లేకుండ అరువదివేలసంవత్సరములు నిర్విచారముగా జీవింపఁ గలిగిన దశరథునకు రామవివాహానంతరము ఆ స్థైర్యము నేల కోల్పోయెను? ఇందులోనే ఆతని మృత్యురహస్య మిమిడి యున్నది. దేని నెవరు ప్రగాఢముగా ప్రేమింతురో అది వారికి దూర మగుటయు, వారు తద్వియోగబాధాహేయమానమానసులై క్రుంగుచుండు టయు లోకసహజము. ఇంకను సంతానవాంఛ ఆవంత యేనియు అంతరంగమున నావిర్భవింపని పూర్వకాలమున నెప్పుడో అతఁడు పొరపాటున ఋషిబాలకుని ఏన్గుగనుకొని చంపినప్పుడు తత్పుత్రవియోగముతో మరణించు నమ్మహర్షి నీవును నిట్లే పుత్రవియోగప్రగాఢఖేదసంప్రదష్టుఁడవై మరణింతువు గాక యని పెట్టిన శాప మవ్యక్తముగా నతనిని ప్రేరేపించి నిరంతరరామసాంగత్యరూప మగు రాగబంధమును పెంచి క్షణకాల మేనియు తద్వియోగమును సహింపని ఆలోచనను మనస్సులోనికి

తెచ్చుకొనుటచే దుర్భర మగు నంతటి దురంతస్థితికి చేరుకొనెను. ఈ దారుణవ్యథ చేతనే విశ్వామిత్రమహర్షి స్వయాగసంరక్షణవ్యాజమున రాము నర్థించుటయు ఆ మాటలే వినలేని దురవస్థకు లోనైన సమాత్రిట్టు గాధేయోక్త బహుసత్తురోక్తులచేతను, వసిష్ఠోపదేశముచేతను స్వస్థుఁడై రామలక్ష్మణుల నాతని వెంట పంపుటకు సమ్మతించెను. అది ఇంకను అతనికి ప్రాప్తకాలము కాకపోవుటచే అప్పటి కాగండము తప్పిపోయినది. రాముఁడు లీలామానుష విగ్రహుఁ డగుటచే ఏది ఎట్లు జరుగుచున్నను సాక్షి మాత్రుఁడై కనుగొనుట దక్క కర్తృత్వభోక్తృత్వములను తనకారోపించుకొను లక్షణము కలవాఁడు కాకపోవుటచే విశ్వామిత్రుఁ డడిగి నప్పుడు గాని, దశరథుఁడు ముందు సమ్మతించి వెనుక తిరస్కరించి నప్పుడు గాని, వసిష్ఠుఁడు ఉపదేశించి నప్పుడు గాని, తుదకు తాను సంతుష్టుఁడై కౌశికుని వెంట అరణ్యముల కరుగు నప్పుడు గాని, అవలీలగా తాటకాదిసంహారవీరకార్యనిర్వహణమున కుపక్రమించినప్పుడు గాని ఏకరీతిగనే నిర్వికారుఁడై, నిర్లిప్తుఁడై, నిరంజనుఁడై "పద్మపత్ర మివాంభసా" అన్నరీతి నుండగలిగినను దశరథుఁడు మాత్ర మంత పరకోటి కెక్కిన స్థితప్రజ్ఞత నలవరచుకొన్న యదృష్టవంతుఁడు కాకపోవుటచే అతనికి రాముని పట్ల గల వాత్సల్యము భక్తియై, భక్తివాత్సల్యమై, తుదకు రెండును కలసి వాత్సల్యభక్తియై అతని నంత కంతకు ఉక్కిరిబిక్కిరి చేసినదైవ తత్పరతకు తట్టుకొనలేక తట్టుముట్టాడుచు సీతా కల్యాణానంతరము జనకయాగశాలాప్రాంగణములో పరశురామగర్వభంగము చేయ తలపడు రాముని సామర్థ్యమును సరిగా నూహింపలేక, ఆ యూహింపలేకపోవుటయు వాత్సల్యహేతుకమే కాఁగా ఈతరాని వాఁడు నీట మునిఁగి నట్లు ప్రాణములు మూట కట్టుకొని నట్టేట పగిలిన నావలోని యాత్రికుని వలె ఆత్రపాటునకు పాత్రుఁడై ఎట్టకేలకు రాఘవుని లోకసామాన్యసామర్థ్యప్రాముఖ్యముచే ఆ ఘట్టము సుఖాంతము కాఁగా బ్రతుకు జీవుఁడా యని ఒడ్డెక్కిన చేప నీట పడ్డట్లు గుండెల నిండుగా గాలి పీల్చుకొని హాయిని మేయగలిగెను

కాని కల్యాణానంతరము రాముఁడు స్వీయగేహమున కాలు మోపిన కొలఁది కాలమునకే తన కతర్కితముగ ప్రాప్తించిన దుర్నిమిత్తములను నిమిత్తీకరించుకొని దాశరథికి పట్టాభిషేకమహోత్సవము నిర్వహించి గట్టున పడవలె నని తలంచి వసిష్ఠ భగవానునిచే ముహూర్తము పెట్టించెను. ఆ పట్టాభిషేకముహూర్తమే వనవాస

ముహూర్తమై రామునకు సంతోషము జగత్తునకు కల్యాణము, దశరథునకు సంతాపము కలిగించి తుదకు అతని అంత్యేష్టిలో పర్యవసించెను. పల్లమాలిన వాత్సల్యము మృదుహృదయుఁ డగు దశరథుని ప్రాణములను బలితీసికొనెను. వసిష్ఠవిశ్వామిత్రాది తత్త్వజ్ఞులు రామావతారరహస్యము నెంతగా విశదీకరించినను రాముఁడు భగవంతుఁడు కాఁడను శంక యతనికి లేకున్నను, లేకలేక కలిగిన ఆ లోకోత్తరాపత్యవిశేష మందలి అనురాగసంపత్తి వాత్సల్యమై పచను, భక్తి పరిపాకము అన్నియు కలసి ఏర్పడ్డ వాత్సల్యభక్తి హేతువుగా దశరథుఁడు రాముని తన కుమారుని గానే పరిగణించుట కిష్టపడెను గాని అతఁడు సర్వశక్తిసంపన్నుఁడు, అమేయమహాప్రభావధురంధరుఁడు, షడ్గుణైశ్వర్యసంపన్నుఁ డగు భగవంతుఁ డనియు, ఆతనిది సర్వవ్యాపకతత్త్వమనియు, ఆతఁడు తనకు తనయుఁ డైనను జగత్తునకు జనకుఁ డనియు ఎచ్చట నున్నను సర్వవ్యాపకుఁడే యగుటచే అడవి కరిగినచో ఇంట నున్న వాఁడు కాకపోఁడనియు తలంపలేక పరమదుర్భర మైన వాత్సల్యభారమునకు కృంగి, [illegible], కృశించి వశము తప్పి అశనవిసర్జనపూర్వకముగా తుదకు దైహికముగా నశించియు పారమార్థికముగా కృతార్థుఁడై వాత్సల్యభక్తిపరిపాకప్రౌఢిమకు పరకాష్ఠయై చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయెను.

## దేవకీవసుదేవులు, నందయశోదలు :

పుణ్యము కొద్దీ పురుషుఁడు దానము కొద్దీ బిడ్డలు అను లోకోక్తి దేవకీవసుదేవుల దాంపత్యజీవితములో యథార్థ మైనది. కాశ్యాదిపుణ్యక్షేత్రములలో, భాగీరథ్యాది తీర్థసామీప్యము నందు అర్ధోదయమహోదయాదిపుణ్యనిమిత్తములను పురస్కరించుకొని చేసిన దానములు మరింత సత్ఫలప్రదములై భవిష్యజ్జన్మలందు కూడ అంతరంగమున కెంతయో సంతసమును సంతరించి పెట్టును. దేయవస్తువులలోని [illegible]లను మనస్సు మిక్కిలి యోగ్యమైనది. గ్రహీత లందరిలోను భగవంతుఁడు యోగ్యతముఁడు. కనుక అఖండభక్తిభావనాపావనయోగసమాధినిష్ఠాగరిష్ఠుఁడై మనస్సును భగవంతునకు సమర్పించిన నెరదాతకు అట్టి దానమునకు తగ్గ ఫలము తానే పుత్రుడై యవతరించుట దక్క తక్కిన దారిలేదు. కావున పాప మా వసుదేవుఁ డంత భక్తియుక్తుఁడై భగవదారాధనవ్యవసితుఁ డయ్యెనో గాని అతని అగణ్యము

లను పుణ్యము లన్నియు పండి సాక్షాద్భగవంతుఁడే యగు శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి ఆతనికి పుత్త్రరూపమున నవతరించెను.

ఏతాదృశపుత్త్రసంరక్షణవాత్సల్యవారాశిలో మునిఁగి తేలు మహాభాగ్యమునకు ఆతనితో పాటు దేవకీదేవియు, ఆ పుణ్యదంపతు లిరువురికన్న నందయశోదలును ఎంత సుకృతవిశేషమున సంతరించిరో. చిరతపోవిశేషానురూప మగు సత్పుత్త్రఫలము నట్లు బాలకృష్ణుఁడు నిమిత్తముగ పడయఁగలిగి వసుదేవుఁడు ఆకాశవాణి ఆదేశముతో అర్ధరాత్త్రమున యమునా నదిని తరించి అవ్వలి వైపున నున్న నంద కులమున పురిటింట నిక్షేపించి అచ్చటి ఆఁడు బిడ్డ నెత్తుకొని వచ్చి మరల మధురా నగర మందలి కంసకారాగారమున చేర్చ నదృష్టమునకు నోచుకొనుట అత్యంతప్రశంసాపాత్ర మగు మధురఘట్టము.

"మహిమాహింపఁగ నెంత భాగ్య మొకొ యామ్నాయాంత సిద్ధాంతవా
క్యమహిళాకుంతలమౌక్తికాభరణమై యున్ మందాకినీశేఖరుం
గుహనాభైరవు యోగిపుంగవుని భర్గున్ రాజమార్గంబునన్
వహియించెడిన వీఁపునందిరముగా వైస్యందనాలస్యతన్"

(హర. 2 - 88)

అని ప్రశంసితుఁడైన చిటిచిన్నివానికి దీటుగా వసుదేవుఁడు అసంఖ్యేయబ్రహ్మాండ భాండోదరుఁ డగు బాలముకుందభగవత్పాదుని అన్నాల పిష్టగా అరచేత ధరించి రాత్రికి రాత్రి కాళిందీ మహాస్రవంతిని తరించుట గూడ "మహిమనాహింపగ నెంత భాగ్యమొకో!"

ఆ దేవకీవసుదేవుల నష్టమగర్భము. ఈ గర్భమే కంసునకు గర్భ నిర్భేదక మగునని ఆకాశవాణి తొలుత నాదేశించెను. ఆతఁడు పరమదురంతదుర్భర దౌష్ట్యదేవతామహోపాసకుండు గగనవాణీదివ్యాదేశశ్రవణక్షణము నుండియు విశ్వ విధ్వంసనసూంసలపరిజ్ఞానప్రశంసుఁ డగు కంసుఁడు ఆ యష్టమగర్భ మెప్పు డావిర్భ వించునా యని క్షణములు లెక్కపెట్టు కొనుచునే యుండెను. కృత పుణ్యునకు పుణ్యఫలము మీది ప్రీతికన్న, పాపాత్మునకు పాపఫలమును గూర్చిన భీతి మిన్న. తాత్కాలికముగా ఒకరి పాప మొకరి దుఃఖముతో పర్యవసించుట కన్పట్టును గాని

తత్త్వాలోకనతత్పరులై జగదధీశపరాయణు లగు వారి కెవ్వరి పాపము వారి శాపముగనే పరిగణింప నని అవగతము కాకపోదు. ఇట్లు పై వారికే గాక తత్పాప కర్తకు కూడ ఆ భీతి నిండుగా మెండుకొని మనస్సును పిండలి వంతు చేయు చుండును. ఈ సత్యమును కంసు డతిక్రమింపలేక నిత్యము దేవకీదేవి యష్టమగర్భ నిర్మూలనమునకై కనిపెట్టుకొని యుండగా తుదకిట్లు జరుగుటచే కారాగార మందలి శిశురోదనము విని ఆతఁడు వెంటనే తత్తండనమున కుపక్రమింప దేవకీవసుదేవులు నీవడుకొన్నట్లు మగబిడ్డ కాదుకదా! ఆడుబిడ్డపై ఆమాత్రము కనికరము చూపలేవా? అని కాళ్ళ వేళ్ళ బడి ఎంతబతిమలాడి నన్నను శిశుఘాతమనస్కుఁ డగు నా కంస ముష్కరుఁడు ఆ శిశు హననమునకే నిశ్చయించి బలాత్కారముగ చేతులనుండి లాగి పైకి విసరి క్రింద కత్తి యొడ్డిగా నా మహాయోగమాయ యగు నా శిశువు నిన్ను వధింప గల వసుదేవాష్టమ గర్భము నందగోకులమున పెరుగు చున్నది లేరా, నీ అంత మెట్టయి నను అతని చేతులలో కాక తప్ప దని ఉచ్చైస్స్వరమున ప్రకటించి పైనుండి పైపైనే అదృశ్యమైపోయెను. విస్మయ ప్రజ్వలితమనస్కుఁడగు కంసుఁడు దేవకీవసుదేవుల పూర్వసంతానసప్తకమును వారెంత వల దని విలపించు చున్నను వదలక వధించి వారి కప్రతిహతగర్భశోకమును ప్రసాదించెను. ఇది వారిలో నిగూఢముగా గూడుకట్టు కొన్న వాత్సల్యభక్తి పరిణతపరివర్ధమానమై అత్యంతమహోన్నతకోటి కెక్కుటకు తోడ్పడుటే గాక తను బిడ్డ తమ యొద్ద పెరుగకున్నను నిరంతరగతన్నామరూపస్మరణ పారవశ్యమున నంకితులై మానసికారాధనతాత్పర్యముతో వాసుదేవుఁడు, దేవకీపుత్రుఁడు నందకిశోరుఁడు, యాదవేయుఁడు నగు నారాయణుని చింతించుట యందే తమ కాల మును కారాగారమున గడుప దొడంగిరి. ప్రారబ్ధవిలాసమెంతవారికిని అనుభవింపక తప్పదు కదా! భగవంతునే బిడ్డగా బడసిన ఆ పురాణదంపతులకు పరముదుర్భర బంధనక్లేశము తప్ప దయ్యెను. ఈ వ్యవధిలోనే దేవకీవసుదేవుల హరిభక్తిపరావతార మగు పుత్రవాత్సల్యము సాంద్రమై, సాంద్రతరమై, సాంద్రతమమై తమలో తమకు తెలియకుండగనే గూడుకట్టుకొని యున్న తమము నంతను దమించి, అంతరంగమును యమించి తజ్జీవితములను నారాయణోన్ముఖముగా క్రమించఁ జేసెను.

ఇఁక నందయశోదల ప్రసక్తికి వచ్చినచో కన్న ప్రేమకన్న పెంచిన ప్రేమ ఎక్కుడను నానుడికి వారి జీవితములు సజీవచిత్రములుగా లిఖింపదగ్గవి.

జన్మలో నెంత వైజభక్తిమహత్త్వసమలంకృతస్వభావమున హరిని సేవించుకొని యుండిరో గాని వా రీజన్మమున తత్ప్రసాదము నకు పాత్రులైనట్లు నిరంతరనిరుపమ పస్వమాధినిమగ్నమతులై విపిన భూములకు జీవితము లంకితముగ జేసిన మహర్షి రేణ్యులు కూడ వారితో తులతూగలేరు. నామరూపగుణక్రియాదివ్యవహారచిహ్న హితుడగు, పరమేశ్వరుడు ఆ చిహ్నము లన్నిటిని ధరించి లీలామానుషవిగ్రహ ధారియై వారి చేతులలో నల్లారు ముద్దుగా పెరిగి పెద్దవాడయ్యెను. లోక మందలి రశిశుజీవితప్రవాహములో ఎప్పటికు తారసిల్లని అనేకాద్భుతసన్నివేశతరంగములు 'అముకుందుని జీవితములో సంఘటిల్లగా అవి యన్నియు లోకోత్తర మైనవే యని నుకొనుచు కూడ మరల లోక మందలి సామాన్యగృహస్థులవలె మేము తల్లిదండ్రు ము అని ఎప్పటి కప్పుడే తమ మనస్సులో తాము సరిపెట్టుకొనచొచ్చిరి. ఇదియే వ మాయ. "మమమాయా దురత్యయా" (గీత-7-14) అని భగవానుడు యముగా చెప్పినది దీనిని గూర్చియే

ఆయిన నిక్కడ ఒక విషయము గమనింప వలసి యున్నది "మామేవ పే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" (గీత 7-14) అని తరచో పాయము ననుగ్రహిం న హరివాక్కు నెరిగియో, యెరుగకయో వారు సర్వాత్మనా ఆ శిశు సంరక్షణమే తమ వితపరమావధిగా భావించి సేవించికొని రనుటలో అనంతయు సందియము లేదు. యినను వీడు సాక్షాత్ భగవానుడే యని మాత్రము వా రసందిగ్ధముగా తీర్మానించు నక మగల బాలుడు బాలుడు అను నిర్ణయముచెంద మనస్సును లగ్నపరుప చ్చిరి. ఇది కూడ హరిమాయయే కావచ్చును. కాని ఇది అపాయకరము త్రము కాదు ఏమాత్రపు మాయ అవహింపక పోయినచో సామాన్యజీవనవిధా ము సాగదో ఆ మాత్రమే వారి నావహించి యుండునట్లు పరాత్పరుడు పరికల్పించె అనుకొనవలసి యున్నది.

నెలల శిశువై ఉయ్యాలలో పండుకొని యుండగా చేసిన పూతనాసంహా ము, పాకుచుండగా అల్లరి నరికట్టుటకై ఉలూఖలబంధన మొనర్ప దానినే నిమిత్త ముగాని కావించిన యమళార్జున భంజనము, తప్పటడుగులు వేయుచుండగా సుడి రూపమున వచ్చి తన్నెత్తుకొని గగన వీథికి పరతెంచిన తృణావర్తునకు భరింప వికాని బరువు తోచి తుదకు సంహరించిన విధానము — ఇట్లు సాగిన ఆటాల

గోపాలుని లీలా విలాసములలో ఏది సామాన్యమానవశిశువున కన్వయింప నగుచు పడును? ఇవి అన్నియు అసాధారణదైవీశక్తిప్రధానములే కదా? ఇవి అన్నియు ఒక యెత్తు కాగా, వీడు మన్ను తినుచున్నాఁ డని బలరాముఁడు చేసిన దోషారోపణమును విచారణకు స్వీకరించి యశోద "ఏరా మన్ను తినవచ్చునా? అని గద్దింప ఆ బాలుఁ డామెకు తాను మన్ను తినలేదని భయము భయముగా చెప్పుకొనెను. ఏదీ నోరు చూపు మనగా అతఁడు నోరు తెరచి ఆ వాతాశ సత్యలోక పర్యంతమైన బ్రహ్మాండ మంతయు ఆమెకు చూపెను. మన్ను తినినదే బలరాముఁ డబద్ధమాడునా? తిన్నవాఁడు తినలేదని పలుకుట యదార్థకథన మగునా? అయిన నోరు చూపు మని దండింపగా తెరచి చూపిన నోటిలో బలరాముఁడు చెప్పిన మన్ను గాక మన్ను మిన్ను అని వింగడింపరాని విశ్వరూపము నంతయు ప్రదర్శించుట చిత్రముల కెల్ల చిత్రము కాదా! ఇవి యన్నియు పరికింప నన్నసాధారణభక్తిభావమహావైభవముతో మేళవించిన వాత్సల్యమును నిధింపకొని తదేకధ్యానముద్రాసమాధినైశ్చల్యముతో పెంచుచున్న మాతృస్థానీయురా లగు యశోద యందు ప్రసన్నుఁడై తన విశ్వరూపము నను గ్రహించి ఆమెను ముముక్షు జన మూర్ధన్యురాలినిగా తీర్చిదిద్దవలె నను సంకల్ప మాతనికి ఉదయించే అట్లు కావించె నని అనుకొనక తీరదు. మన్ను తిందు వేల అని గద్దించి నపుడు అతఁడు పలికిన

శా. "అమ్మా! మన్ను దినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరి మాటలు మదిన్ నన్నీవు కొట్టంగ వీ
రి మ్మార్గమ్ము ఘటించి చెప్పెదరు కాదేనినిన్ మదీయాస్య గం
ధ మ్మాఘ్రాణము సేసి నావచనముల్ దప్పైన దండింపవే"

(ఆం. మ. భాగ. 10-1-337)

అని పలికిన పలుకులలో తప్పుచేసిన వాఁడు తన్ను సమర్థింపకొనుటకు వాకొను వెఱ్ఱిముఱ్ఱి వాక్యములు గాక అన్నియు ప్రౌఢోక్తులే ధ్వనించుట గమనింపఁదగియున్నది. మన్ను తినుటకు నేను శిశువునా? అనునది అతఁడు వేసిన మొదటి ప్రశ్న. శిశువు కాక మఱి యెవరు? "అమ్మా! నీ పురాకృతసుకృతవిశేషమున నిన్ననుగ్రహించుటకై నీకు శిశువుగా కాన్పించు చుంటినే గాని యథార్థమునకు శిశుప్రాయమైన జగత్తున కంత కును నేను జనకుండను సుమా" అను తత్త్వార్థ మందు ప్రతిఫలించు చున్నది.

నామాటపై నమ్మకము లేనిచో ఇదిగో నా నోరు తెఱచుచున్నాను చూచి తెలిసికొను మని తల్లి ముందు నోరు తెఱచెను. ఈ సన్నివేశమును పరిశీలింపగా తాను ప్రాకృతశిశు వను నమ్మకముతో ఆతల్లి అజ్ఞానకూపములో దిగబడి పోవుచున్నదని జాలి తలచి ఆమె నెట్లైనను ఉద్ధరించుటకే తన్ను గూర్చిన యథార్థ పరిజ్ఞానము కలిగించుటకే ఆమె జీవితమును మహార్థసుందరము చేయుటకే నిశ్చయించుకొని నోరు తెఱచి తన అఖిలాండకోటిబ్రహ్మాండకుక్షింభరిత్వమును ప్రదర్శించెను. ఆమె ఆ యనిదంపూర్వ మహావిశేషమును-ఎట్టి తపోధనుల స్వానుభవముచే కూడ ఆవిష్కరింపఁబడుట కాని ఆ యనిర్వచనీయమహాద్భుతలోకోత్తరదివ్యానుభూతివైభవమును—సందర్శించి ఆ మహనీయభాగ్యవతీలలామము తన కన్నులను తాను నమ్మలేక తానున్నది అవస్థాత్రయములో ఏ యవస్థకు చెందునో తెలియని విచిత్ర పరిస్థితిలో తగుల్కొని

మ. "కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలఁప న్నేరక యున్నదాననొ యశోదాదేవిఁ గానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వల మై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్"
(ఆం. మ భాగ. 10. 1-341)

అని తబ్బిబ్బు పడిపోయెను. చివరికి తానెట్టి స్థితిలో నున్నదియు తనకే అర్థము కాని అగమ్యగోచర మగు నొక విలక్షణావస్థలో నుండుటచే తానసలు యశోదాదేవి నగు దునా? కానా? యను నంతటి సందేహములో కూడ పడిపోయెను. అట్టి సందేహము లలో నామె కది పరస్థల మేమో అని కూడ తలపించెను. పరస్థల మనగా లోక సామాన్యార్థము కాదు. తానుండు చోటు తన కంతయు పరిచితమే గనుక ఏదైన విచిత్ర వస్తు సందర్శనము ఘటిల్లినప్పుడు వేరొక చోట నుంటి మేమో అని పించుట మానవులకు సహజము. ఇది సామాన్యార్థము, కాని ఇక్కడ పరస్థల మనఁగా ప్రాకృత స్థల మగు భూలోకము కన్న భిన్నమై "యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ" (గీత. 15-6) అని భగవానుఁడు తన్ను గూర్చి తానే చెప్పుకొన్న అప్రాకృత స్థానము కైవల్యధామము అగు వైకుంఠలోకము నుద్దేశించెనని చెప్పుకొన వలసియున్నది. ఇది యామె యున్న సామాన్యస్థితికి అతీతమైనదిగా గోచరించినను తత్కాలమున తత్త్వార్థగోచర మైనది గనుక ఆమహార్థవిభూతిని పచపంజరబద్ధ

మొనర్చి ప్రకటింపగలిగెనని తలంపవలసి యున్నది. ఇదియే మహాపురుష వలన సామాన్యులకు కలుగు సత్సంగఫలము. అయినను చిరవాసనా రూఢమైన పరనామధేయ మగు అజ్ఞానము అంతంత మాత్రముగనే మిగిలిపెట్టుకొని పో భవము కావున బాలకుఁ డేమి ఇతని ముఖస్తంభై అజ్ఞాంతము ప్రజ్వలమై కేమి కారణ మని వితర్కించుకొనెను.

ఒక దినదినము హౌత్రిక్షులో కట్టి ఆస్తాం విష్ణుగా పెంచుకొన్న ఒ భవము. అతల్లి తన బిడ్డడు సూక్ష లోకములో నెలకి బిడ్డల వంటివాఁ డే యకొనగా నేనట్టి వాడను కాను సుమా యని తన యథార్థ మొక్క మాహాత్మ్యమె ర్శించి చిర భ్రమల నెల్ల దూరీకరించెను. ఏ యోగశిక్షణము లేనట్టియు కనీసము నైనను గురు శిక్షా పూర్వకముగా స్వీకరింపని చేసిన ప్రకృష్ట ఏవేవో అవాకులు చెవాకులు విసరుచుండిరి అని యనఁగా అంచాశ్చర్యమే యుని

## 9. వైష్ణవ మతమునకు, భక్తి శృంగారములకుఁ గల సంబ

మానవులకు సుఖము కలుగఁజేయు మార్గములను మతము లందురు. మార్గమే త్వరగాను, ఎక్కువగాను సుఖము సంపాదింప గలదని పోటీ చే మతములు పెక్కు లేర్పడినవి.

ఈ మతములలో వైదికము అవైదికము నని ప్రధానము గ భేదములు గలవు. వేదములను ప్రమాణముగా స్వీకరించు శైవవైష్ణవాదిమ వైదికములు వేదప్రామాణ్యమును తిరస్కరించు జైనబౌద్ధపాషండకాపాలికాదిమ అవైదికములు.

వైదికములలో వైష్ణవమతము వైకుంఠనాథుఁ డగు విష్ణుమూర్తిని దైవముగను మోక్షప్రదాతగను అంగీకరించును. భూలోకము ప్రాకృత వైకుంఠము అప్రాకృతము. భూలోకజీవులు జన్మజరామరణాదివికార ఆగమాపాయములు కలవారు కాగా, వైకుంఠనివాసులు నిత్యజీవులు అచ్చ టెల్లరకు చతుర్భుజములు, శంఖచక్రగదాఖడ్గవనమాలికాదిపరికరము లుం

మోక్ష మనఁగా నిరంతర నారాయణనామామృతపానవిశేషముచే సాలోక్య, సామీప్య సారూప్య, సాయుజ్య ముక్తులను బడసి వైకుంఠమున శాశ్వతముగ నివసించుట యని వైష్ణవ గ్రంథములు ప్రతిపాదించును.

కుంఠ మనఁగా ఫల సాధనలో మొక్కవోవునది, వెనుదీయునది, వ్యర్థ మగునది యని యర్థము. వికుంఠ మనఁగా అట్లు కానిది అని అర్థము. అనఁగా విష్ణుసాయుజ్యరూప మైన మోక్షసాధనలో వ్యర్థము కానిది-కడుఁగడు సమర్థ మైనది అని అర్థము. వికుంఠునకు రూపాంతరమె వైకుంఠము. అందలి దేవుఁడు విష్ణువు. విష్ణు వనఁగా సర్వత్ర వ్యాపించిన వాఁడు అని అర్థము, కనుకనే విష్ణు వునకు వాసుదేవుఁడు, జగన్నివాసుఁడు అను పేర్లు వచ్చినవి.

అట్టి అపునరావృత్తి రూపమైన ముక్తి నొసంగుటలో అప్రతిహతప్రభావ ధురంధరుఁడై ముకుందుఁ డని పేరొందిన గోవిందుని సందర్శించి అంద్వైతమ్ము మొందు టకు భక్తి ప్రధాన సాధనము. భక్తి యనఁగా భగవంతుని వైపు ప్రసరించిన ప్రగాఢమైన ప్రేమ యని యర్థము. ఇందు భగవంతుఁ డొక్కఁడే పురుషుఁడు. భక్తు లందరును భౌతికముగ స్త్రీలైనను పురుషులైనను ఆధ్యాత్మికముగా మాత్రము స్త్రీలుగనే పరిగణింపఁ బడుచురు. భగవంతుని యొక్క అనఁగా పురుషునియొక్క వియోగము నెంత మాత్రము సహింపక అతని సాన్నిధ్యము కొఱకు అనిర్వచనీయ మయిన కుతూహలముతో కాల విలంబనమును సహింపలేక అత్యంతపరితాపముతో వేగి పోవుటయే భక్తి యందలి పరకాష్ఠగ చెప్పఁబడినది. అట్టి పరమ భక్తని వైష్ణవ సంప్రదాయము ఏకాంత భక్తి యని ప్రతిపాదించును. అట్టి ఏకాంత భక్తితో భక్తుఁడు విష్ణు స్వరూప ధారియై వికుంఠ లోకమునులో ఎడతెగని ఆనందము ననుభ వించుటయే మోక్ష మనఁబడును. ఇచ్చట విష్ణువునకు భక్తునకు అభేదము-ఐక్యము- సామ్యము చెప్పఁబడినది.

ఇట్టి అభేదమే శృంగారములో స్త్రీ, పురుష సంయోగ రూపముగ సాధిం పఁ బడినది. కనుక పోతనామాత్యుఁడు భాగవతములో భక్తి నెచ్చట ప్రతిపాదింప వలసి వచ్చినను, అచ్చట తద్వ్యక్తికి సంకేత మాత్రముగ శృంగారమును సాధించు చుండును. ఇచ్చటి శృంగార మనఁగా ఐహికమై దైహికమై, ఉద్రేకభరితమై, పాశ

సంసారమునకు దోహదము కల్పించి సంగముచే మంగళ స్థితికి భంగము గావించు కోరిక యుండుట ఎంత ముప్పో సంసారధ్వంసరూపము ఐన అపవర్గమునకు మార్గమాదేశించు సాధనావిశేషమందు కోరిక ఉండక లేక కుండుట అంత తప్పు. భౌతిక వస్తువు లందు మనకు కలిగిన వాంఛ స్వాంతము నెంతగా సంతప్తము గావించి నను ఆవస్తువు వ్యక్తి యొద్దకు రాదు. వ్యక్తియే దాని కొఱకు శ్రమించి, తహతహలాడి, తంటాలు పడి, వెంట నంటిపెట్టుకొని తిరిగి ఉబలాట పడి రక్తము నీరగు నట్లు ఎడతెగని కృషి చేయవలెను. అయినను అది లభించునో లభించదో తెల్పి చెప్పుట కష్టము. కనుకనే "యత్నేకృతే యది నసిద్ధ్యతి కోఽత్రదోషః" (హితో. ప్రస్తా. 32) అని శాస్త్రజ్ఞులు అభయప్రత్రిప్రాయపరికల్పించిరి. కాని అప్రాకృత మగు నాత్మ పదార్థముపై - అనగా సాక్షాద్భగవానునిపై కోరిక జనించి నచో తత్సాన్నిహిత్య మనుభవించి తీరవలెనను ఘనతృష్ణ అంకురించినచో భౌతిక వస్తువులలో లేని వలనను కానరాని ఒకానొక మహిమోపేతమైన సహకారము భగవంతుని వలన భక్తునకు సంఘటిల్లును. వాత్సల్యపూర్ణుడగు శ్రీహరి భక్తునకు కించిత్ప్రయత్న స్ఫూర్త్యనుపదమునసే తనంతట తానుగా ప్రాప్తించును. దానికి భక్తుడు చేయవలసిన దెల్ల ఇతర ప్రయత్నములు మాని సర్వశక్తులను భగవంతునిపై కేంద్రీకరించుటయే "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" (గీత. 18–66) అని భగవానుఁ డాదేశించి అట్లు చేసినచో ఫల మేమియో చెప్పుచు "అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి" (గీత. 18–66) అని వ్యాఖ్యానము చేసి "మాశుచః" అని మరల నోదార్చి యున్నాఁడు. ప్రయత్నమున కిట్టి ప్రతిసమాధానము లౌకిక వస్తువులనుండి ఎచ్చట వచ్చును. కనుకనే భక్తి యనునది శృంగారము కాదు. శృంగారము యొక్క పరమార్థము కాకపోదు. ఆ పరమార్థము ప్రాపించుటలో సంసారము భంగమయి పోవును గనుక పునర్జన్మము లేకుండుటచే భగవత్సంబంధము ఐన కోరిక కోర్కె కాదు. ఇట్టి స్వస్వరూపానుసంధానరూపము ఐన భగవద్భాగవతసమైక్యపరనామక మగు సాత్త్విక శృంగారము భక్తితో సమానాభావసంబంధబంధురము అయి యుండుటచే బోస గారు ప్రతిపాదించిన భక్తిశృంగారము పరమోత్కృష్టము అయి యున్నదని చెప్పవలసి యున్నది.

# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 10. భక్తిశృంగారముల కేర్పడిన అవినాభావ సంబంధము

శృంగారములోను భక్తిలోను ఇరువురి ఐక్యము సాధింపఁబడుట ముఖ్య సంఘటనముగ గోచరించును. శృంగారములో నైనఁ దంపతులకు ఐక్యము ఘటిల్లును. ఇది కేవలము ఐహికము, క్షణికము, ఇంద్రియానంద పరిమితము. కాని భక్తిలో నేర్పడు నైక్యము జీవేశ్వరులది. ఇది అప్రాకృతము, శాశ్వతము, అతీంద్రియము. పోతనామాత్యుఁడు ఇట్టి పునరావృత్తి రహితము ఐన అపవర్గరూప మోక్షసిద్ధి యగు జీవేశ్వరైక్యమునకు లౌకిక దాంపత్యవైభవ మందలి తానవైక్యమును సంకేతముగ స్వీకరించి నట్లు గోచరించును. కాని ఈ శృంగారములో కూడ ఈకవి కేవలము భౌతిక సుఖమును మాత్రమే ఉద్దేశింపలేదు. సనాతన సంప్రదాయ నిర్దిష్ట మయి ధర్మ పురుషార్థ సహకృతమయిన కామ విశేషమునే ఉద్దేశించినట్లు స్పష్టపడును.

భగవత్ప్రణీతమయిన విశ్వ కావ్యమునకు ప్రకృతిపురుషసంయోగరూపము ఐన శృంగారాపరనామధేయ మగు ఐక్యమే మూలము. అది జగద్వ్యాపారమున కాదర్శప్రాయము ఐ ఆశ్రమ చతుష్టయములో మకుటాయమాన మగు గార్హస్థ్యమునకు శిరోధార్యము ఐ సృష్టి రూప మగు ఈశ్వర సంకల్పమునకు దాంపత్యరూప మగు దోహదముచే బలము చేకూర్చు చున్నది. అదియే ఆశ్రమాంతరప్రవిష్టులకు పురుషార్థసంపాదనోత్థాపిత మయిన అంతరశాంతికి భక్తిరూపమున పరిణమించు చున్నది. అనఁగా ఒకానొక యవస్థలో శృంగారముగా భాసించిన ప్రక్రియయే అవస్థాంతరములో భక్తిగా రూపాంతర మొందునని చెప్ప నొప్పును.

శృంగారములో ఇరువురు వ్యక్తుల ఐక్యము ఇంద్రియాధిగతమయి గోచ

రించుట సర్వులకు విశదమైనంత స్పష్టముగా భక్తిలో నిరువురి ఐక్యము విదిత పడక పోవచ్చును. అధికారిక భేదమును బట్టి యోగ్యతా విభవ సంపత్తి భిన్న భిన్నముగా నుండును గనుక భక్తియందు ఏరెంటి కభేదము సిద్ధించునో అది తదనుభోక్తకు తప్ప ఇతరులకు స్పష్టపడదు. కాని అనుభోక్తృమహాశయుని సాధనా బలముచే పరిసరవ సన్మానవ సామాన్యమునకు కూడ హృదయపరిశాంతిరూప మగు నా పరమప్రయోజనము అంశో ఇంతో అనుభూయమాన మగుచునే యున్నది. కనుకనే "కామి కాని వాఁడు మోక్ష కామి కాఁడు" ఇత్యాద్యభియుక్తోక్తులు సముత్పన్నమై జనవ్యవహారములో చిర స్థిర స్థాపితము లైనవి.

ఇంద్రియవ్యాపారసాధిత మైన ఐక్య మొక వంక సంసారవిస్తారమునకు దోహదము చేయుచుండ అతీంద్రియవ్యాపారసాధ్య మైన ఐక్యము వేరొక వంక సంసారధ్వంసప్రయోజనసిద్ధికి హేతుభూత మగుట ఇచ్చటి విశేషము. కనుకనే ఇది ఆములిన శృంగారమునకు బాటవేసినది.

క. "దామోదరపద భక్తిం
గామాదులఁ గెల్చినాఁడు గావున గరుణన్
దామీశుఁ డలుగఁ డయ్యెను
సామర్థ్యము గలిగి దోష సంగిన్ శృంగిన్" (ఆం. మ. భాగ. 1-458)

అని హరి భక్తిచేత తుచ్ఛమైన కామక్రోధాదులు జయింపఁ బడునని శృంగిచే శపింపఁ బడిన పరీక్షిన్మహారాజును చిత్రించు సందర్భములో పోతనామాత్యుఁడు వచించెను. కనుక జీవేశ్వరైక్యరూప మగు భక్తి ఉన్నచోట తుచ్ఛమైన కామమునకు తావులేదనియు గోపికాంగనల వర్ణనలలో అక్కడక్కడ శృంగారఖండికలు గోచరించు చున్నవనఁగా ఆ శృంగారములో మాలిన్యము లవలేశమ్మైన లేదనియు స్పష్టపడును.

క. "కామింపఁదగును సర్వముఁ
గామించియునైన, ముక్తిఁ గామించి తగన్
లోమించి పరమ పురుషుని
నేమించి భజింపఁదగు నిపుణుండధిపా!" (ఆం. మ. భాగ. 2-39)

ని తత్త్వమార్గనిర్దేశవిషయమున పోతన ఒక నిర్మల మయిన సూత్రమును ప్రతిపా దించెను. భక్తిభావబంధురుఁడై, భగవంతుని సేవించువాఁడు అసలేమియు కామిం పఁగూడ దనియు, ఒకవేళ కామించినచో ఒక ముక్తిని మాత్రమే కామింపవచ్చు ననియు నిందు ప్రతిపాదించెను. అనఁగా పురుషోత్తముఁ డగు నారాయణునితో ప్రకృతి మాతృఁడగు భక్తుఁడు చేయు దివ్యదాంపత్యమే భక్తి యని వెల్లడి యగుచు. ఇక నిందులో షట్కోద్రేకభరితము ఐన ఐహికశృంగారమూలికి మెట్లు చోటు కలిసి కొనును ?

గజేంద్రరక్షణకై వైకుంఠము నుండి నారాయణుఁడు వచ్చునప్పుడు 'వివాద ప్రోత్థిత శ్రీకుచోపరిచేలాంచలము ఐన వీడఁడని " (ఆం. మ. భాగ. 8-98) వర్ణించెను. మరియు నా వెనువెంటనే వచ్చు లక్ష్మీదేవిని వర్ణించునప్పుడు వైవర్ణ్య పలతో విరోధము లేకుండ -

"తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో,
శాటీ ముక్త కుచంబుతో, నదృఢ చంచత్కాంచితో, శీర్ణ లా
లా టాలేపముతో, మనోహర కరాలగ్నోత్తరీయంబుతో,
గోటీందు ప్రభతో, నురోజభర సంకోచ ద్విలగ్నంబుతోన్"
(ఆం. మ భాగ. 8-102)

అని చెప్పెను. ఈ పద్యములో కుచశబ్దము ఉన్నంత మాత్రమునుతో శృంగారము మలినము కాదు ఏల యనఁగా విష్ణుమూర్తి వచ్చునపుడు అతనకు ముందు తాను లక్ష్మీదేవితో వేసిన పందెముమ బట్టి ఆమె పైటకొంగును పట్టుకొనుటలో ఆమె హరికి అనపాయిని అను ఉత్కృష్టవైష్ణవసిద్ధాంతము వ్యక్తపరచుటకె యని బోధ పడును. పైగా లక్ష్మీదేవి పరదేవత కదా! పోతన్నగారు అమె కుచములను వర్ణింపవచ్చునా అని ఒక ఆక్షేపణమున్నది. ఇది అనాలోచితము ఐన ఆరోపణము. ఏల యనఁగా లక్ష్మీదేవి జగజ్జనని. భక్తుఁడు నిరంతరము ఆతల్లి కొనమే ఆరాటపడు శిశువు వంటివాఁడు. మరి శిశువునకు కావలసినది స్తన్యమే కదా! ఇట్లు చూడఁగా ఇందు మాతృభావనయే గోచరించును గాని మలిన శృంగారము కాదు. ఇట్టే పుంభావ భక్తి స్వరూపుఁడగు ప్రహ్లాదుని వర్ణించుచు -

"కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావన సేసి మరలువాఁడు" (ఆం. మ. భాగ. 7-115) అని చెప్పెను. కనుక ఇట్టి ఏ సందర్భములో నైనను భక్తునకు మానుష స్త్రీలైనను దివ్యస్త్రీలైనను తల్లిగా గోచరింతురే గాని కామ తృప్తికి స్థానముగా గోచరింపరు.

పురుషార్థములు నాల్గింటిలోను అన్యోన్యతయులు మిక్కిలి శ్రమైక సాధ్యములు. అయినను మొదటి దగు ధర్మము లేని తరువాతి యే పురుషార్థము చేపడదని శాస్త్ర ముద్ఘోషించుటే గాక మానవుని అనుభవము కూడ చాటుచున్నది. సుఖార్థాః సర్వ భూతానాం మతాస్సర్వ ప్రవృత్తయః సుఖంచ నవినా ధర్మం తస్మాత్ ధర్మపరోభవేత్ అని శాస్త్రము లోకమును హెచ్చరించుచు ధర్మము పట్ల ప్రేరేపించు చున్నది. పనుల సాఫల్యముకొఱకు గాని, ధనయశఃపదవీముఖ్యవివిధప్రయోజనముల కొఱకు గాని, లోకములో ప్రయత్నించి విఫలులైన వారినిగూర్చి జనులు "వారికి కలిసి వచ్చుటలే" దను కొందురు. ఇచ్చట కలిసి వచ్చుట లేదనఁగా ధర్మబలము లేదనియే అర్థము. కనుకనే పురుషార్థములకైనను ధర్మమే ముఖ్యము. అసలు ధర్మసహితమైననే గాని అర్థకామములకు పురుషార్థత్వము సిద్ధింపదు కూడను. ధర్మరహితమైన అర్థము చౌర్యముతోను, కామము వ్యభిచారముతోను సమానము లగును. కనుకనే దానికి పురుషార్థము లన్నింటిలోను ప్రథమస్థానము సంపాదింపఁబడినది.

అట్టి ధర్మానుబద్ధమైన తృతీయ పురుషార్థము లౌకికవస్తూద్దిష్ట మగుచో కామమే అగును, అలౌకికపదార్థనిబద్ధ మగుచో భక్తి యగును. కామములో దైహికానందమాత్రప్రాప్తినిధ్యము గల అంశ మెల్లప్పుడు, జంతువులకు కూడ సమానమే. కనుక తావన్మాత్ర మగు దానిని జాంతవము లేక పాశవికము అని నిరసించిరి. అందులో దైహికానందము పాలు నామమాత్రమై జగత్కల్యాణము పాలు ప్రధాన మగుచో అప్పుడు దానిని పురుషార్థ మనిరి. "కడు నిలఁ బురుషార్థపరుఁడు గావలె" (సుమతీ శ. 13) నని సుమతీ శతక కారుఁడు హెచ్చరించినది ఈ ఆశయ ముతోనే. ఎంత పురుషార్థ మయినను అది కామమన్నంతనే ధార్మికులు, మహర్షులు, సనాతనులు మొదలగు మహనీయులు పెదవి విరచుట కందలి తనూసంపర్కమే కారణము. అది విశ్వావనేప్సితస్పర్శ కూడ నుండుట కవకాశము లేని మానవేతర

ప్రాకృతప్రాణుల కన్నిటికిని సమానమగుటచే దానికి బ్రహ్మనిష్ఠ లెప్పుడును ప్రాధాన్య మీయరు.

కనుకనే పరిశేషన్యాయమున తృతీయపురుషార్థ మందలి లౌకికవస్తుసంబంధము పరిహరించి తత్స్థానమున అలౌకికపరబ్రహ్మసంబంధము ననుసంధించి అది అప్పుడు పరమపవిత్ర మగుటచేతను అపరిచ్ఛిన్నమహానందకంద మగుటచేతను దానిని భక్తిగా శిరోధార్య మొనర్చుకొని సేవించి తాము తరించి పరులను తరింపఁజేసిరి.

పురుషార్థములు నాల్గింటిలోను మొదటి రెండును కారణములు కాగా చివరి రెండును ఫలములు. ఆఫలములలో కామము సంసారపోషకము కాఁగా మోక్షము సంసారనాశకము. కామ మందలి ఈ దోషమును పరిహరింపుటకే అనఁగా దానిని కూడ పరిశుద్ధముఁజేసి సర్వజన సేవనీయము చేయుటకే అందలి లౌకికాంశను అలౌకికప్రత్యామ్నాయప్రక్రియచే భక్తిగా సంస్కరించిరి. మొదటి రెండును చివరి రెంటికిని కారణము లనుటలో మరింత విశేషించి చూడగ మొదటి జంటలో కూడ కార్యకారణసంబంధము లేకపోలేదు. మొదటి దగు ధర్మము రెండవదగు నర్థమునకు కారణము. రెండును కలిసి కామమునకు కారణము. ఇట్లు చూడగా అర్థము ధర్మమునకు ఫలమై కామమునకు కారణ మగుచున్నది. కనుక డుండుభము వలె అది ఉభయతోముఖమై ఒకటి ఆదియు ఒకటి నిధియునై విలక్షణముగా ద్విపాత్రాభినయము చేయుచున్నది. ఇఁక మొదటి దగు ధర్మము లేనిచో చివరి దగు మోక్షము లేదు. కనుక మోక్షము ఫలకోటిలోనికే చెందును. ఒక విధముగా చూచినచో మోక్షమునకు మొదటి మూఁడు పురుషార్థములు కారణములే యగును. ఏల యనఁగా ధర్మము లేనిదే ఏ పురుషార్థమును లేదు. అర్థము లేనిచో ఏరంగమందును అడుగు ముందుకు సాగదు. ముఖ్యముగా ఉత్తమవేదాంతగ్రంథపఠనాలోకనము, గురు శుశ్రూష, దేహధారణ మాత్రోపయోగి వస్తు సేవనము మొదలగు నే యాత్రమునకైనను అర్థమపరిహార్యమే గనుక దాని కారణత్వసామగ్రి దాని కుండనే యున్నది. ఇఁక మూఁడవదగు కామమున్నచో అది ఎట్లో ఫలమే యగుటలో సందేహము లేక పోయినను అందలి లౌకిక ప్రసక్తిని దూరీకరించి తత్స్థానమున బ్రహ్మ ప్రసక్తిని తెచ్చి దానిని భక్తిగా సంస్కరించిన వెనుక ఆ భక్తి క్రమశః పరిపుష్టమై, సఫలమై, జ్ఞానోత్పాదనకు హేతువై ఆ జ్ఞానము మోక్షములో సాక్షాత్కార మగును గనుక

తృతీయ పురుషార్థము కూడ తురీయ పురుషార్థమునకు హేతు సామగ్రిగా పర్యవసించుటలో సందేహమునకు తావు లేకపోయినది. కనుక ధర్మము లేనిచో ఏ పురుషార్థమునకు పురుషార్థత్వప్రసక్తియే కానరాకుండు కతన దానికి ప్రథమస్థాన మీయఁబడినది. అదియే మానవులకు జంతువులనుండి వేరుజేసి ఉన్నతస్థానమున నిలబెట్టినది. "ఇది నాధర్మము, కర్మము న్యాయము లేని బ్రతుకొక బ్రతుకేనా, నీకిది ధర్మముగా కానబడు చున్నదా? ఇట్లు చేయుట మన ధర్మము, ధర్మము విడిచి నడచి నిందపాలు కానేల?" ఈ మొదలగు నన్ని పలుకుబడులలోను సమానముగ నున్న ధర్మ శబ్దమునకు పురుషార్థస్పర్శ సమానముగను, అసమానముగను గోచరించుచునే యున్నది. అది హేతువుగా గల కామము తొలుత కామ పురుషార్థమే అయి జగద్విచ్ఛిన్న గతికి హేతుభూతమై పిమ్మట అంతఃఖిన్న సంగముతో ప్రవర్తిల్లినచో పతనమగుట తప్పదు గనుక దానినుండి లౌకిక స్పర్శను తీసి భక్తిగా పరిణమింపఁజేసి దానిని మోక్ష పురుషార్థమునకు తద్జ్ఞులు జోడించిరి. మోక్ష గ్రంథమగు భాగవతములో ఆ భక్తి బహుముఖీనముగా ప్రపంచింపఁబడుటచే భక్తి-శృంగారములకు అవినాభావసంబంధ మేర్పడుట తటస్థించి నిరాక్షేపణీయముగా నిర్వర్తిల్లినది.



# పోతన ఆంధ్రమహాభాగవతమున భక్తిశృంగారములు

## 11. పోతన నిర్మించిన పారమార్థికమార్గము

ఆధ్యాత్మిక రంగములో అర్థము, అనర్థము అని రెండు విశేషములు కలవు. అర్థము అనగా బ్రహ్మైక్యముకొఱకు శ్రవణమననిదిధ్యాసనాత్మకముగ ఎడతెగని తీవ్ర ప్రయత్నము చేయుట. అనర్థ మనగా ఈశ్వరచింతన స్పర్శ లేకుండ కేవలము దారసుతాదిపోషణముతో, ఉదరనిమిత్తకృతబహువేషధౌరంధరములతో, లౌకిక వృత్తి నిర్వహణములో తల మునకలుగా నెలకొని యుండి దృశ్యమే సత్యమ ని నమ్మి సకలకార్యకలాపములకొఱకు రాగద్వేషములతో ప్రవర్తిల్లి జరారోగాది క్లేశ పీడితుడై మరణించి కర్మానుసారముగ మరల పుట్టి యిట్లే మృత్యురూపసంసార ప్రవాహములో తగుల్కొని అజ్ఞానిగనే క్రిందు మీదులఁబడుట.

ఇక అర్థములో నిదిధ్యాసనావస్థను దాటిన పిమ్మట తైలధారవలె అవిచ్ఛిన్నముగ ఈశ్వరచింతనము చేయుచు అనావృతజాగ్రత్ప్రవృత్తియై, బ్రహ్మాకారాకారితచిత్తవృత్తియై బ్రహ్మదాయము నొందుట. ఈ చరమ స్థితిని పరమార్థ మందురు.

పోతనామాత్యుడు అనర్థము, అర్థము, పరమార్థము అను నీ మూడింటి స్వరూపస్వభావములను సమగ్రముగ జీర్ణించుకొని తత్త్వసంప్రదాయానుసారముగ తత్తత్పాత్ర చిత్రణమున నుపక్రమించు నప్పుడు కవితా మర్యాదానుసారముగ, రసావిష్కార సముచితముగ పర్యవసానతాత్పర్యముతో ఎచ్చటను ఎట్టి ఆక్షేపణకు తావులేని విధముగ చిత్రించుచు వచ్చెను. హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు, వృత్రుడు నరకుడు, కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, పౌండ్రక వాసుదేవుడు, కలియవనుడు, రావణుడు మున్నగు నధర్మప్రధానులైన పాత్ర

లను వ్యక్తీకరించునపుడు వారి జీవితములలో పెనవైచు కొన్నట్టియు, జగతికి సంక్రమించి నట్టియు అనర్థము లౌచితీపరిపాకసమన్వితముగా రౌద్ర, భయానక, బీభత్స రసస్ఫోరకముగా నావిష్కరించి తన అప్రతిహతరసనిష్పాదనసామర్థ్యమును ప్రత్యక్షీకరించెను.

భీష్ముఁడు, విదురుఁడు, సంజయుఁడు, కుంతి మున్నగు సాత్త్వికమూర్తుల చరిత్రలను నిబంధించు పట్టున, సముచిత సంయమనముతో ఆయా పాత్రలను నిర్వహించు పట్టున వారు లోకమునకు అనుసంధించిన సుఖశాంతి రూప మగు అర్థవిశేషమును పరమ జాగరూకతతో నావిష్కరించుచు తమ తమ జీవితములలో సందర్భానుసారముగా ఎప్పుడైనను శాంతభిన్నరసస్పర్శకు తావీయ వలసి వచ్చినచో వానిని అంగములుగనె పరిగణించి జీవిత మహార్థ మగు శాంతి సౌమనస్యపోషకత్వము నావిష్కరించుటలో పోతనామాత్యుఁడు అనిందనీయ మగు కృతార్థత కాలవాలుఁడయ్యెను. వారు జీవితములలో అప్పుడప్పుడు గావించిన ఖండఖండము లగు కర్తవ్యములు ఆశయార్థప్రతిఫలనసమర్థములు కాకుండుటకును జీవిత మంతయు నొకే మొత్తముగా పరిగణించినచో తన్మహాశయప్రత్యక్షీకరణసమర్థమై లోకమునకు ఆదర్శప్రాయమై ధన్యతా వాచక మగుటలో సహకరించు నట్లు ఈ కవి మూర్ధన్యుఁడు చిత్రించి తాను ధన్యుఁ డగుటయే గాక చదువరులను కూడ ధన్యుల నొనరించెను.

ఇఁక పరమార్థవిషయములో ఆంధ్రవాఙ్మయరంగమున పోతనగారి స్థానము అప్రతిద్వంద్వ మైనది. జీవితపరమార్థ మనఁగా భగవదైక్యమును సాధించుటే దానికి సాధనము భగవదారాధనమే. అది చిత్తైకాగ్రతచే నుపపన్న మగును. దానికే భక్తియనియు నామాంతరము. భక్తి యనఁగా క్షణమాత్ర మైనను భగవద్వియోగమును సహింపరాని తనము. అది లౌకికముగా పరిశీలించినచో ప్రియుఁడు ప్రేయసీ వియోగము క్షణకాలమైనను సహింపరాని తనమును స్ఫురింపఁజేయును. ఇది భౌతికము. అది అభౌతికము. ఇది స్మృతిహాసాదివైహితాచవ్యాపారములతో వేగిపోవుచు ఎడబాటును అపరిహార్య మొనర్చును. అది ఇట్టి లౌకికక్షుద్రప్రతిబంధకసామగ్రీసమాలంబములతో సంబంధము లేనిదై నిరంతరబ్రహ్మానందభావానుభూతిప్రదమై సమస్తము తనలో నంతర్భవింపుకొని సంసార నాటకమునకు తెరదించి తానె శాశ్వతముగా శేషించును.

ఇట్లు పరిశీలింపగా భక్తికి శృంగారముతో భావనా మాత్రముగ నైనను గల ఈ అవిచ్ఛేద్యమగు బాంధవ్యమును పురస్కరించుకొనియే పోతనామాత్యుఁడు తన భాగవతములో ఈ రెంటికిని సముచితసమ్మేళనప్రక్రియను సాధించి ఆకృత బుద్ధులచే యౌవనానుభవస్మారకముగా ఇట్లు రచించెనేమో యనియు, కృత బుద్ధులచే పురుషార్థపరిపాకపరిమళోద్గార మైన పరమార్థవైభవమును పరమనైపుణ్యముతో పుణ్యమూర్తులకు సాక్షాత్కరింపఁజేసె ననియు వాకొనఁబడినాఁడు. పాండురోగికి దుస్సహమగుట ఎండదోషము కాదు కదా!

కర్మబద్ధుఁడైన జీవుఁడు జననాంతరవాసనాబలముచే సత్సంగత్యాదినిమిత్తములను పురస్కరించుకొని అప్రాకృతపురుషాలింగనమునకై అనఁగా ఈశ్వర శృంగారమునకై తహతహ లాడును. ప్రహ్లాదాదిభక్తులలో ఎవరి చరిత్రను పరామర్శించినను ఈ తహతహపాటు స్పష్టముగ గోచరించును.

కనుక పోతన భక్తి - శృంగారములకు మేళవించి స్థాపించిన పరమార్థము జీవబ్రహ్మైక్యానుసంధానముకన్న వేరు కాదనుట నిర్వివాదాంశము.



# పోతన ఆంధ్రమహాభాగవతమున
# భక్తిశృంగారములు

## 12. అనుకరణలు - అనుసరణలు

కవిత్వ మనునది ఆకస్మికముగా ఆకాశమునుండి ఊడిపడు వస్తువు కాదు. ఏ కవికైనను తత్పూర్వకవికృతకావ్యసామగ్రి ప్రేరక మగును. ఇట్లు వెనుకకు పోవుచో - లౌకిక కవిత్వ మనుటచే దీనికి ఆది ఉండును గనుక - సంస్కృతములో నేమి ఆయా దేశభాషలలో నేమి. ఆదికవులకు ప్రేరక సామగ్రి ఎచ్చట నుండి వచ్చును అని సందేహము కలుగవచ్చును. ప్రపంచ మంతటి వాఙ్మయమంతటిలోను సంస్కృతమే ప్రాచీనము గనుకను, ఆ సంస్కృతములో రచింపఁబడిన రామాయణము కన్న ముందు ఈ కావ్య మున్నదని చెప్పగల ధీరుఁడు నాకు ఇంతవఱకు కానరాలేదు గనుకను ఆ రామాయణ మాదికావ్యము, ఎతత్కర్త యగు వాల్మీకి మహర్షి ఆదికవియు అనుటలో విప్రతిపత్తి లేదు గనుకను ఆయన ఎట్టి అనంతర కవిప్రపంచమునకు ఉద్బోధకసామగ్రి అయిన దనుకొనుటలో పొరపాటు లేదు. కాని మరి ఆ వాల్మీకి మహర్షికి ఉద్బోధకసామగ్రి ఏమున్నది యుండును ?

ఆయనకు తత్పూర్వ మెట్టిది కావ్యప్రపంచము నుండియే యుండవలెను. మరి అంతకు ముందు కావ్యమే లేదు కదా! లేకేమి? జగత్తే మహాకావ్యము. తన్నిర్మాత యగు భగవంతుఁడె మహాకవి. వేదములందును ఇతిహాసపురాణము లందును "కవిం పురాణమను శాసితారమ్" అను రీతిగ భగవంతుఁడు కవిశబ్ద వాచ్యుఁడై ప్రస్తుతింపఁబడుట సకల విద్వన్మనోజ్ఞమై జగత్ప్రసిద్ధమై వివాదాతీతమనే యున్నది.

కల్పాంతరప్రవృత్తి పునస్సృష్టిక్రమమునందు సంభవించిన [illegible] కర్మవాసన

లను బట్టియే సృష్టి కార్యక్రమము కొనసాగును. పూర్వపూర్వకల్పజీవరాసుల కర్మ వాసనలు ఉత్తరోత్తర జగన్నిర్మాణమునకు ప్రేరక సామగ్రి యగుటచే అనంతవైవిధ్య శోభిత మైన ఈ సృష్టి లోచనగోచర మగుచున్నది. ఆ వైవిధ్యమును బట్టియే ప్రాణి కోట్ల ప్రవర్తనములో అనంత మగు పరిణామములు పొడకట్టు చున్నవి. ఆ ప్రవర్తనముల వైలక్షణ్యమే జగన్నాటకప్రక్రియారూపముగా సాక్షాత్కరించు చున్నది. కావ్యము జగత్తునకు అనగా సమాజమునకు ప్రతిరూపమే గనుక ఆదికవియు ఈ జగత్తునే తన కావ్యముగా కొని చర్మాచూపమున గోచరించు లోకమును అక్షరరూపమున తన గ్రంథ మందు సాక్షాత్కరింపఁ జేసెను. ఈశ్వర సృష్టి యందలి స్వభావ పరిణామ మంతయు బంగారు కలములో చిత్రీకరింపఁబడినట్లే తదనంతరసమూహములో రత్నమంచిత్రానుకరణపరిశోభిత మైన పూర్వకవి ప్రవృత్తి స్వీకృతమై పౌనిత్యపరిశోభితమై అందందు పొందుపరుపఁబడినది.

ఇట్లు పొందగా దపసులుని సృష్టికార్యప్రభావము వాల్మీకి సంయమీంద్రుని పైఁబడినట్లే తత్ప్రవృత్తి రత్నమగు రామాయణప్రభావము నన్నయాదికవులపైనను, నన్నయాదుల ప్రభావము పిమ్మట వచ్చిన తిక్కనాదులపైనను ప్రసరించి ప్రసరించి పోతన కాలము నాటికి అతనిలో స్థిరమైన ఈ కవి ప్రపంచపు నిర్మాణనైపుణ్య మంతయు తన భాగవతములో స్థానాస్థానవినివేశితమై రసజ్ఞమనోరంజకముగా రూపు దిద్దుకొనెను.

**నన్నయ :** పోతనకు నన్నయ పైనను, తిక్కన పైనను అపార మగు గౌరవము గలదు. పూర్వకవుల చెప్పని భాగవతము నాంధ్రీకరింప కుండుట పోతన తన పుణ్య ముగ పేర్కొనినాఁడు. అంతేకాక అవతారికలో నన్నయాదులపట్ల అపారభక్తి ప్రపత్తులు ప్రదర్శించినాఁడు. "ఆంధ్ర కవితా గౌరవజన మనోహారి నన్నయసూరి" (ఆం. మ. భాగ. 1-10 ప.) అని నన్నయను నోరార కొనియాడినాఁడు. నన్నయ కవితలో శబ్దమునకు గౌరవము మెండు. తిక్కన కవితలో అర్థమునకు గౌరవము మెండు. ఈ రెండు శక్తులు మెండుగా దండుకొని పోతన కలదగల కవిత లల్లినాఁడు.

**నన్నయ :** దమయంతి నలుని అన్వేషించుచు అడవులలో తిరుగు సందర్భమున-

**పోతన :**

క. "హల్లక విసరుహ సరసీ
కల్లోలోత్ఫుల్ల యూథికా గిరిమల్లీ
మల్లీ మరువక కురవక
సల్లలితానిలము వలన సంతుష్టుండై (భాగ. 9-601)

వ. దుష్యంతుండు వచ్చె నవసరంబున. (భాగ. 9-602)

క. ఇందిందిరాళి సుందరి
యిందిందిర చికుర యున్నదిందింద శుభం
బిందిందువంశ! యనుక్రియ
నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్. (భాగ. 9-603)

క. ఇంపేర్చ కణ్వమునికిని
వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం
బొందుగ ననువదలుము చా
నందఱ నందంద నిలిపి యటచని మ్రోసెన్" (భాగ. 9-606)

మొదలగు వానియందు భావ సాదృశ్యము కానవచ్చును.

**శివకవులు :**

నన్నయ తరువాతి కాలములో శైవవైష్ణవములు విజృంభించి పరస్పర ద్వేషముతో నిర్మాణ స్పర్ధనాదులు విసర్జించి యుద్ధసన్నద్ధులై ప్రవర్తించిరి. అందు వీరశైవగాహితలైన పండితులు శివకవులుగా ప్రసిద్ధిఁ గాంచిరి. శివకవులు నిర్వహించిన కవిత్వము ఒక మహోద్యమము. వీరు సంప్రదాయవిధేయరహితులు. శైవసంప్రదాయము పేరుతో వీరు విష్ణువు మీఁదనే గాక కవితా సంప్రదాయము మీఁద కూడ ధ్వజమెత్తి ఒక విలక్షణ మగు ప్రయోజనమును సాధించిరి. మాటలు తేటలుగా చెప్పుట ఛందస్సు, వ్యాకరణము, సంప్రదాయము వీనిని ఉల్లంఘించుచు

కవితా స్వైరవిహారము గావించుట. ఇది పూర్తిగా మేలు చేయలేదు. పూర్తిగా కీడును చేయలేదు. అట్టి శివకవుల కవితా ఫణితులను గూడ పోతన కొన్ని భక్తి మయ సన్నివేశములలో ననుకరించినాఁడు.

## 2. మల్లికార్జున పండితారాధ్యుఁడు :

పండితారాధ్యుఁడు శివతత్త్వసారములో "భక్తివలననే ముక్తి కలుగును గాని కేవల జ్ఞానము వలన కలుగదు" అని ఈ క్రింది విధముగా తెల్పి యున్నాఁడు.

క. జ్ఞాని యగువాఁడు భక్తి వి, హీనుండగునేని ముక్తి చెందఁడు.

ఇట్లే "పోతనయుఁ" జెప్పి యున్నాఁడు.

ఉ. "వారిజభవుఁ గేశవు నసురుఁ దరించువాఁ గ 'ధర్మతత్త్వభే
దరిణతి సాధనంబగు స్వభావముఁ దాల్చిన యట్టి మత్స్యలా!
సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై 'తదంఘ్రిపం
కరుహము లర్థియోఁ గొలువఁ గానరుఁ దాంబప తత్పదంబునన్"

(భాగ. 3-506)

## 3. పాల్కురికి సోమన ;

ద్వి. "క్షీరాబ్ధి లోపల క్రీడించుహంస
కోరునే పడియల నీరు ద్రావంగ?
జూతఫలంబులు సుంచించు చిలుక
జొత్తి బూరుగు మ్రాని పండ్లు గన్గొనునె?
రాకామల జ్యోత్స్నఁ ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీఁకటిఁ ద్రావ?
విరిదమ్మి వాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలి విరుల"

(బస. పు. 8 ఆశ్వా.

సీ "రాకామల జ్యోత్స్నఁ ద్రావిన చెలు గొన్న, నా చకోరంబుల కరుచి యగునె?
సహకార పల్లవ చయములు దొరికిన, జగతి కోయిలకును చప్పనగునె?
క్షీరాబ్ధి కోపల గ్రీడింపఁ గలిగిన, భువిరాజహంసకుఁ బల్లసగునె?
విరిదమ్మి వాసన వెగ్గి మంచిన గోర్లు, షట్పదములకు నాస్వాదమగునె?

ఆ.వె. బహుళతర దయార్ద్రి భావ పరిభావన
మహిమఁ దనరు జంగమంబురాగ
నతుల భక్తి పరుల కావళ్యకంబును!
పరిహృతాభిబంగ బసవ లింగ!" (చను. సా. 158)

పై పద్యములను "పోతన" ఈ క్రింది విధముగా ననుసరించెను. విష్ణు భక్తి వి రుచి మరిగిన వాఁడు ఇతరమును ఆదరింపఁ డని చెప్పు సందర్భముగో -

సీ. "మందారమకరందమాధుర్యమునఁ దేలు, మధుపంబు వోవునే? మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁ దూఁగు, రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాం పల్లవ ఖాదియై చొక్కు, కోయిల సేరునే? కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక, మరుగునే? సాంద్ర నీహారములకు

తే. "అంబుజోదర దివ్య పాదార వింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుత గుణశీల! మాటలు వేయునేల?" (భాగ 7-150

సీ. "సరదాగమ మేఘ నిర్ముక్త పయః పాన, చాతకం బేఁగునే చౌటి పడెకుఁ
బరిపక్వ మాకంద ఫలరసంబులు గ్రోలు, కీరముల్ చనునె ధుత్తూరములకు
ఘన రవాకర్ణ నోత్కలిత మయూరముల్, గోరునే కటన ఝిల్లీ రవంబుఁ
గరికుంభ పిశిత సద్గ్రాసమోదిత సింహ, మరుగునే శశక మాంసాభిలాషఁ

తే. బ్రిదివిమలాకార! భవదీయ పాదపద్మ
యుగ సమాశ్రయ నైపుణోద్యోగ చిత్త
మ్మనఁ జేరనె తన కుపాస్యంబు గాఁగ
భక్తమందార! దుర్భర భవ విదూర!" (భాగ. 10. ఉ. 257)

తిక్కన :

ఆంధ్ర కవులలో పోతనకు తిక్కనతో మిక్కిలి దగ్గర సంబంధ మున్నది ఆ సంబంధము వారు సమన్వయము గావించుకొన్న అద్వైత సిద్ధాంతమునకు సంబంధించినది. శైవవైష్ణవుల పరస్పర చీత్కారములతో నాటి జాతి నీతి దప్పి యున్నది. పయిగా తురకల కఱకు కత్తుల క్రింద వత్తలై నీఱు గప్పి యున్నది. తిక్కన హరిహరాద్వైతము స్థాపించి ప్రవక్త యయ్యెను. పోతన యను నీశ్వరధ్యానము గావించుచు శ్రీరామచంద్రుని సాక్షాత్కరింపఁ జేసికొని అద్వైత సిద్ధాంతమును తన యందే సమన్వయ పరచి ప్రదర్శించెను. తిక్కన అద్వైతమును ప్రదర్శించిన జ్ఞాని పోతన అద్వైతమును సమన్వయ పరచుకొన్న భక్తుఁడు. తిక్కన జ్ఞాననేత్రముచే సూత్రీకరించిన విషయమునే పోతన భక్త్యావేశముతో వ్యక్తీకరించెను. జ్ఞాని యగుటచే తిక్కన చూపు నిశితముగ నుండును. భక్తుఁడగుటచే పోతన చూపు చల్లగా నుండును. తిక్కన బుద్ధివాది. పోతన హృదయవాది. తిక్కన బుద్ధిచే సిద్ధ స్ఫూర్తి వహించిన రహస్యమే పోతన భావావేశ రసగంగా తరంగితమై చూపరులఁ గన్పట్టును.

తిక్కన :

సీ. "నెత్తమ్మి రేకుల నెత్తావి వనము దెచ్చి, యప్పునఁ బోసినట్లుండు మొదటి
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి, కుప్పలు చేసినట్లొప్పు మెఱసి
చందురు నునుఁ గాంతి కందెర్చి కూర్చి బా, గునకుఁ దెచ్చిన యట్లు
కొమరు మిగిలి
యళికులంబులకప్పు గంధుండరయను దెచ్చి నారువోసిన భంగి నెసక మెక్కు-

తే. యంత్రపు తలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబును నిట్టున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు
గాదె యీతిప్పు లేటికిఁ గమలవదన" (భార. విరా. 2-52)

పో త న :

సీ. "పాలమున్నీటిలోపలి మీఁది మీఁగడ, మిసిమి జిడ్డునఁ జేసి మేనువడసి
క్రొక్కారుమెఱుఁగుల కొనల క్రొత్తళుకుల, మేనిచేగల నిగ్గుమెఱుఁగు సేసి
నాఁడు నాఁటికిఁ బ్రోది నవకంపుఁ దీఁగెల, నునుఁబోద నెయ్యంబు
నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకులఁబ్రొద్దునఁ, బొలసిన వలపులఁ బ్రోదిపెట్టి

తే. పసిఁడి చంపకదామంబు బాగుఁ గూర్చి
వాలు క్రొన్నెల చెలువున వాఁడి దీర్చి
జాణతనమునఁ జేతుల జిడ్డు విడిచి
నలువ యీ కొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు" (భాగ. 8-266)

తి క్క న :

సీ. "ప్రాణంబుతోఁగూఁగ రక్కసి చన్నుల, పాలుఁ ద్రావిన ప్రౌఢ బాలుఁడితఁడె
త్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె, చ్చించిన యాజెగ జెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగు కంసుఁదునిమి యాపని తండ్రి, పట్టంబుఁ గట్టిన
ప్రభుఁడితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల, కోర్కిఁ దీర్చిన రసికుండితండె

గీ వెన్నలును గోపికా చిత్తవృత్తములును
నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె
ప్రతి శిరోభాగములుఁ దన సుభగ చరణ
సరసి జామోదమునుఁ గూర్చు చతురుఁడితఁడె" (భార. ఉద్యో. 3-160)

పో త న :

సీ. "వీఁడఁటే! రక్కసి విగతజీవిగఁ జన్నుఁ, బాలుఁ ద్రావిన మేటి బాలకుండు
వీఁడఁటే! నందునివెలఁదికి జగమెల్ల, ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
వీఁడఁటే! మందలో వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడఁటే! యెలయించి వ్రేతల మానంబు, చూఱలాడిన లోకసుందరుండు

తే. వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు" (భాగ. 10-1-1248)

తి క్క న :

సీ. "వరుసఁ గడ్రి ముద్దియ వదనంబుపైఁ బాఱి, తివుటమైనసుఁగాంతి తీపు గ్రోలు
సుందరీ రత్నంబు చూపు మనోరమ్ము, నడుగుల యొప్పుపై నల్లనడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైఁ దీవఁ, గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు
వెలది కటాక్షముల్ విభునిపైఁ గ్రిమమున, నెగసి మోమునఁ జొక్కి
మడిగివచ్చు

తే. పొంకారుపుల లేఁజెమటల నూని వ్రేఁగు
పడిన చాడ్పున నవయవ భంగులందుఁ
దగిలి మఱపునఁ బడయు నిద్దఱు విశాల
నయన దీప్తులు నెఱకువ బయలు పడఁగ" (భార. విరా. 5-395

పో త న :

సీ. "కలికి చేష్టలు భావగర్భంబు లగు చున్న, బ్రియుమీఁది కూరిమి వెగ్గలింపఁ
దిదపిద నై లజ్జ మదిఁ బవనిచ్చినఁ, జెలిమేనఁ బులకలు చెక్కులొత్త
మదనాగ్ని సంతప్త మానస యగుటను, గురుకుచహారవల్లరులు కందఁ
జిత్తంబు నాయకాయత్తమై యుంటను, మెఱుమాట లాడంగ మఱపు గదుర

తే. కేళీవిహార లీలలు గీలుకొని ము
దంబుఁ బొందని తలఁపును దలఁపుగాదు
మాధవ స్తోత్ర ఘన సుధా మధుర రసముఁ
గ్రోలకుండెడు జిహ్వయు జిహ్వగాదు" (నృ. పు. 5-32)

పోతన :

సీ. "కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు-
శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి" (భాగ 7-169

ఎఱ్ఱన :

ఆ. "[illegible] నిద్ర గూరిన యప్పుడు
మేలుకొనిన యప్పుడు మెలగినపుడు
విష్ణు కీర్తనంబు విష్ణు చింతయు గాని
పలుకఁడెందు బుద్ధిఁ దలఁపఁడెందు" (నృ. పు. 3-160)

పోతన :

శా. "పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాసలీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా !"
(భాగ. 7-128)

ఎఱ్ఱన :

సీ. "కలఁడు మేదిని యందుఁ గలఁ డుదకంబుల గలఁడు వాయువునందు
గలఁడు వహ్నిఁ
గలఁడు భానునియందు గలఁడు సోమునియందుఁ గలఁ డంబరంబునఁ
గలఁడు దిశలఁ
గలఁడు చరంబులఁ గలఁ డచరంబులఁ గలఁడు బాహ్యంబునఁ గలఁడు లోనఁ
గలఁడు సారంబులఁ గలఁడు కాలంబులఁ గలఁడు ధర్మంబులఁ
గలఁడు క్రియలఁ

గీ. గలఁడు కలవానియందును గలఁడు లేని
వానియందును గలఁ డెల్ల వానియందు
నిఁక వేయును నేల సర్వేశ్వరుండు
కలఁడు నీయందు నాయందుఁ గలఁడు గలఁడు" (నృ. పు. 5—78)

పోతన :

మ. "కలఁడంభోధిఁ గలండు గాలిఁ గలఁడాకాశంబునం గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు తండ్రి! వెదకంగా నేల యీయాయెడన్"
(భాగ. 7-274)

౭. ఎఱ్ఱన :

ఆతఁగఁ బోయి నప్పుడసురాత్మజుఁ డంబుజనాభు నవ్యయుం
జాడుద మాదిదేవు పదపంకజ పూజలు సేసి భక్తి మై
నాడుద మచ్యుతైక శరణాగతులం గని కర్మబంధముల్
వీడుదమంచుఁ బల్కుఁగడు విస్మయ మందగఁ దోడిబాలకుల్"
(నృ. పు. 3-149)

క. "ఆడుదము మనము హరి రతిఁ
బాడుదమే ప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ
గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్" (భాగ. 7-248)

### 6. నాచన సోముఁడు :

నాచన సోముఁడు ఎఱ్ఱనకు సమకాలీనుఁడు ప్రత్యర్థి కూడ. ఈతఁడు నిరంకుశకవితానిర్మాణశక్తి యుక్తుఁడు. ఈతని రచన ప్రత్యక్షర మనోహరమై యుండును. ఒక్క పద్యముచే ఈతఁడు సమస్త ప్రపంచమును జయింపగల లోకోత్తర ప్రతిభాశాలి. కొన్ని సందర్భములలో ఇతని రచన నన్నయాదిమహనీయుల రచనలను కూడ త్రోసి రాజని తీసి వారవేయుచుండును. నాచన సోముని ఉత్తర హరివంశము ఆంధ్ర భారతికి అపురూప మగు నలంకారము. ఈతని రచన చెవిఁ బడి ముగ్ధుఁడు గాని సాహితీ ప్రియుఁడుండఁడు. పోతన గూడ ఈతని కవితా సుధా మాధురీ సౌభరీతులు గ్రోలి మేలి కవితల కేలికయైనాఁడు. ముఖ్యముగా నరకాసురసంహారఘట్టమున సోము నీతఁడు అనన్యుఁడై శరణుఁ జొచ్చినాఁడు.

నాచన సోముఁడు :

మ. "అరిఁ జూపన్ హరిఁ జూచుఁ జూచుకము లంగంబంద మందారకే
సరమాలామకరందబిందు సలిలస్యందమ్ము లందమ్ములై
దొరఁగన్ బయ్యెద కొంగొకింత దొలఁగన్ వక్త్రేశరాసారమున్
దరహాసామృత పూరమున్ గురియుచున్ దన్వంగి కేళీగతిన్"
(ఉ. హ. ప. 1-162)

పోతన :

మ. "పరుఁ జూచున్ పరుఁ జూచు సొంపు నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారముం
జరగన్ గన్నులఁ గెంపు సొంపు బరఁగన్ జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్"
(భాగ. 10-2-178)

7. భాస్కరుఁడు :

నన్నయ తిక్కనాదుల ప్రక్కన చొక్కమగు సాహితీసింహపీఠిక నధిష్ఠించిన కవిరాజు హుళక్కి భాస్కరుఁడు.

ఉ. "నన్నయభట్టతిక్కకవినాయకులన్న, హుళక్కి భాస్కరుం
డన్నను, చిమ్మపూడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు, జేయవి రావిపాటితి
ప్పన్నయు నంతవాఁడ, తగునా యిటు బోసపు మాట లాడగన్"
(క్రి. రా. 38)

ఇట్టి ప్రథ చేపట్టిన కవి జెట్టి భాస్కరుఁడు. భాస్కరుని కవిత సుకుమారసుందర పదబంధురముగా నుండి పాఠకుని కెల్లప్పుడు హాయి గొల్పుచుండును. శబ్దాడంబరము జోలికి పోకుండ లలితపదజాలముచే కవిత లల్లిన కవితల్లజుఁడు. ఈతని శైలి అనాత మధురమై యుండును. ఇతని ప్రభావము కూడ పోతనపై లేకపోలేదు. ఇట్లే మల్లికార్జునభట్టు, త్రిపురాంతకుల కవితా ప్రభావము, రచనా చాతుర్యము పోతన రచనయందు గానవచ్చును.

భాస్కరుఁడు :

ఉ. "పుణ్యచరిత్రుఁ డత్రిముని పుంగవు వీడ్కొని రాముఁ డంచితా
గణ్య గుణాభిరాముఁ డుపకంఠము నంజని కాంచె దండకా
రణ్యము సిద్ధసంయమి విరాజిత చారుతపోనుజాత స
త్పుణ్యము నిర్మలాంబుపర పుష్కర పూర్ణ సరోవరేణ్యమున్"
(భా. రా. అర. 1-2)

పోతన :

ఉ. "పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హ లా
వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము సల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రిగణ్యమున్" (భాగ.9-267)

**8. మల్లికార్జున భట్టు :**

శా. "బాహు ద్వంద్వము మీఁదికెత్తి కడఁ గంబంబాగ్ని తప్పుండు మా
సాహారుండు జితేంద్రియుండు నతినిష్ఠాయత్తచిత్తుండు నై
వ్యాహార ప్రవిముక్తుఁడై యుఁ సహస్రాబ్దంబు లేకచ్ఛల
గ్రాహిత్వం బెసఁగన్ మహాతపము గోకర్ణంబునన్ జేయఁగన్" (భా. రా.)

**పోతన :**

శా. "పాద ద్వంద్వము నేల మోపి పవనుం బంధించి పంచేద్రియో
న్మాదంబు న్మఱుగించి బుద్ధిలతకన్ మాఱాకు హత్తించి ని
ష్ఖేద బ్రహ్మపదావలంబన గతిం గ్రీడించు యోగీంద్రుమ
ర్యాద న్నక్రము విక్రమించెఁ గరి పాదాక్రాంత నిర్వక్రమై" (భాగ. 8-95)

**9. అయ్యలరాజు త్రిపురాంతకుఁడు :**

మ. "పరనారీ కుచకుంభపాళికలపై పాదాబ్జయుగ్మంబుపై
కరమూలాంతములపై కపోలతటిపై కంఠంబుపై కొప్పుపై
బరపుల్ వారెడు నాతలంపులు మిమున్ భావింపగాఁ జేసి స
ద్వ్రతసాక్షీశ్వర! నన్నుఁ బ్రోవు రఘువీరా! జానకీనాయకా!"
(ఒంటిమిట్ట రఘువీర శతకము - 69)

**పోతన :**

శా. "ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరం బుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నా పాయమే"
(భాగ. 8-591)

**10 శ్రీనాథుఁడు :**

శ్రీనాథుఁడు సామాన్యకవి కాఁడు. ఆంధ్రకవితాసారస్వతవ్యవస్థ పంద

రాచులను నాంధ్రికవులలో తాను జీవించిన కాలము, తాను కలము పట్టిన కాలము శ్రీనాథ యుగముగా ప్రసిద్ధిగాంచిన ధన్యజీవి శ్రీనాథుఁడు. పొట్టకూటికై రాజులు పెక్కుమందిని ఆశ్రయించి చరిత్రలో వారికి ఈనాటికి చెరగని స్థానము కై సేసిన వాఁడు శ్రీనాథుఁడు. ఇతఁడు చేసినది భాషాంతరీకరణమే అయ్యును కొంత మక్కికి మక్కిగా అనువదించు చున్నను తన వ్యక్తిత్వవిశేషముచేత కవిత్వమును రసరమ్యముగా ప్రౌఢసుందరముగా తీర్చిదిద్దెను. అతని శబ్దజాలము కఠినముగా నుండును. కాని అందొక లాలిత్యము తోడై వచ్చుచుండును. శ్రీనాథుని కవిత్వము వక్రోక్తి సమన్వితమై హరచూడా హరిణాంక సదృశమై సుకుమారసుందరభావసమం చితముగా సాగుచుండును. ఈతనికి పోతనకు పోలికలు చాలికలకంటె అనేక లక్షణములలో వైవిధ్యమే పొడగట్టుచుండును. పోతన తానెక్కడా కూడ శ్రీనాథుని పేరు తలపెట్టలేదు ఈతఁడు పోతనకు సమకాలికుఁడగుటలో విప్రతిపత్తి కూడ లేదు కొన్ని భక్తిమయ సన్నివేశములలో నీ కవిసార్వభౌముని కమనీయకవితా ప్రభావము కూడ పోతన కవిత్వముపై పడినట్లు కానవచ్చును.

శ్రీనాథుఁడు :

సీ. "శ్రీ భీమనాయకశివనామధేయంబు, జింతింప నేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్షమోహనమూర్తిఁ. జూడంగ నేర్చిన చూపుచూపు
దక్షిణాంబుధి తట స్థాయి పావన కీర్తి, చే నింప నేర్చిన చెవులు చెవులు
తారక బ్రహ్మ విద్యాదాత యౌదల, విరులు పూన్పఁగ నేర్చు కరము కరము

తే. ధవళకర శేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థి తిరుగంగ నేర్చిన యడుగులడుగు
లంబికా నాయక ధ్యాన హర్ష జలధి
మధ్యమునఁ దేలి యాడెడు మనసు మనసు" (భీ. పు. 3–197)

పోతన :

సీ. "కమలాక్షు నర్చించు కరములు కరములు.. (భాగ. 7–169)

ఇత్యాదిగా వ్రాసెను.

శ్రీరంగనాథరామాయణమునుండి, నిశ్శంక కొమ్మన శివలీలావిలాసము నుండి, గౌరన విక్రమార్క చరిత్రమునుండి, అనంతామాత్యుని భోజరాజీయము నుండి, మరికొన్ని గ్రంథములనుండి పూర్వకవుల నుండి భక్తిశృంగారాత్మకమైన అనుకరణ ములు పోతనగారి భాగవతములో కొల్లలుగా చూపవచ్చును.

అనుకరణ మనునది ఒక కళ. కళ అను శబ్దములోనే అనుకరణము ఇమిడి యున్నది. "సూర్యా చంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్", అని వేదము చెప్పిన సూక్తిని బట్టి బ్రహ్మదేవుడే సూర్యచంద్రాది గ్రహములను, ఇతర లోకములను పూర్వ కల్పములలో నున్నట్లు సృజించెనని చెప్పబడినది. అనగా ఈ కల్పము నందలి సృష్టి పూర్వ కల్పము నందలి సృష్టికి అనుకరణమే కదా !

కవి కళాకారుడు భగవంతుని సృష్టిలో నున్న విశేషములనే తన కళా సృష్టికి ముడివస్తువుగా స్వీకరించును గాని ప్రకృతి కతీతమైన సరికొత్త సృష్టిని ఆవిష్కరింపలేడు. ప్రకృతిలో ఆరురసము లుండగా సాహిత్యములో తొమ్మిది రసము లున్నవి. కాని అసలు రసమనునది ప్రకృతి సిద్ధమే. అట్లే సుఖదుఃఖములు కూడను ప్రకృతిలో సుఖదుఃఖములుగనే అనుభూతము అగుచుండగ కావ్యకళలో దుఃఖము కూడ సుఖముగ అనుభూతము కావచ్చును. కాని అసలే ఎందునూ లేని సుఖమును కళాకారుడు ఆవిష్కరింప లేడు కదా !

ప్రపంచములో సహజముగ నున్న సూర్యోదయచంద్రోదయ, మేఘారణ్యసాగర ప్రవాహపర్వతాదివృక్షములను నిత్యము చూచుటలో క్రొత్తదనము ననుభవింపలేని మానవులకు అవ్యక్తములనే తత్త్వములను వివిధవర్ణనసన్నివేశపూర్వకముగ కవిచిత్రకారాది కళాకారులు ఆవిష్కరించగా అందలి వైలక్షణ్యమునకు ఆకృష్టుడై అట్టి కళాహృదయము గల సౌందర్యపిపాసువు సందర్శించి పరవశించు చుండును. ఇట్లు చూడగా అనుకరణము కళకు సహజ మనియు తదభావ మసాధ్య మనియు, పైగా అది కళాకారునకు కొన్నింత దోషము కాదనియు తెలియుచున్నది.

నన్నయాదులు అనువాదములనే వెలయించిరి గనుక అందులో అనుకరణ ముట్టుగా ఉండక తప్పదు. ఈ అనుకరణ కళను మరికొంత ముందుకు నడిపించుచు శ్రీనాథుడు తాను ఏ గ్రంథము ననువదించెనో దానినే గాక సందర్భోచితముగ తదితర

గ్రంథములందలి మనోహరఘట్టములను పలుకుబడులను, సమాసాదికములను అనుకరించి చూపెను. కాశీ ఖండములో మయూరశతకము, శివరాత్రి మాహాత్మ్యముతో కాదంబరి, హరవిలాసములో అనర్ఘరాఘవము ఇత్యాదులు చోటు చేసికొనుట జగద్విదితమే.

అట్లే పోతనామాత్యుఁడు కూడ తన భాగవతములో కొన్ని కొన్ని ముఖ్య సన్నివేశములను చిత్రించు పట్ల తన పూర్వ కవులను అనుకరించినట్లు పై పరిశీలన వలన తెలియుచున్నది. ఇది ఆయా గ్రంథముల పట్ల తనకు గల ప్రగాఢపరిచయమును, తత్కర్తల పట్ల గౌరవమును తెలియఁ జేయునే గాని గ్రంథచౌర్యము క్రిందికి రాదు. తనదిగా ప్రతిపాదింపఁ బడిన దేమియు లేక అందలివి ఇందలివి తునకలు తునకలుగ గ్రహించి ఒకచోట కూర్చినదిగనే యున్నచో అట్టిది దోషమగును గాని తన వ్యక్తిత్వము స్థాపించుట దానికి ఉపబృంహణప్రాయముగ ఇతర గ్రంథముల ననుకరించుట దోషము కాదు.

*శృంగారాత్మకసన్నివేశములలో పోతనార్యుననుకరించి యనుసరించిన అనంతరకవులు :*

పోతన తన రచనలో పెక్కుమంది పూర్వకవుల మనోహరవాగ్గుంభనల ననుకరించినను తనదిగా చెప్పుకొన దగిన వ్యక్తిత్వవిశిష్టమైన ఒక 'బాణి' ని సాహిత్యరంగమున స్థాపించి శబ్దశక్తిని, అర్థశక్తిని సహృదయహృదయాహ్లాదకరముగ నిక్షేపించి కొంతమంది అనంతరకవులకు అనుసరణీయుఁడు కాఁగలిగెను పోతన ననుకరించి యాతని వలె చెప్ప నేర్చిన సంపూర్ణప్రతిభావంతులు లేకపోయినను అనంతరకవుల రచనలలో కనబడునట్టి పోతన భాగవతపద్యపాదముల యనుసరణలు గానవచ్చుచున్నవి.

***శ్రీకృష్ణదేవరాయలు :***

"పోతనామాత్యుఁడు" భాగవతతృతీయస్కంధములో

మ. "లలితోద్యానవనాంతసంచరణ లీలాలోల హంసాళి కో
కిల పారావత చక్రవాక శుక కేకిందిందిరానీక ము
త్కలికం గృత్రిమ పక్షులన్ నిజ విహంగశ్రేణి యంచున్ గుతూ
హలియై పట్టఁగఁ బోవ నాథుమందఁ బ్రీతిశాఖారోహణ వ్యాప్తులన్"
(భాగ. 3-803)

అని వ్రాసిన పద్యమునకు ఛాయగా విల్లిపుత్తూరు నగరమును వర్ణించుచు ఆముక్త మాల్యదలో "శ్రీకృష్ణదేవరాయలు"

మ. "లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానము
ల్వలతీ సీల హరి న్మణి పిక శుక స్వానభ్రమం బూన్ప మి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడఁ జెన్నొందు శ్రీ
విల్లిపుత్తూరు సెలంగుఁ బాండ్య నగరోర్వీరత్నసీమంతమై" (ఆము. 1-51)

*2. అనంతుని భోజరాజీయములో భక్తిమయ సన్నివేశములు పోత నాద్యాని భాగవత పద్యములతో ఈ క్రింది విధముగా పోలి యున్నవి.*

*పోతన :*

సీ. "కమలాక్షు నర్చించు కరములు కరములు... (భాగ. 7-169)

*అనంతామాత్యుఁడు :*

ఉ. "కన్నులు విష్ణుమూర్తులకు సొమ్ముగ, జిహ్వలు విష్ణుమూర్తి యా
లాప సుఖంబుఁ జెందఁగ (భోజ. 2-28)

*పోతన :*

సీ. "ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు, నొకచోటనక నిండి యుండనేర్తు
నెవ్వాని వాఁడనం జేయని పలుకుదు, నాయంతవాఁడ నై నడవనేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతు, బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ, నేరుపు లన్నియు నేన నేర్తు

ఆ. నొరులు గాక నాకు నొరులకు నే నొదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ బొల్లిఁ గలదు సెప్పెద నా వెంకి
సుజనులందుఁ దఱుమఁ జొచ్చియుందు" (భాగ. 8-552)

*అనంతుఁడు :*

సీ. "ఒక చోటఁ గాదు నా యునికి నెచ్చట నైన
నుండుదుఁ జుమ్మ నాపంత నేను
ననుఁ బ్రీతి నింత రమ్మని పట్టె దళనంబుఁ
బెట్టు ధర్మ పాత్రిణిఁ బుట్టు నొక్కొ... (భోజ 8-189)

*పోతన :*

ఉ. "అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమందు నేఁ
బుట్టి యజింపఁగా మనసు పుట్టిన యజ్ఞ పదార్థ జాతముల్
నెట్టన గానరామికిని నిర్మలమైన తదీయ రూపమున్
గట్టిగ బుద్ధిలో నిలిపి కంటి నుపాయము నామనంబునన్" (భాగ. 2-98)

*అనంతుఁడు :*

ఉ. "ఆదికి నాదియైన పరమాత్ముని నాభిసరోజమందు... (భోజ. 1-150)

*పోతన :*

మ. "కనియెం దాపస పుంగవుండఖిల లోకఖ్యాత వర్తిష్ణు... (భాగ 3-148)

*అనంతుఁడు :*

మ. "కనియెస్వప్రుత్రిఁడు సర్వలోకహితవిఖ్యాతన్ జగన్మాత... (భోజ. 2-11)

*8. కోఱవి గోపరాజు :*

గోపరాజు "సింహాసన ద్వాత్రింశిక" యందు పోతన ననుసరించి యున్నాఁడు. "గోపరాజు పోతనకుఁ జివరి దినములలో సమకాలికుఁడు" (పోతన-

నిడుదవోలు వేంకటరావు) "గోపరాజు శ్రీనాథయుగములో తుది దశాబ్దిలోని వాఁడుగా పొడకట్టును" ((ఆం. సా. చ - పింగళి లక్ష్మీకాంతం-512) గోపరాజు శైలి ఇంచుమించు వ్యావహారిక భాషకు సన్నిహితముగా నుండును. ఇతఁడు తన గ్రంథమును హరిహరనాథునకు కృతి ఇచ్చెను. హరిహరులకు విడివిడిగా నితఁడు పద్యములు సమర్పించెను.

*పో త రా జు :*

ఉ. "పుణ్యుఁడు రామచంద్రుఁ డటఁ బోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హలా
వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్" (భాగ. 9-267)

*గో ప రా జు :*

ఉ. "పుణ్యపథంబు భంగి భయ హేతుగము గౌంచక నొచ్చె దండకా
రణ్యము వైరగర్వితహిరణ్యము తాపసచిత్తనిర్వృ రా
గణ్యము గంధ బంధుర సుశోభిత గోపనరాజ అప్రమా
గణ్యము పత్రపుష్పఫల నగరాజ పుణ్యజనాను సుణ్యమున్"
(సిం ద్వా, 5-58)

*పో త రా జు ;*

మ. "నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నా
దిరుగన్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య! వే యేటికిన్"
(భాగ. 8-592)

గోపరాజు :

ఉ. "మేరువు సంచలించిన సమీరుఁడు నిల్చిన భూమి క్రుంగినన్
దారక లెల్లఁ డుల్లిన సుధాకరుఁ డగ్నికణంబు లొల్కినన్
వారిధు లింకిన న్నభము వ్రాలిన భానుఁడు చల్లనైన నం
భోరుహ సూతి తప్పినను బొంకుదునే మనుపాడి కల్పమ్ములన్"
(సిం. ద్వా. 5–199)

4. వెన్నెలకంటి సూరన :

ఇతఁడు పోతనగారి చాటువును తన విష్ణు పురాణములో ఈక్రింది విధముగా అనుకరించెను.

పోతన :

ఉ. "కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల! యోమదంబ! యో
హాటక గర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ" (భాగ. పీఠిక)

వెన్నెల కంటి సూరన :

ఉ. "కాటుక కంటినీరుఁ జనుదట్టుపు జాసిన చీరకొంగు... (వి. పు. 8–98)

5. రేపము రఘునాథామాత్యుఁడు :

ఇతఁడు తన కులశేఖర మహీపాల చరిత్రములో ఇట్లనుకరించెను.

పోతన :

చ. "నగు మొగమున్ సుమధ్యమును నల్లనిదేహము లచ్చికాటఁ
ట్టగు నురమున్ మహాభుజము లంచిత కుండల కర్ణముల్ మం
దగతియు నీలవేణియుఁ గృపారస దృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్మగఁ బొడసూపు గాతఁగను మూసిన యప్పుడు విచ్చినప్పుడున్"
(భాగ 9-732)

**రేపము రఘునాథాచార్యుఁడు :**

చ. "నగు మొగము సుమేరు విశాలనయనమ్ములు చక్కని చెక్కుదోయి చె
న్నగు నరుణమ్ము పెన్నురము నంచిత బాహుయుగంబు మొత్తెపున్
జిగిగల కౌస్తుభ ప్రభాసన చిన్నియొయారపు చెయ్యిలొప్ప సొం
పగు పురుషుంకునాయకల నాదర మేర్పడ గోచరించినన్"

(శు. మ. చ. 1-15)

**6. కోట శివరామకవి :**

ఇతఁడు సానందోపాఖ్యానమను ఒక ప్రసిద్ధ గ్రంథమును రచించెను ఈ కవి

**పోతన :**

సీ. "కమలాక్షు నర్చించు కరములు కరములు... (భాగ. 7-169)

అను పోతనగారి ప్రహ్లాదచరిత్రములోని పద్యము ననుసరించుచు

సీ. "శివు నపేక్షించిన చిత్తంబు చిత్తంబు, శివు కథ లాలించు చెవులు చెవులు
కటకటంబుల బూజించు కరములు కరములు, శ్రీశంభు వర్ణించు జిహ్వ జిహ్వ
గౌరీశుఁ దొలగగను కన్నులు కన్నులు, మదన వైరికి మ్రొక్కు
నుదురు నుదురు
హరు మందిరము మెట్టు నడుగులు నడుగులు, సర్వేశు జపియించు
జపము జపము

తే. భర్గుగాని యూడ నేర్చిన భక్తి భక్తి
చిన్మయాత్ముని సేవించు సేవ సేవ
నీలకంధరుఁ దల పోయు నేర్పు నేర్పు
శర్వు మహిమంబుఁ జెప్పిన చదువు చదువు

అను పద్యమును ఈ కవి సానందోపాఖ్యానమున రచించెను

వణిశెట్టి :

పదునాఱవ శతాబ్దికి చెందిన ఈకవి "పరతత్త్వ రసాయనము" అను గ్రంథమున పోతనామాత్యుని భాగవతము నందలి భక్తిమయసన్నివేశములను అధిక గా ననుకరించినాఁడు.

పోతన :

''పలికెడిది భాగవత మఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండు గాథఁ బలుకఁగ నేలా" (భాగ. 1-16)

శెట్టి:

''చిలుకను బంజరమున నిడి
పలికింపఁగ రామ కథలు పలికిన యట్లే
పలికెదఁ బరతత్త్వార్థపుఁ
బలుకులఁ బలుకుల గురుండు పలుకై యుండన్" (ప. సా. 1-24)

పోతన :

"కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే? పవన గుంఫిత చర్మ భస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే? ఢమఢమ ధ్వని తోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే? తరుశాఖ నిర్మిత దర్వి గాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే? తను కుడ్య జాలరంధ్రములు గాక

చక్రి చింతలేని జన్మంబు జన్మమే?
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే?
పాదయుగము తోడి పశువు గాక" (భాగ. 7-170)

వ డో భ ట్టు :

సీ. "కమలాక్షు మూర్తి నారంగఁ జింతింపదే, మనము గాదది దుఃఖవనము గాని
పరమాత్మ చర్యలాదరణఁ గీర్తింపదే, నాల్క గాదది చెడు ముల్కి గాని
భువనేశు పూజ లే పొద్దాచరింపదే, కరము గాదది భవాకరము గాని
కేశవార్పిత విధి క్రియలందు నడలని, మూర్తి గాదది దుఃఖస్ఫూర్తి గాని

గీ. పరమ పురుషావలోకన పారవశ్యఁ
దగును సర్వేంద్రియ వ్యవహారములను
హరి పరాయత్తుఁడై యుండఁ దయ్యేనేని
నరవరుఁడు గాఁడు వాఁడు వానరపశుండు" (ప. ర. 1-65)

పో త న :

సీ. "సంసార జీమూత సంఘంబు విచ్చునే? చక్రి దాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లాఱునే? విష్ణు సేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాశు లింకునే? హరి మనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లణఁగునే? పద్మాక్షు నుతి రవిప్రభలు లేక

తే. నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తి నిధిఁ గానవచ్చునే? ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకు నైన దానవేంద్ర!" (భాగ 7-171)

భ ట్ భ ట్టు :

సీ. "హరినామ కథన దావానిలోద్ధతిచేతఁ, దూలదే ఘోరాఘతూల సమితి
కంజాక్షవర్ణనా కర్ణనార్కునిచేతఁ, జాఱదే మాయాంధకారపటలి
విష్ణు సేవామృతవృష్టిధారలచేత, నాఱదే కర్మతాపానలంబు
కమలేశ్వర ధ్యాన గరుడాస్త్రముచేత, విరియదే విషయాహి విషభయంబు

గీ. జన్మలయ వేగమగు దుర్విచార వారి
పూర దుర్వార కామాది ఘోర నక్ర
చార సంచార వారాశి సమసి పోదె
పంకజోదర పదభక్తి బాడబమున" (ప. ర. 3-284)

**పోతన :**

సీ. "మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే? మదనములకు... (భాగ. 7-150)

**7. ఫణిభట్టు :**

సీ. "కర్ణరంధ్రంబు లా మనుని పలుకులింపు
చవి నంపి యొక వంక జరుగ వెపుడు...

**పోతన :**

మ. "పరుఁడై యీశ్వరుఁడై, మహా మహిముఁడై ప్రాదుర్భవ స్థాన సం
హరణ క్రీడనుఁడై త్రిశక్తి యుతుఁడై యంతర్గత జ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకున్ భావింపరాకుండు దు
స్తర మార్గంబునఁ జేఱరిల్లు హరికిందత్త్వార్థినై మ్రొక్కెదన్"
(భాగ. 2-58)

**ఫణిభట్టు:**

మ. "చిరమై నిర్మలమై మహావిభవమై చిన్మాత్రమై సత్యమై
పరమై సంతత సంయమీశ్వర మనఃప్రత్యక్షమై నిత్యమై
పరిగీతారణ్య దవార్థియై మదిని భక్తుల్గోరు నర్థంబునై
స్థిర బాహంబునఁ బోమ బ్రహ్మము మదిన్ సేవింతుఁ దత్త్వార్థినై"
(ప. ర. 1-132)

ఈ విధముగా అనంతరకవులు పూర్వకవుల భావములను ప్రతిబింబు కొనుట, పలుకుబడుల ననుకరించుట సాహిత్యరంగములో అనాది సిద్ధముగా కానవచ్చుచునే యున్నది. "అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః" అని పెద్దలు చెప్పియున్నారు.

మానవుడు తన జీవన నిర్వహణ మందు తన తాతతండ్రుల ననుకరించుచు వారియందలి గుణములు స్వీకరించుటకు ప్రయత్నించుచున్నాడు. అట్లే వాని యనుయాయులు కూడ వాని గుణములు అనుకరించుచు జీవితము గడుపుచున్నారు. ఇది మానవులకే గాక సమస్తప్రాణి కోటికి సాధారణమైన విషయమే.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే" (గీత 3-21)

శ్రేష్ఠుడగు మానవుని జూచి ఇతరులు వాని వేషభాషలను ఆచార వ్యవహారములను అనుకరింప జూతురు. శ్రేష్ఠుడగు కవి విషయమున గూడ అంతే. అట్లనుసరించుట దోషమని కొట్టి పారవేయుట పాడిగాదు. అందలి ఔచిత్యమును అవగాహనము గావించుకొని ప్రస్తుతింప వలసిన అవసరమున్నది.

పోతన కొందరికి శిష్యప్రాయుడైనట్లే అనంతరకవులకు కొందరికి గురుస్థానీయుడయ్యెను. ఈ యనుకరణముల మాటెట్లున్నను అసలు భాగవతములో పోతనగారి చేతిమీదుగా మలచబడిన శబ్దార్థ విన్యాసము అందలి జీవకళయే దాని చిరస్థితికి కారణము.

# ఉపసంహారము

సాహిత్యము పురుషార్థ చతుష్టయ ప్రతిపాదకమై మానవునకు జన్మ సార్థక్యమును ప్రసాదించుట కేర్పడినది. వేదము వలెనే పురాణము, ఆరెంటి వలెనే సాహిత్యము కూడ జగన్మిథ్యాత్వమును, బ్రహ్మసత్యత్వమును ప్రతిష్ఠాపించుటకే ఉద్దిష్టమైనది.

మానవులలో సంస్కార భేదమును బట్టి అధికార భేదముండును గనుక కర్మ పరులకు భారతము, జ్ఞాన నిష్ఠులకు రామాయణము, భక్తి బంధురులకు భాగవతము పరమార్థ సాధకములుగ ఉపకరించును.

భాగవతము భక్తియోగ ప్రతిపాదక మగుటచేతను, భగవద్గుణలీలావతార వర్ణనావిశేషాత్మక మగుటచేతను అంతరంగికమగునే ఆ గ్రంథమునకు పావిత్ర్యము సిద్ధించి యున్నది. ఇట్లుండగ సంస్కృతములో దాని రచయితయు, తెలుగులో దాని అనువక్తయు స్వయముగ భక్తులగుటచే తద్గ్రంథ పరామర్శను సకల విషయముల తగియుండిరి. వ్యాస భట్టారకునకు వ్యాస భట్టారకుండే సాటియైనట్లు పోతనామాత్యునకు పోతనామాత్యుండే సాటి.

అట్టి పోతనగారి చేతిలో ఆంధ్ర భాగవతము నవనవోన్మేషరసాలంకార **మనోజ్ఞమాధురీమంజులమై**, ఆంధ్రజాతికి చిరస్మరణీయము ఐ నిత్యోపాసనా గ్రంథ **రాజము** ఐ విరాజిల్లుచున్నది. అందలి ప్రతి పద్యము, ప్రతి వాక్యము, ప్రతి పదము షడ్గుణైశ్వర్యధర్ముండగు భగవంతుని స్వరూపమును సాక్షాత్కరింపఁ జేయుటకు సమర్థములై యున్నవి. భక్తుల చరిత్రలు వారివారి నైజమును పాఠకుల కన్నులకు కట్టినట్లు పొందుపడి యున్నవి. భావనామాత్ర చాలనముతో నాలుగారు పెక్కు ఖండికలు మానవుల నిత్యజీవితములో పొడసూపు జటిలమయిన సమస్యలకు పరిష్కార **మార్గమును** చూపి మనశ్శాంతిని ప్రసాదింపఁ జేయగలవై వెలయుచున్నవి. గ్రంథ రచనకు ప్రధాన ప్రయోజన మిదియే. ఈ ప్రయోజనమును అనగా మహావాత సంఘాతకల్లోలసముల్లోలకల్లోలినీసంకాశ మగు జీవితమునకు నిస్తరంగ జలాశయ సాదృశ్యము సంఘటించుట ఈ భాగవతమునకు ప్రత్యక్షర సిద్ధమయినది.

భక్తిభావనాపావనతరంగిణిని రసజ్ఞాంధ్రహృదయక్షేత్రములపై పొర్లఁ బారించి వారి సాహిత్యప్రీతికి ఆధ్యాత్మ విద్యను, ఆధ్యాత్మిక విభూతికి సాహితీ గౌరవమును సమకూర్చి ఆంధ్రులు ముముక్షువులు రాసిక్య దరిద్రులు కారు సుమా అని సారస్వతేయుల కెల్లరకు తెల్లముఁజేసిన ఘనతను పోతనామాత్యుఁడు స్వకీయము చేసికొనెను. విద్యలలోని కెల్ల ఆధ్యాత్మ విద్య అతి ముఖ్యము ఐనదని నిర్వచించు భగవద్వాక్యము జితేంద్రియులు, యోగానందులు, అనుభూత బ్రహ్మ స్వరూపులు నగు సిద్ధుల కెట్లును కరతలామలకమే కాగా, స్వానుభూతైకమాన మగు నా మహోదాత్త స్థితికి జిజ్ఞాసాపరులగు పాఠకసామాన్యులు కూడ బహిర్భూతులు కాగూడదని యత్యుత్తమాశయముతో పోతనామాత్యుఁడు తన ఆంధ్రమహాభాగవతగ్రంథరాజమును నిర్మించునప్పుడు వేదాంత విషయములందు సాధారణముగా గోచరించు శుష్కతను తన అసమాన వాక్చాతురీ విభవాతిరేకముచే ఆర్ద్రమొనర్చి గ్రంథమున కంతకును అనుస్యూతముగా రసోపస్కృతి ననుసంధించుటలో కృతకృత్యుఁడయ్యెను.

స్తోత్రములు, శతకములు మున్నగు భక్తిప్రబోధక గ్రంథము లన్నియు ఆధ్యాత్మ వాసనా వాసితములే అయినను వానిలో అతి ప్రయత్నముతో కాని విరళముగా గోచరింపని రసప్లుతి ఈ భాగవతములో అప్రయత్నముగా, అవిరళముగా గోచరించుట గమనింపఁదగ్గ విషయము. ఇది పోతన్నగారి వ్యక్తిత్వమునకు ప్రత్యక్ష నిదర్శనము. పద సన్నివేశము నుండి ఆవిర్భవించు వర్ణమాధుర్యము అనాటకముగా ఆవిర్భవించుచుండ దానికంటె నతిరిక్తముగను అంతకన్న నధిక భావావేశముతోను గుబాళించు భక్తి పరిమళమునకు తన గ్రంథము నాకరముగా చేసిన ఈకవి ఈ మహా వైశిష్ట్యముతో తనకు మహాకవుల సరసను సముచితస్థానము సంపాదించుకో గలిగెను.

ఓం తత్ సత్.

# అనుబంధము I

**పోతనను గూర్చి ప్రాచీన నవీన కవులు కొందఱు ప్రశంసాత్మకముగా రచించిన పద్య రత్నములు.**

పరుల కసాధ్యమై పరగు భాగవతంబు రహస్యమంతయున్
హరికృపచే నెఱింగి మృదులాంధ్రవచో రచనా చమత్క్రియా
కరణ మహాప్రబంధముగ రచియించిన బ్రాహ్మతేజు బ
మ్మెరపుర పోతరాజును సమీకృత తేజు నుతింతు నెప్పుడున్.

—పట్టిసెట్టి సరస్వతి సోమయాజి-ప్పపదితి.

పదలాలిత్యము వాక్శుద్ధి భగవద్భక్తాగ్రసంసేవ్యమున్
పదమత్యున్నతమున్ మహోజ్జ్వలగమున్ పద్మోద్భవానందమున్
చిదచిన్మార్గవిభాగ భాగవతమున్ చింతుంచు నాంధ్రంబుగా
సదయం జెప్పిన పోతరాజు పదముల్ సత్ప్రేమ నే మ్రొక్కెదన్.

—చిదంబరకవి — అంగటి [illegible]

దైవము మానవాకృతినిఁ దాల్చి జగద్ధిత భక్తి నిల్పఁగా
భావమునందలంచి వరభాగవతంబును తెల్గుబాసలో
ఠీవి ననన్యసాధ్యముగ సేవ రచింపఁగఁజేసి లోకస
ద్భావన మీఱ దా వఱలు బమ్మెర పోతన నెంతు సత్కవిన్.

—నందిరాజు చలపతిరాయకవి - మంగళగిరి : [illegible]

అఖిల వేదాంత విద్యారహస్యవిదుండును, సహజపాండిత్య విశారదుండును
మత్తక్షితీశాశ్రమ స్తోత్ర విముఖుండును, శంభుపదాబ్జ పూజారతుండును
పటుతర కవితా విభాసిత ప్రతిభుండును, సకలాంధ్ర లక్షణ పరిష్కృ
తముతులో నీదేశరచిత మహాభాగవతపురాణక పుణ్యవర్ధనుండు

బుధజనమహితుండు బొమ్మెర పోతసుకవి
యెన్న రేఫ రకారంబు లెరుగడనుచు
నజ్ఞు లొకకొంద రాడుదు రమ్మహాత్ము
కవిత నెందును లోపమ్ము కలుగ దభవ!

—కూచిమంచి తిమ్మకవి – సర్వలక్షణసార సంగ్రహము

"భాగవతంబు సర్వరసబంధురముం దెలిగించినాఁడు స
ర్వాగమసారవేది యజరామరముగాఁ జెయిసాఁచకే మహా
భాగుఁ డితం" డటంచు నరపాలురు మెచ్చఁగ జీవితంబు సాం
పౌ గతి నోమినాఁ డితరు లౌదురె పోతనవంటి సత్కవుల్!

– తిరుపతి వేంకటకవులు - చాటుపద్య సంపుటము.

వ్యాసపీఠము పక్ష పాసికపట్టుతో, భావగతమ్ముగా భాగవతము
భారతీ తీర్థంబు, బాదరాయణ మూని, సాధుమేధా సహస్రారధార,
శుకముని సుఖవిని స్సృత సుధాపూరంబు, రసనిర్భర కవితారామ సరసి,
భక్తిభావతరంగ బంధురాపగ, భగవద్దివ్య గుణగణ వర్ణనా మ

హార్ణవమ్ము నాపోశనం బవధరించి
ఆంధ్రమున నమ్మహా కృతి నక్షరాకృ
తిన్ వెలార్చిన కవిలోక దివ్య సంయ
మికిని మా పోతనామాత్యునకు జోహారు!

– యస్వీ జోగారావు, పంచ కల్యాణి

భ్రమరపదంబులందు భగవత్ప్రకృతి ప్రణయానురాగ త
త్త్వమును సమన్వయించి, పసి పచ్చిక మేయుచు తప్పిపోవు వ
త్సములకు కృష్ణగానమున దారులు చూపి, సుధాధునీతరం
గ మృదుమృదంగ భంగి కవికాంతుఁడు పోతన విన్పెతెన్గునన్.

– రాయప్రోలు సుబ్బారావు – ఆంధ్రావళి

అమృతమహాంబురాశి తెలుగై మఱి భాగవతమ్మునై త్రిలిం
గమునకు డిగ్గెనేమొ యనఁగా హృదయమ్ముల నాడు నేడు నా
ట్యము లొనరింప పోతనమహాకవి ముద్దులపద్దెముల్ శతా
బ్దము లయిపోవుగాక మఱవన్ తరమే రసిం ప్రాణాళికిన్ ।

– దాశరధి – ఆంధ్రజ్యోతి, 14-3-1982

అచ్చపు జుంటితేనియల, నైందవబింబసుధారసాల, గో
ర్వెచ్చని పాలమీగడల, విచ్చెడి కన్నెగులాబి మొగ్గలన్
మచ్చరికింప ఈ మధురమంజుల మోహనముగ్ధశైలి నీ
వెచ్చట నేర్చినావు? సుకవీ! సుకుమార కళా కళానిధీ!

ఎండిన మోడులే కిసలయించెనొ! యేకశిలాపురమ్ములో
బండలు పుల్కరించెనో! అపారసుధమ్మున తెల్గుతల్లికిన్
గుండెలు పొంగిపోయి కనుగల్కలు నిండెనొ! పచ్చిపైరులే
పండెనొ! జాలువారిన భవత్కవితామృత భక్తిధారలన్!

– కరుణశ్రీ – ఉదయశ్రీ.



# అనుబంధము II

## ఉపయుక్త గ్రంథ పట్టిక

### 1. తెలుగు


1. ఆంధ్ర కవితరంగిణి - చాగంటి శేషయ్య - హిందూధర్మశాస్త్ర గ్రంథ నిలయము కపిలేశ్వరపురము - 1960

2. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము - చలమచర్ల రంగాచార్యులు - శ్రీనివాసా పబ్లికేషన్సు, హైదరాబాద్ - 1972

3. ఆంధ్ర భాగవత విమర్శ - ప్రసాదరాయ కులపతి - బ్రాడీపేట - గుంటూరు

4. ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు - వివిధ రచయితలు - ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్ - 1969

5. ఆంధ్ర మహాభారతము - (విరాటోద్యోగ) - తిక్కన. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాస్ - 1964

6. ఆంధ్ర మహాభారతము - నన్నయ - (ఆది) - వావిళ్ళ - 1959

7. ఆంధ్ర మహాభారతము - నన్నయ - (అరణ్య) - వావిళ్ళ

8. ఆంధ్ర సాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మీకాంతం - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. హైదరాబాద్ - 1974

9. ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు - ఆం. సా. అకాడమి - 1967

10. ఉత్తర హరివంశము - నాచన సోముడు - ఆం. సా. అకాడమి - 1979

11. ఒంటిమిట్ట రఘువీర శతకము - అయ్యలరాజు త్రిపురాంతకుడు

12. కావ్యాలంకార సంగ్రహము - శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి వివరణం (రామరాజ భూషణుడు) యం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం - 1976

13. కాళహస్తీశ్వర శతకము - ధూర్జటి - గొల్లపూడి వీరాస్వామి సన్స్ రాజమండ్రి - 1972

14. కులశేఖర మహీపాల చరిత్రము – శేషం రఘునాథాచార్యులు

15. క్రీడాభిరామము – వినుకొండ వల్లభరాయడు – శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ప్రచురణము 1960

16. చతుర్వేదసారము – పాల్కురికి సోమనాథుడు – ఆంధ్రపత్రికా ముద్రణాలయము – చెన్నపురి

17 చాటుపద్యమణిమంజరి – శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి – మణిమంజరి, ముద్రాలయం – 1962.

18. నారదభక్తి సూత్రములు – అనువాదకులు – దొడ్ల వెంకట రామిరెడ్డి, శ్రీరామకృష్ణ మఠము – ప్రచురణము, మద్రాస్ – 1971

19. నృసింహపురాణము – ఎఱ్ఱన, వావిళ్ళ – 1953

20. పరతత్త్వ రసాయనము – [illegible]

21. పోతన – వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, ఆం. సా. అకాడమి – 1975

22. పోతన – నిడదవోలు వెంకటరావు – నేషనల్ బుక్ ట్రస్టు ప్రచురణ – 1982

23. పోతనగారి వైచిత్రి – చేతవరపు రామకోటశాస్త్రి – క్వాలిటీ పబ్లిషర్సు, విజయవాడ – 1982

24. పోతన సాహిత్య గోష్ఠి – సంపాదకుడు – కొర్లిపాటి శ్రీరామమూర్తి ఆంధ్రాయూనివర్సిటి ప్రెస్ – వాల్తేరు – 1984

25. బసవపురాణము – పాల్కురికి సోమనాథుడు – ఆంధ్రపత్రికా ముద్రణాలయము, చెన్నపురి – 1952

26. భక్త పోతన మహాభాగవత రచన – ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి విజయలక్ష్మి పవర్ ప్రెస్ – అమలాపురం – 1977

27. భర్తృహరి సుభాషితము – భర్తృహరి – వావిళ్ళ – 1968

28. భాగవత వైజయంతి – సంపాదకుడు – కరుణశ్రీ – ఆం. సా. అకాడమి, హైదరాబాద్ – 1983

29. భారతి – వివిధ సంపుటములు

30. భాస్కర రామాయణము - భాస్కరుడు.
31. భీమేశ్వర పురాణము - శ్రీనాథుడు, వావిళ్ల - 1958
32. భోగినీ దండకము - పోతన — ఆం. సా. అకాడమీ - 1980
33. భోజరాజీయము - అనంతామాత్యుడు - వావిళ్ల - 1924
34. రసగంగాధరమణి—జమ్ములమడక మాధవరామశర్మ-కైలాస ముద్రణాలయము - గుంటూరు — 1955
35. రససిద్ధాంతము - ఆంధ్రులపరివస్య - తిప్పాభట్ల రామకృష్ణమూర్తి - నవోదయ పబ్లిషర్స్ — విజయవాడ - 1981
36. విజయ విలాసాను శీలనము - డా. కలిదిండి వెంకట రామరాజు ప్రచురణ - శ్రీమతి కలిదిండి పర్వత వర్ధనమ్మ - భీమవరం - 1983
37. విష్ణు పురాణము - వెన్నెలకంటి సూరన
38. వీరభద్ర విజయము - పోతన - వావిళ్ల - 1952
39. శృంగార పోతన—బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి-ఆంధ్రసారస్వత పరిషత్తు - హైదరాబాదు - 1972
40. శ్రీ భోజమహారాజశృంగారప్రకాశము - జమ్ములమడక మాధవరామశర్మ అభినవ భారతి - గుంటూరు - 1970
41. శ్రీమదాంధ్ర భాగవతము - దశమస్కంధము - పోతన - సంపత్తి నాగేశ్వర శాస్త్రులు - ముద్రాక్షరశాల - 1884
42. శ్రీమదాంధ్రభాగవతము - పోతన - వావిళ్ల - 1952
43. శ్రీమదాంధ్రభాగవతము—పోతన వెంకట్రామా అండ్ కో - విజయవాడ - 1953
44. శ్రీమద్భాగవతానుశీలనము—నూశివాం త్రిరామమూర్తి - మారుతి నగర్, విజయవాడ, పటీథాని, ప్రాగ్జణ.
45. సింహాసన ద్వాత్రింశిక - కొఱవిగోపరాజు - ఆం. సా. అకాడమి - 1982
46. సుమతీ శతకము భద్రభూపాలుడు-గొల్లపూడి వీరస్వామి సన్స్ రాజమండ్రి - 1987
47. హరవిలాసము - శ్రీనాథుడు - వావిళ్ల 1949

15. శ్రీమద్భాగవతము - వేదవ్యాసుడు - వావిళ్ళ 1941

16. సరస్వతీ కంఠాభరణము - భోజుడు - పాండురంగ జవాజీ పబ్లిషర్సు
బొంబాయి - 1934

17 హితోపదేశము - వ్యాఖ్యాత - ఎన్. వి. కె. సుబ్బరాజు
విద్యానిలయ ప్రచురణలు - భీమవరం - 196

---

## 3. ENGLISH

1. A History of Sanskrit Literature - A. A. Macdonell

2. A study of Bhagavata Purana or Esoteric - Hinduism -
Purnendu Narayan Sinha

3. Gitanjali - Ravindranath Tagore.

4. Studies in the Philosophy of Madhu Sudana Saraswati -
S Gupta, Sanskrit Pustak Bhandar, Calcutta - 1966

5. The History of Indian Literature - Albrecht Weber.



# పోతన ఆంధ్రమహాభాగవతమున

# భక్తి శృంగారములు

ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి డాక్టరేటు పట్టము పొందిన

సిద్ధాంత గ్రంథము


డాక్టర్ కనుమూరి బలరామకృష్ణ సుబ్బరాజు

ఎం. ఎ., పిహెచ్.

ఆంధ్రోపన్యాసకులు, పి. జి. కోర్సెస్

డి. యన్. ఆర్. కళాశాల - భీమవరం

ప్రథమ ముద్రణము ప్రతులు : 1000
( మే 1990 )



వెల : రూ. 50/-

ప్రతులకు : **శ్రీమతి కె. వంజి**
C/o. డా. కె. వి. కె. సుబ్బరాజు
లెక్చరర్,
పి. జి. తెలుగు శాఖ
డి. యన్. ఆర్. కాలేజి
భీమవరం - ప॥ గో॥ జిల్లా

: ముద్రణ :
*శ్రీ కౌసల్యా ప్రింటర్స్ & బైండర్స్ : భీమవరం - 1*



డా॥ కె. వి. కె. సుబ్బరాజు

జననము : 27-10-1957

స్వగ్రామము : ధర్మారావుపేట, కొయ్యలగూడెం మండలం, ప॥ గో॥ జిల్లా

జననీజనకులు : సరస్వతీరంగరాజులు

ధర్మపత్ని : శ్రీమతి మణి

విద్య : స్వామి జ్ఞానానంద ఓరియంటల్ హైస్కూలు-గరగవమూడి
ఇంటర్, బి.ఎ. - డి.యన్.ఆర్. కళాశాల -
ఎం.ఎ, ప్రథమశ్రేణి - డి.యన్.ఆర్.సి., పి.జి. కోర్సెస
పిహెచ్.డి. - ఆంధ్ర విశ్వవిద్యాలయము - వా

ఉద్యోగము : ఆంధ్రోపన్యాసకుడు - పి.జి. కోర్సెస - డి.యన్.ఆర్. క
భీమవరము

అభిమాన విషయములు : ఆర్షవాఙ్మయము - సనాతన సంప్రదాయము - ఆధ్యాత్మిక
రచనావ్యాసంగము - క్రీడలు